# చేగొండి

## కథా కదంబం

(చేగొండి సరదా/సరస కథలు)

(వివిధ పత్రికలల్లో, అంతర్జాలంలో వచ్చిన కథల సంకలనం)

**రెండవ భాగం**

రచన

చేగొండి రామజోగయ్య



ప్రచురణ :

యువభారతి

రిజిష్టర్డ్ నెం. 1/64

సాహితీ సాంస్కృతిక సంస్థ

తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500001

# CHEGONDI KATHA KADAMBAM

(Compitation of Humourous and Romantic Stories Written by Sri Chegondi Ramajogaiah and Published in Various Magzines and or Internet)



ప్రచురణ సంఖ్య : 198

ప్రథమ ముద్రణ : ఆగష్టు 2022

ముద్రణ సహకారం : పుస్తక శిల్పి తాళ్ళపల్లి మురళీధర గౌడ్

ముఖ్యపత్ర రూప కల్పన : నవ్య ప్రింటర్స్, మోతీనగర్,
హైదరాబాద్ – 500014

అక్షరాల కూర్పు డి.టి.పి. : నారికిమెల్లి అంబిక

లే అవుట్ : మల్యాల హరి, బాలసాయి గ్రాఫిక్స్,
సనత్‌నగర్, హైదరాబాద్, 9985128532

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైదరాబాద్

ప్రతులకు : సాహిత్య సాంస్కృతిక సంస్థ
తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ – 500001
చరవాణి – 9849909896, 9391373684

2. చేగొండి రామజోగయ్య, బ్లాక్ నెం. 11,
ఫ్లాట్ నం. 502, మైహోమ్ విహంగ, నానక్‌రామ్‌గూడ,
(నల్లగండ్ల), 'విప్రో' సర్కిల్, ఫైనాన్షియల్ డిస్ట్రిక్ట్ దగ్గర,
హైదరాబాద్ – 500032.
ఫోన్ – 9391007780, 99908036333

వెల : ₹ 150/– (గ్రంథాలయాలకు ఉచితం)

**డా. ఆచార్య ఫణీంద్ర 'యువభారతి' సాహితీ సాంస్కృతిక సంస్థ హైదరాబాద్**

# కథా గుచ్ఛం

సత్సాహిత్య పఠనం సామాజికుల హృదయాంతరాలలో దాగి ఉన్న సామానస్యాన్ని తట్టి లేపి, సాటివారితో సత్ప్రవర్తనతో మెలగి సల్లక్షణాన్ని పెంపొందించేందుకు దోహదపడుతుందని మా యువభారతీయుల విశ్వాసం.

'సత్సాంప్రదాయక సాహిత్యమే సదా మాన్యత గూర్చు సమాజమునకు, విఖ్యాత సాహితీవేత్తల గ్రంథాలె సౌమనస్యము బెంచు జనుల యందు, పండిత ప్రముఖుల ప్రాసంగిక విషయాలుద్ధరించును నవ యువత' ననుచు – ఆశావహ మహోన్నతాశయ సిద్ధికై సాహితీ సేవలో సఫల మగుచు ఆరువదేడుల పాటుగా నలుపెరుగక భవ్యమగు సభల్, సద్గ్రంథ ప్రచురణముల జరుపుచు సమస్త సాహితీపరుల హృదుల స్థిరముగా నిల్చె 'యువభారతి" ఘన సంస్థ!.

"యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ ఈ సంవత్సరం విజయ దశమి పర్వదినం నాటికి షష్ఠిపూర్తికి సిద్ధమౌతున్న పరిణత మూర్తిమంతంతో సాహితీ లోకంలో నిటారుగా నిలువబోతున్నది. ఈ ఆరు దశాబ్దాల సుదీర్ఘ కాలంలో యువభారతి సంస్థ అనేక శ్రోతవ్య సాహితీ ప్రసంగాలతో కూడిన రసవత్సభలను నిర్వహించడంతోబాటు, బహుళాదరణను పొందిన సత్సాహిత్య గ్రంథాల నెన్నంటిన ముద్రించి పాఠకలోకానికి ఉపాయనంగా సమర్పించింది. ఈ సత్కార్య సాధనలో మా సంస్థ పూర్వాధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తిగారు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు, డా. తిరుమల శ్రీనివాసాచార్య గారు మరియు శ్రీ మాడభూషి అనంతాచార్యుల గారు సలిపిన విశేష కృషి సదా సంస్మరణీయం. అదే విధంగా ఆనాటి నుండి ఈ నాటి వరకు మా సంస్థ వ్యవస్థాపక ప్రముఖులు, సమావేశ కర్త అయిన ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి మార్గదర్శనం మా కెంతో స్ఫూర్తిదాయకం.

ఈ సందర్భంగా యువభారతి గ్రంథ ప్రచురణల సంఖ్య కూడ త్వరలో 200కు చేరుకోబోతున్నదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. భారత స్వాతంత్ర్య పంచ సప్తతి వర్ష పరిపూర్తిని పురస్కరించుకొని, దేశమంతా ముదావహంగా జరుపుకుంటున్న అమృతోత్సవాల సందర్భంగా అలనాటి యువభారతి ప్రసిద్ధ గ్రంథం "మహతి"ని పునర్ముద్రించి మరొకమారు పాఠక లోకానికి నివేందబోతున్నాం. దానితోబాటు "మహతి" కి కొనసాగింపుగా కడచిన ఏబదేండ్ల తెలుగు సాహితీ పరిణామ, ప్రస్థానాలపై వ్యాస సంకలనంగా "అమృతభారతి" అనే నూతన గ్రంథాన్ని కూడా వెలువరించే ప్రయత్నంలో ఉన్నాం.

ఇక.. ప్రస్తుత గ్రంథం – శ్రీ చేగొండి రామజోగయ్య గారు రచించిన కథా సంపుటి. రామజోగయ్య గారు మా సంస్థ సీనియర్ సభ్యులు, ఆయన లోగడ 2008లో యువభారతి ప్రచురణగా 'చేగొండి కథా కదంబం' పేరిట ఒక కథా సంపుటిని వెలువరించారు. ఇప్పుడు మరికొన్ని కథలను మరొక రెండు గ్రంథాలు (చేగొండి కథా కదంబం – 2, 3 భాగాలు) గా వెలువరిస్తున్నారు. ఇవి మా సంస్థ ద్వారా వెలువడుతున్న 198, 199వ ప్రచురణలు. ఈ గ్రంథాలలో రచయిత సమాజంలోని వివిధ అంశాలకు సంబంధించిన పలు కోణాలను స్పృశిస్తూ చక్కని కథలను అందించారు. ఈ గ్రంథం సాహిత్యాభిమానులను... ముఖ్యంగా కథా ప్రియులను అలరిస్తుందని ఆశిస్తున్నాం...

సం./–
(ఆచార్య ఫణీంద్ర)
అధ్యక్షుడు
యువభారతి

# నా మాట

నేను "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థలో ఐదున్నర దశాబ్దాలుగా సభ్యుడిని, మాతృభాషాభిమానినని, సగర్వంగా చెప్పుకోగలనే గాని, తెలుగు సాహిత్యలోకానికి, పాఠకలోకానికి పరిచయం అవసరంలేని ప్రముఖిడిననో, లబ్ధప్రతిష్ఠుడినో మాత్రం కాను – అసాధారణ సాహిత్య సేవ చేసిన ధన్యుడిని కానే కాదు. ఒక సామాన్య రచయితను మాత్రమే.

విద్యార్థి దశలోనో కథలు, వ్యాసాలు వ్రాసిన నేపథ్యం, ఉద్యోగపర్వంలో తొలిరోజుల్లో అంటే చిరుద్యోగిగా ఉన్న కాలంలో రచనా వ్యాసంగం కొంత పరిమితంగా కొనసాగించినా, నా కథలు, వ్యాసాలు వివిధ పత్రికలలో 'సంకలనాల్లో' ప్రచురణ భాగ్యానికి నోచుకున్నా, పదోన్నతుల మూలంగా పెరిగిన ఉద్యోగ బాధ్యతలు భారం మూలంగాను, బదిలీల అసౌకర్యం కారణంగాను, ఉద్యోగ విరమణ చేసే వరకు విరివిగా రాసే అవకాశం లభించలేదు. ఎక్కువగా వ్రాయలేకపోవడానికి ప్రధాన కారణం 'రచనా ప్రతిభ' పరిమితంగానే ఉన్న వాడినన్న స్వీయ మూల్యాంకనం కావొచ్చు. ఇంకోకారణం 'యువభారతి' వంటి సాహిత్య సంస్థలో ఒక సామాన్య కార్యకర్తగా ఉంటేచాలు, అదే పదివేలు, అదే నాకు తగినపాత్ర అనిపించటమేమో కూడా!

ఏమైనా ఉద్యోగ విరమణ తర్వాత, 2003 నుంచి ఇంకో ఉద్యోగంలోనో, వ్యాపారంలోనో చేరడానికి 'ఇష్టం' లేకపోవడం రాజకీయాల్లో (మాది రాజకీయ నేపథ్యం బాగానే ఉన్న కుటుంబం) చేరాలన్న మూర్ఖత్వం కలగకపోవడం మూలాన, సన్నిహితుల మిత్రుల ప్రోద్భలంతో నా రచనా వ్యాసంగాన్ని సుదీర్ఘ విరామం తర్వాత పున: ప్రారంభించడం తప్పనిసరైంది. కాలక్షేపంకోసం కథలు, వచన కవితలు, వ్యంగ్య రచనలు, పరిమితంగాను, సమకాలీన రాజకీయ, సాంఘిక అంశాలపై విరివిగా వ్యాసాలు వ్రాయటం, అవి వివిధ పత్రికలలో ప్రచురించబడటం ఆ విధంగా భవదీయుడు పాఠక ప్రపంచానికి కాస్తో కూస్తో పరిచితుడు మాత్రం కావటం జరిగింది. లబ్ద ప్రతిష్ఠుడినైతే కాలేదనుకోండి. 2008లో 'చేగొండి కథా కదంబం' పేరున కథా సంకలనం, మాతృసంస్థ 'యువభారతి' ద్వారానే ప్రచురితం

కావటం జరిగింది - 2014 వరకు నా రచనా వ్యాసంగం బాగానే (అంటే ఎక్కువగా అని మాత్రమే అర్థం) జరిగింది. రాష్ట్ర విభజన తర్వాత కొన్ని వ్యక్తిగత కారణాలు, అసౌకర్యాలు మూలంగా మళ్లీ కొంత విరామం వచ్చింది. పూర్తిగా ఆగిపోలేదను కోండి - ఇటీవల కాలంలో కథలు ప్రచురించే చాలా పత్రికలు మూత బడినందున కథల రచన అనివార్యంగా మందగించింది. అయితే 'కోవిడ్ కాలం'లో 'తీరిక' మరీ ఎక్కువైపోయి మళ్లీ కథలు రాయటం, అవి కొన్ని పత్రికలలో కొన్ని అంతర్జాల మాధ్యమంలో రావటం జరిగింది. ఇంకా జరుగుతోంది. ఆ కథలలో కొన్ని ఎంపిక చేసిన వాటిని చేగొండి కథా కదంభం (2) మరియు (3) గా మాతృ సంస్థ 'యువభారతి' ద్వారానే రెండు సంకలనాలుగా ప్రచురించాలని, వాటిలో ఒకటి నాకు గురతుల్యులు, 'యువభారతి' పూర్వాధ్యక్షులు కీర్తిశేషులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, రెండోది నా చిరకాల మిత్రుడు, నిరంతర మాతృభాషా సేవా తత్పరుడు, ప్రముఖ రచయిత శ్రీ ఆయల సోమయాజుల నాగేశ్వరరావు గారికి అంకితమివ్వాలన్న సత్సంకల్పం కలిగింది. ఈ రోజుల్లో 'అమూల్యం' అనే పదానికి విలువ పెద్దగా లేనందున ఈ పుస్తకాలకు కొంత వెల నిర్ణయించబడింది గాని తెలుగు రాష్ట్రాలలోని ఎంపిక చేసిన గ్రంథాలయాలకు ఉచితం గానే అందజేయాలన్న నా సంకల్పాన్ని గుర్తించి లాభాపేక్ష లేదని గ్రహించగలరు.

ఈ పుస్తకాల ప్రచురణకు అంగీకరించిన 'యువభారతి' అధ్యక్షులు ఆచార్య ఫణీంద్ర గారికి, ఇతర కార్యవర్గ సభ్యులకి పలువిధాలుగా సహకరించిన తాళ్లపల్లి మురళీధర్ గౌడ్ గారికి, నన్ను అన్నివిధాలా అన్నలా ఎల్లవేళలా ప్రోత్సహిస్తూ వెన్ను దన్నుగా 'మార్గదర్శి'గా నిలిచిన ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారికి, అంకితానికి అంగీకరించిన శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి గారి కుటుంబ సభ్యులకు, శ్రీ నాగేశ్వరరావు గారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు.

భవదీయుడు
చేగొండి రామజోగయ్య
సెల్ నెం. 9391007780



# కృతజ్ఞతలు

"యువభారతి" లో చిరకాల సభ్యులు రచయిత, కథకులు, ఆత్మీయులు శ్రీ చేగొండి రామజోగయ్య గారు గుర్తుంచుకొని డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారి జయంతి మహోత్సవ దినాన వారికి అంకితం చేసిన ఈ కథా కదంభాన్ని ఆనందంతో స్వీకరిస్తున్నాము.

ఇట్లు
డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
గారి కుటుంబ సభ్యులు



# చేగొండి కథా కదంబం

# రెండవ భాగం

## విషయాను క్రమణిక

# “ఎమ్. వరదయ్య”

అక్టోబరు 4, 2009 సాయంత్రం “అంతేనా తాతయ్యా – మనసు మార్చుకోరా?” తనవంక ఆందోళనగాచూస్తూ ఎంతోఆర్తిగాఅడిగిన పన్నెండేళ్ళ పిల్ల “ఆర్తి” తల నిమురుతూ, ‘రానన్నట్లు’ తల అడ్డంగా ఊపాడు వరదయ్య. అంతలోనే మీరంతా క్షేమంగా వెళ్ళండమ్మా. ఇంకా ఆలస్యమైతే వరద పెరిగి పోయి ఎడ్లబండిలో పోలేరు. పడవలోనే పోవాల్సొస్తుంది” అని హెచ్చరించాడు. దాంతో కన్నీళ్ళు పెట్టుకొంటున్న ఆర్తికేసి, సూటిగా చూడలేక, విజయవాడ సమీపంలోని “కృష్ణలంక” లోని ఎకరాస్థలంలో తోట మధ్యలో తను స్వయంగా కట్టించుకొన్న చిన్న పెంకుటిల్లుకప్పుకేసి, తదేకంగా చూస్తూ ఉండిపోయాడు. అంతలోనే కొంచెం తేరుకొని, చిన్నగా నవ్వుతూ – “వరద నన్నేంచేస్తుంది తల్లీ, నా పేరే ఎమ్. వరదయ్య. ఎమ్ అంటే “మృత్యుంజయుడు” అనర్థం అన్నాడు. ఇక లాభం లేదనుకొంటూ, ఆలస్యమైతే అమ్మ నాన్న తిడతారన్నభయం కలిగి, వెళ్లడానికి లేచి నిల్చుంది ఆర్తి మాస్టారు కేసి దీనంగా చూస్తూ. ఔను, ఆర్తికి, తనతో బాటు మరి కొంత మంది పిల్లలకి రోజూ సాయంత్రం ఉచితంగా “ట్యూషన్” చెప్తున్న వరదయ్య మాస్టారంటే చాలా గౌరవాభిమానాలు, మరి – ఇంకా మాస్టార్ని ఊరు విడిచి తమతో రావటానికి ఒప్పించాలన్న ఆశ పూర్తిగా చావక ‘ఎంత ప్రళయం రాబోతోందో టీ.వి.లో చూడ్డంలేదా తాతయ్యా. “కనకదుర్గమ్మ ముక్కుపుడకను “కృష్ణవేణి” తాకబోతోందని చెబుతున్నారు కదా” అని నసిగింది, శాంతావస్థలో ఉన్నప్పుడు కదలాడే నదీ తరంగాల్లా ఈదరగాలికి కొద్దిగా కదులుతున్న తన లంగా కుచ్చెళ్ళు సర్దుకొంటూ. “నాలుగు రోజులుగా, అంటే ఒకటో తారీఖు నుండి అదే పనిగా చూస్తూనే ఉన్నానమ్మా – మన జిల్లాకి ప్రధానంగా, కృష్ణలంక భవానీపురం వంటి విజయవాడ లోతట్టు ప్రాంతాలకి పొంచి ఉన్న వరద ప్రమాదం గురించీ తెలుసు. కాని నేను రాను” అని గంభీరంగా పలికిన వరదయ్య అదే క్షణంలో, నాలుగు రోజులుగా టీవీ ఛానళ్ళు, వార్తా పత్రికలు ఊదరగొట్టి చెబుతున్న వరద సూచనల్ని“ఉగ్రవేణి”గా మారిన “కృష్ణవేణి” కలుగజేస్తున్న“జల విలయాన్ని ఒక్కసారి అప్రయత్నంగా తలుచుకుంటూ మూడు రోజులు వెనక్కివెళ్లాడన్నమాట –

మననం చేసుకొన్న వరదయ్య వెంటనే ఆర్తిని, ఒకసారి ముద్దాడి “ఇంకా ఆలస్యం చేయకమ్మా అమ్మా నాన్నచూస్తుంటారు. వెళ్ళు మరి” అని నాలుగు

అరటిపళ్ళు ఇచ్చి సాగనంపేడు. ఎంత వద్దంటున్నా అయిదు వందల రూపాయల నోట్లు రెండు తన చేతిలో కుక్కేడు కూడా. ఆర్తి కూడావెనక్కి వెనక్కి చూసుకొంటూ వెళ్ళి పోయింది. అప్పటికే కృష్ణలంకలో వరద ప్రారంభమైంది. గంటలోపులో అందరూ ఖాళీ చేసి వెళ్ళిపోయారు. దాదాపుగా కట్టు బట్టలతో ఆర్తి వెళ్ళిపోయాక కూడా, ఒకళ్ళిద్దరు పెద్దలు వచ్చి వరదయ్యను బ్రతిమాలేరు, తమతో రమ్మని, ఎంత చెప్పినా, వినకపోతే ఏం చేస్తారు – "మొండివాడు", ఎమ్. వరదయ్య అంటే మొండి, వరదయ్య– "అని తిట్టుకొంటూ వెళ్ళిపోయేరు. అయినా పోతూ పోతూ, "పంతులూ రెండో వీధిలో చౌదరి గారి రెండతస్తుల మేడ మీదికి వెళ్ళు వరదెక్కువైతే, వాళ్ళూ తాళం వేసుకొని పోతున్నారు గాని, మెట్లు బైట నుంచే ఉన్నాయి. పైకెళ్ళ వచ్చు". అని జాగ్రత్తలు చెప్తుంటే, నవ్వుతూ ఉండిపోయాడు వరదయ్య.

అందరూ వెళ్ళి పోయాక, తన ఇంటి చుట్టూ ఒకసారి తిరిగేడు. అదే మీ ఐశ్వర్యం నిండిఉన్న నిలయం కాదు. ఎకరం స్థలంలో 20 మామిడి చెట్లున్నాయి గాని ప్రహరీ లేదు. ఒకమూల చిన్నపెంకుటిల్లు. అందులో కనీస స్థాయిలో ఫోను, గ్యాస్ స్టౌ వంటి గృహ పరికరణాలున్నాయి. భార్య పోయి పదిహేనేళ్ళయింది. స్వయంపాకం – పిల్లలు లేరనుకోవద్దు – పెద్దవాడు రమణ, తర్వాత చక్రవర్తి, ఆఖర్న కూతురు భ్రమర – కొడుకులిద్దర్నీ ప్రేమగా పెంచి బాగా చదివించి, మంచి ఉద్యోగాల్లో స్థిరపరిచేడు. రమణ బెంగుళూరులో బ్యాంకు మేనేజరు, చక్రి కూడాబెంగుళూరులోనే, ఓ మల్టీ నేషనల్ కంపెనీలో ఇంజనీరు. ఇద్దరికీ పెళ్ళయింది. ఇక కూతురు భ్రమరకు మంచి సంపన్న కుటుంబంతో వియ్యమంది, పెళ్ళి చేసాడు. వాళ్ళూ, విజయవాడలోనే, కాపురం, అల్లుడు రామారావు మంచివాడే గాని, భార్యమాట జవదాటడు. ఇంతకీ సంగతేమంటే వరదయ్య సంతానం ముగ్గురికీ పదేళ్ళుగా తండ్రిపొడంటే గిట్టదు. రాకపోకలే కాదు మాటలూ లేవు! కారణం ఆర్థికం – ఎకరం స్థలాన్ని అమ్మేయాలని కొడుకులు, పెళ్ళాల ప్రోద్బలంతో ప్రతిపాదిస్తే వరదయ్య ససేమిరా వినలేదు. కోట్లాది రూపాయలమేరకు పోటీగా బేరాలు తెస్తే కాదన్నాడు. ఫలితం సోదరులిద్దరికీ, పదేళ్ళుగా పరస్పరం మాటలు లేవు. తండ్రితోనూ లేవు. ఇక కూతురు భ్రమరకి చనిపోయిన తల్లినగలు నోరు విడిచి అడిగినా ఇవ్వలేదని కోపం! సోదరులతోనూ తండ్రితోను పడదు. వరదయ్యకున్నఆస్తి ఈ ఎకరం ఇంటి స్థలం మాత్రమేగాని, పూర్తిగా స్వార్జితం.

అందుకే ఏమీ చేయలేని ఉక్రోషంతో వరదయ్యకు పిల్లలు ముగ్గురూ దూరమయ్యారు.

గతంలో 1998లో వరద ముంపుకి కృష్ణలంక గురయినప్పుడు కూడా వరదయ్య తన ఇంట్లో వంటరిగానే ఉండి పోయాడు. అప్పుడు కూడా లంక వాసులంతా, కట్టు బట్టలతో ఊరు వదలి వెళ్ళినా, వరదయ్య వాళ్ళతో వెళ్ళలేదు. వరద ఉధృతి చాలా ఎక్కువ ఉన్న కొన్నిగంటలసేపు మాత్రం అప్పటికే అరవై ఏళ్ళ వయసున్న వరదయ్య ఇంటి నుండి బురద నీట్లో ఈదుకొంటూ వెళ్ళి ఆంజనేయుని కోవెల బయటి ధ్వజ స్థంభం ఎక్కి ప్రాణాలు కాపాడుకొన్నాడు! వరద కొద్దిగా తగ్గగానే, ధ్వజస్తంభం దిగి, నీళ్ళలో ఈ దుకొంటూ వెళ్ళి ఇంట్లోకి చేరేడు. మిగిలిన లంకవాసులందరి కన్న ముందుగా ఇల్లుశుభ్రం చేసుకున్నాడు. వీలైనంత వెంటనే "కోవెల"లో తను ఎక్కి అపవిత్రం చేశాననుకొన్న, ధ్వజస్థంభం స్థానంలో మరో కొత్తది తన ఖర్చుతో నిర్మింప జేశాడు.

– సరే ఇదే అక్టోబరు 4, 2009 న వరదయ్యపెద్ద కుమారుడు రమణ బెంగుళూరులో తన ఇంట్లో టీవీ తెలుగు ఛానల్ తదేకంగా చూస్తూ ఉన్నాడు. గత మూడురోజులుగా ఆఫీసుకుసెలవు పెట్టి ఇంట్లోఉండి, అదే పనిచేస్తూ ఉన్నాడు. తెలుగు వార్తా ఛానళ్ళు ఒకటి తర్వాత ఒకటి మార్చి చూస్తూ ఉద్వేగంగా కాలం గడపసాగేడు. ఇప్పుడు ఏదో ఇతర కార్యక్రమం వస్తోంటే టీవీ కట్టేసి, హాలులో అస్థిమితంగా పచార్లు చేయ సాగేడు. ఇప్పుడు, అతనికి స్పష్టంగా అర్థమయిందేమంటే, ఇక విజయవాడ సంగతెలా ఉన్నా, లోతట్టు ప్రాంతాలైన కృష్ణలంక, భవానీనగర్, ఇతర లంక గ్రామాలు జల దిగ్బంధం కావటం తధ్యమని తాటి ఎత్తు వరద నీటిలో తన తండ్రి ఉన్న విజయవాడ నగరం శివారులోని కృష్ణలంక నిండా మునిగి పోవటం తధ్యమని ఇక ఉండబట్ట లేక బెంగుళూరులోనే ఉంటున్నా, పదేళ్ళుగా మాటలు లేని తమ్ముడికి ఫోను నంబరు కలిపేడు. కొంత సేపు ఫోను రింగవు తుంటే ఎవరూ లిఫ్ట్ చేయకపోతే అసహనంతో జుట్టు పీక్కొన్నాడు. "ముసలాయన బహు మొండి. ఊరు వదిలి ఉండడు". అని తనకు తానే మళ్ళీ చెప్పుకొన్నాడు. ఇంతలో అటు నుంచి తమ్ముడు ఫోనెత్తి 'హలో' అన్నాడు. అయినా సంకోచం కమ్ముకొచ్చి నిశ్శబ్దంగా ఉండి పోయేడు. క్షణం సేపు మళ్ళీ హలో ఎవరూ "తమ్ముడి గొంతులో విసుగు", ఫోను పెట్టేస్తాడేమోనన్న భయం కలిగి,

వెంటనే "నేన్రా చక్రం" అని గొణిగాడు. అటు కాసేపు నిశ్శబ్దం. "నువ్వా అన్నయ్యా" తమ్ముడి గొంతు "అవున్రా చక్రం. టీవీ చూస్తున్నావా? ఆంధ్రలో వరదలు", – "ఆ క్లోజ్‌గా ఫాలో అవుతున్నా అన్నయ్యా, మరి ఏమైనా "కబురు" తెలిసిందా?" డైరెక్టుగా సబ్జెక్టులోకి వచ్చేసేడు చిన్నోడు. కృష్ణాజిల్లా వాళ్ళు చావుకబురునే, "కబురు" అని వ్యవహరిస్తారు. అలా ఏకీభావం, ఆత్రం వెల్లడించుకొంటూ సోదరులిద్దరూ గంటసేపు మాట్లాడుకొన్నారు పరస్పరం ఆప్యాయత చిందించుకొంటూ, నాలుగు రోజులుగా టీవీలో చూస్తున్న వరద వార్తల గురించి క్యూసెక్కుల, ఇన్‌ఫ్లో, ఔట్ ఫ్లోల సమాచారం గురించి కూలంకషంగా ముచ్చటించుకొన్నారు. ఈ పాటికి తండ్రి ఉన్న కృష్ణలంక తాడిచెట్టు ఎత్తులోతు నీళ్ళలో మునిగిపోయిటుందని, ముసలాయన అదే, "ఎమ్. వరదయ్య", "మొండివరదయ్య" మాత్రం, ఇల్లు ఊరు వదలి ఉండడని, ఈ డెబ్భై ఏళ్ళ వయసులో, గతంలోలా, ఈదుకొని వెళ్ళి ఏదో ఎత్తైన ప్రదేశానికి చేరుకొని ప్రాణాలు కాపాడుకునే అవకాశాలు శూన్యమని నిశ్చయించుకొన్నారు. తండ్రి జలసమాధి ఈ పాటికే అయ్యుంటాడని నమ్మకం కలిగింది ఇద్దరికీ. మర్నాడు బయలుదేరి, విజయవాడ చేరుకుని, వరద తగ్గి పూర్తిగా క్షేమమనుకొన్న తర్వాత కృష్ణలంక చేరుకొని తండ్రి మృతదేహం స్వాధీనం చేసుకొని చెరి సగం ఖర్చు పెట్టుకొని ఆయన అంత్యక్రియలు వీలైనంత ఘనంగా జరుపుదామని "అపూర్వ సోదరులిద్దరూ అంగీకారానికొచ్చేరు! ఆఖరిలో పిత్రార్జితంగా తమకు ఖాయంగా వచ్చే కృష్ణలంకలోని ఎకరం స్థలం, ఇల్లు (ఎలానూ వరదలో నేలమట్టమై పోయుంటుందన్నది ఇద్దరి భావం.) ఏదో మల్టీ నేషనల్ కంపెనీకో, బహుళ అంతస్తుల గృహ నిర్మాణ సంస్థకో, బాగా బేరమాడి తగిన విలువకి అమ్మిపాడేసి, ఆ సొమ్ము ఇద్దరూ దెబ్బలాడు కోకుండా సమంగా పంచుకోవాలని, ఎప్పుడో పెళ్ళయిన చెల్లెలుకి వీసమెత్తు వాటా అయినా ఈయవలసిన అగత్యం లేదన్న ఏకాభిప్రాయానికి వచ్చేరు సోదరులు.

వీళ్ళు మాట్లాడుకొన్న గంటసేపూ రెండు ఫోన్ల స్పీకర్‌లు ఆన్‌లో ఉండటం మూలాన, ఇద్దరి ధర్మపత్నులకూ "సబ్జెక్ట్" సంపూర్ణంగా అర్థమైంది. అన్నదమ్ముల మధ్య పునరుద్ధరింపబడిన అన్యోన్యతకు మురిసిపోయేరు తోడి కోడళ్ళిద్దరూ. పెద్దామె, ఒకవేళ కూలిన ఇంట్లోపోయిన అత్తగారి నగలు దొరికితే, అవి మగవాళ్ళు ముట్టు కోరాదని, తోడికోడళ్ళిద్దరు సమంగా పంచుకొంటామని, ఆడబడుచు భ్రమరకేమీ

ఇవ్వరాదని ప్రతిపాదించింది. ఇకచిన్నామె, మరో అంశం లేవనెత్తింది. వరద మృతుల సంబంధీకులకు రాష్ట్ర ప్రభుత్వం నుండి రెండు లక్షలు ప్రధాని సహాయనిధి నుండి ఇంకో లక్ష మొత్తం మూడు లక్షల వరద పరిహారంగా లభిస్తుందని, కొడుకు లిద్దరమే పంచుకొంటామంటే న్యాయపరమైన ఇబ్బందులు, ఆటంకాలు ఎదురు కావొచ్చు కాబట్టి శుభ్రంగా ముగ్గురూ అంటే ఇద్దరు కొడుకులు, ఒకకూతురు "భ్రమర" పంచుకొంటే బాగుంటుందని ప్రతిపాదించింది తెలివిగా. భార్యామణుల ప్రతిపాదనలు సోదరులకామోదయోగ్యమేనని వేరే చెప్పాలా? ఇక విజయవాడకు ప్రయాణమవ్వటమే మిగిలింది. కాని రైలు టిక్కెట్లు వారం వరకూ లేవన్నారు. కష్టపడితే ఆనాటికి ఎల్లుండి ఉదయానికి ఫ్లైటు టిక్కెట్లు బుక్ అయ్యాయి సోదరులకి మాత్రం! కోట్లాది వ్యవహారమాయే!! ఖర్చు గురించి చూసుకొంటే ఎలా మరి?

మర్నాడు అంటే అక్టోబరు, 5, 2009న కూడా రోజంతా ఫోన్లో చర్చించు కొంటూనే ఉన్నారు. సోదరులు టీవీ వరద వార్తలు చూసి కృష్ణలంక పూర్తిగా మునిగిపోయిందని నిర్ధారించుకొన్నారు. ఆ రోజు రాత్రి 8 గంటలకు రమణకు ఫోను వచ్చింది. "అన్నయ్యా ఫలానా ఛానల్ చూస్తున్నావా లేదా" అంటూ వెంటనే కంగారుగా ఆ ఛానల్ పెట్టేడు.

"నమస్కారం నేను "అనన్య" కెమెరా వుమెన్ "అసాధ్య"తో కలిసి మేమిప్పుడు భారత వాయుసేన రాష్ట్రప్రభుత్వానికి సమకూర్చిన ఎమ్.ఐ.జి హెలికాప్టరులో ఉన్నాం. మాతోబాటు పైలట్, ఆయన లేకపోతే హెలికాప్టరు నడవదు కాదండీ. ఇహ్హీ హీ - ఆ తర్వాత, ఇంకా నలుగురు బి.యస్.ఎఫ్. జవాన్లు ఉన్నారు. రిలీఫ్ మెటీరియల్, ఆహారపదార్థాలు విజయవాడ పరిసర ప్రాంతానికి తీసుకెళ్తున్న ఈ వాయు విహంగంలో, ప్రత్యేక అనుమతితో మేం కూడా జొరబడ్డాం. "మీడియా వాళ్ళం, మేం ఎక్కడికైనా వెళ్తాంగదాండీ! ఎంత రిస్కైనా ఇహ్హిహ్హి, ఆ, సంగతేమంటే, ఇప్పుడే వీళ్ళు అంటే ఈ వీర జవాన్లు విజయవాడ పరిసర ప్రాంతంలో, ఒక ముంపుకి గురైన ఊరిలో సెల్ టవర్ మీద ఎంతసేపట్నుంచీ ఉన్నాడో తెలియదు గాని, ఉన్న ఓ వృద్ధుణ్ణికాపాడి తాళ్ళు ఇనుప గొలుసుల ద్వారా హెలికాప్టరులోకి తీసుకొచ్చారు. కొన్ని బిస్కట్లు తిన్నాక తేరుకొని ఆ ముసలాయన ఇప్పుడు మాట్లాడటానికి సిద్ధంగా ఉన్నాడు.

"ఆగు అనన్యా ఇప్పుడే ముఖ్యమైన వార్త వచ్చింది. మీతో మళ్ళీ కాంటాక్టులోకి వస్తాం. "జూనియర్ ఎన్.టి.ఆర్". "కె.వి.పి."తో కలిసి ముఖ్యమంత్రికి 20 లక్షల చెక్కు ఇవ్వడానికి వెళ్తున్నారు. ఇప్పుడా దృశ్యాలుచూడండి. తర్వాత పావుగంట దానికి సంబంధించిన దృశ్యాలే ప్రసారమవుతోంటే సోదరులకు, తోడికోడళ్ళకు వళ్ళు మండిపోయింది. కాని ఏం చేస్తారు? ఆ కాపాడబడ్డ"వృద్ధుడు" ఏ బొబ్బర్లంక వాడో కావాలని, తమ తండ్రి మాత్రం కాకూడదని ముక్కోటి దేవతలను వేడుకోవటం తప్ప!!

"ఆ అనన్యా మళ్ళీ కంటాక్టులోకి వచ్చాం. వినపడుతోందా అనన్యా ఓ అనన్యా." (టీవి స్టేషన్ నుంచి సురేష్)

"ఆ సురేష్ వినపడుతోంది. మనమిప్పుడు ఎంతో సాహసోపేతమైన కార్యక్రమంలో భాగంగా, ఈ వాయు సేన వారి ఎమ్.ఐ.జి హెలికాప్టర్‌లో ఉన్నాం. ఇది రష్యాలో తయారైన అధునాతనమైన....

"ఆగు అనన్యా అదంతా వదిలేయ్ ప్లీజ్ ఆ ముసలాయనతో మాట్లాడించు." "సరే సురేష్! అయ్యా మీ పేరేంటి? వయసెంత?" ముసలాయన ముఖం చూపించ లేదు. హెలీకాప్టర్ సౌండులో ఆయన జవాబు వినపడలేదు. అన్నదమ్ములకి బీ.పి. పెరిగిపోయింది. అయ్యా ఊర్లో అందరూ ఖాళీ చేసినప్పుడు మీరెందుకు వెళ్ళలేదు. ప్రాణాలపై తీపిలేదా?" – అనన్య అడిగింది.

ముసలాయన ఇంకా కెమెరా ఫ్రేములోకి రాలేదు. కాని జవాబు వినపడింది. "నిజమేనమ్మా ప్రాణాలపై తీపిలేకనే వెళ్ళలేదు. నా పిల్లలు యోగ్యులు. జీవితంలో సెటిలైపోయారు. ఎప్పుడో నన్నువదిలేసి పరలోకానికి వెళ్ళిపోయిన నా భార్యను చేరుకోవాలనిపించి, ఊళ్ళోనే, స్వంత ఇంట్లోనే జల సమాధి కావాలనిపించి ఉండి పోయాను. అయినా ఊ... చెప్పండి. కొంచెం కెమేరా ఫ్రేములోకి వచ్చేడు గాని ముఖం ఇంకా సరిగా కనపడటం లేదు!!

నాకున్నది ఒకఎకరం ఆస్తి. దాన్ని నెలక్రితమే వరదలు రానప్పుడే, "రామక్రిష్ట మిషన్"కి దానపత్రం వ్రాసి, రిజిష్టరు కూడా చేయించాను. అందులో వాళ్ళు ఒక బహుళ అంతస్తుల ఉచిత వైద్యాలయం నిర్మిస్తారట. అది వరద సమయాల్లో గ్రామవాసులకు రక్షణాలయంగా కూడా తుఫాన్ షెల్టరు అంటారే, ఆ మాదిరి,

ఉపయోగ పడుతుందన్నమాట. బతకాలని లేకపోయినా, ఎందుకో వరద ప్రారంభమయ్యాక ప్రాణం మీద తీపి కలిగింది. ఈదుకొంటూ వచ్చి ఆ ఎత్తైన సెల్ టవర్ ఎక్కి కూర్చుని పదిగంటలు గడిపేక వీళ్ళు రక్షించారు.

"అయితే మీ ఆస్తి అంతా దానం చేసేస్తే మీ శేషజీవితం ఎలా గడుస్తుంది. మీ పిల్లలు.....

"ఆ అవసరం లేదు. ఇదిగో ఈ తలపాగాలో చనిపోయిన నాభార్య నగలు నాతో తెచ్చుకొన్నాను. వీటిని అమ్మి ఆ సొమ్ము ఏదో వృద్ధాశ్రమానికి విరాళమిచ్చి దానికి బదులు, ఆ ఆశ్రమంలో ఎవరి మీదా ఆధారపడకుండా నా శేషజీవితం గడిపేస్తాను."

అనన్యా కెమేరా వుమన్లంతా ఇంతే! కాస్త ఆ ముసలాయన ముఖంపై ఫోకస్ చేయమను అసాధ్యను.... విసుగ్గా స్టూడియోలో సురేష్.

"రైట్ సురేష్ అసాధ్యా ప్లీజ్"

ఈ సారి ముసలాయన ముఖం బాగా కనపడిరది. తలపాగా కూడాతీసేశాడు. ఆయన.... ఆయన... ఎమ్. వరదయ్యే. ఎమ్ అంటే మొండి మాత్రమే కాదు "మృత్యుంజయుడు" కూడా....

ఇది చూసిన సోదరులిద్దరూ టీవి మీదకు రిమోట్లు గట్టిగా విసిరేరు అవి పగిలాయి. వాళ్ళ హృదయాలూ పగిలేయి పాపం. వాళ్ళిద్దరు తేరుకోకముందే విజయవాడ నుంచి కాన్ఫెరెన్స్ కాల్. చెల్లి భ్రమర మాట్లాడింది పదేళ్ల తర్వాత "చూశారా అన్నలూ. నాన్నని చెప్పు కోవడానికే మనస్కరించటం లేదు. ఆ ముసలాయన మన ముగ్గురినీ ఎంత అన్యాయం .... " చేసేశాడో. ఇంక మాట్లాడ లేక వెక్కి వెక్కి ఏడ్చేసింది వరదయ్య గారి పుత్రికా రత్నం కూడా దాంతో అన్నలకీ ఇక్కడి కృష్ణలంక వరద మాదిరిగానే కళ్ళ వెంట కన్నీళ్ళు ఆగకుండా కారాయని వేరే చెప్పాలా?

(ఆంధ్రప్రభ దినపత్రికలో మే 2010లో ప్రచురితమైంది

(గమనిక: 2009 అక్టోబరులో ఉమ్మడిరాష్ట్రంలో విపరీతమైన వరదలొచ్చాయి.)

# అంతా తుళ్ళూరు మామ మహిమ

నేను తెల్లగా మెరిసిపోయే ఆరడుగుల అందగాణ్ణి కాను, చామనఛాయకు కొంచెం తక్కువ రంగులో, ఏదో ఓ మాదిరి ఎత్తున్న మామూలు మగవాణ్ణి. మరీ పెద్ద హోదాకాని ఉద్యోగిని. అయితే, ఊళ్లోనే ఒంటరిగా ఉండే మా నాన్నకు పదెకరాలు మాగాణి ఉంది లెండి! చదువుకునే రోజుల్లో 'ప్రేమ దోమ' కుట్టనివాణ్ణి! వయసొచ్చాక కూడా, ఒక అపురూప సౌందర్యవతి నా భార్యగా రావాలని కలలు కనలేదు. ఏదో నాకన్న కొంచెం రంగులో ఉండే, ముక్కు ముఖం, ప్రవర్తన తీరుగా ఉండే 'మంచి అమ్మాయి' దొరికితే చాలు, అదే పదివేలు. మరి నేనేం చెప్పినా గంగిగోవులా తలూపేది కానక్కర్లేదు గాని, సాధ్యమైన మేరకు అనుకూలవతిగా ఉండే ఇల్లాలు లభిస్తే బాగుంటుందనుకునే వాణ్ణి! నన్ను పెళ్ళాడిన (అలాగే అనాలి, నేను పెళ్లాడిన అనటం కన్న) కాంతం అచ్చు "బాపుబొమ్మ"లా ఉంటుంది. "కాకి ముక్కు" లాంటి నేను "దొండపండు" లాంటి తమ కూతురికి తగనన్న అభిప్రాయాన్ని పెళ్లిచూపులనాడే బహిరంగంగా వ్యక్తపరచిన తన తల్లితండ్రుల మాటను కాదని పట్టుపట్టి చేసుకుంది. ఇంతకీ ఆ మధ్యవర్తి ఏర్పాటు చేసిన ఈ నా మొదటి పెళ్లిచూపులకి మా నాన్నకూడా రాలేదు. ఒక్కడినే వెళ్లాను. ఆమె అందాన్ని, విశాల నేత్రాల్ని, సొట్టలుపడే బుగ్గల్నీ చూడగానే అదిరిపోయాను. నాలాంటివాణ్ణి చేసుకోవడానికి ఒప్పుకోదులే, అనుకున్నాను. తన "బాడీలాంగ్వేజ్" లోని ఆత్మ విశ్వాసాన్ని గమనించి బెదిరిపోయి, కూర్చున్న కుర్చీలో కుదించుకు పోయాను. ఏమీ మాట్లాడలేక పోయాను.

నా అవస్థను గ్రహించిన కాంతం తనే సొంతం "ఇంటర్వ్యూ" చేసింది. ఈ పరీక్షలో "ఎలాగైనా" పాసవ్వాలన్న కోరిక కమ్ముకున్న నేను అప్పుడు ఏ ప్రశ్నలు ఎదుర్కొన్నానో, ఏ జవాబులు చెప్పానో ఇప్పుడు నిజంగా గుర్తులేదు. కాని తనకు కావల్సినంత 'వినయ విధేయతలు', ఒలకపోసి ఉంటాను, నాకు తెలియ కుండానే. ఊళ్ళో తన మానాన తను ఒంటరిగా ఉండే తండ్రితప్ప నాకు అక్క చెల్లెళ్ళు గాని, తల్లిగాని లేకపోవడం, అవసరమైనప్పుడు కొద్దో గొప్పో వంట, ఇతర పనులు చేసే అలవాటు నాకుండటం, కాఫీ, టీలు కూడాతాగని "మంచిబాలుడి'నని తెలియటం,

నాపట్ల తన తల్లిదండ్రుల "అనాసక్తి"ని కూడా అధిగమించి "జీవన సహచరుడి"గా ఎంచుకోవడానికి దోహదపడ్డాయని, తర్వాతెప్పుడో మూడ్‌బాగున్నప్పుడు మా కాంతమే చెప్పింది లెండి, ఏకాంతంలో!

పెళ్లిచూపులనాడే, "ఈవిడ మా ఆవిడయితే "నన్నొకాట ఆడేసుకుంటుందన్న" అనుమానం నా మదిలో మెదలి భయం పుట్టించక పోలేదు. కాని 'ఎంతైనా, మన భారతీయ సంస్కృతిలో, భార్యలు, కనీసం ఇతరుల సమక్షంలోన్కైనా, భర్తలదే కాస్తో కూస్తో 'పైచేయి' అన్నట్లు కనిపించేలా, లేదా ఇతరులు భ్రమించేలా, ఉంటారులే', అని నాకు నేనే సమాధానం చెప్పుకున్నానే గాని, ఈ సంబంధం వద్దనుకోలేక పోయాను ఒక్కక్షణమైనా! కాని జరిగిందేమిటి? పెళ్ళైన మొదటిరోజు నుండి కాంతం ఏకాంతంలో మాత్రమే గాదు అందరి సమక్షంలో కూడా ఏ మాత్రం మొగమాటం లేని "సంపూర్ణ ఆధిపత్యం" చెలాయిస్తుందని, ఇంట్లో మాత్రమే గాదు వీధిలో కూడా నన్ను భార్యాధీనుడిగా తన కొంగుచాటు దీనుడిగా చేసేసుకుంటుందని పెళ్ళికి ముందు ఊహించ లేకపోవడం నా దురదృష్టం!

అందుకే 'మా కంత "ఇంట్రెస్టు" లేకపోయినా, ఏకైక కుమార్తె పట్టు మూలంగా సంబంధానికి ఒప్పుకుంటున్నామని, ముహూర్తం కూడా పదిరోజుల్లోపే పెట్టేశామని, అమ్మాయి కిష్టం లేనందున కట్నకానుకల ప్రశ్నే ఉండదని, పెళ్ళిచూపులైన మర్నాడే మధ్యవర్తి ద్వారా తెలియజేస్తే ఎగిరి గంతేసి "సంగతి" నాన్నకు ఫోనులో చెప్పేను. 'ఇతర సంగతులేంట్రా' అని నాన్న అడగకపోలేదు. కాని నా ఉత్సాహాన్ని గమనించి "సరేలేరా" అనేశాడు. అన్ని ఏర్పాట్లూ, అంటే వెన్యూ, విందు మెనూ, వగైరా వగైరా అన్నీపెళ్ళి కూతురు వాళ్ళే నిర్ణయించేసి, ఇంత ఖర్చు అవుతుందన్న అంచనాలతోబాటు, అందులో "మీవంతు ఇంత" అన్న లెక్కలు కూడా నా ద్వారా తెలియజేస్తే మౌనంగా ఆ సొమ్ము పెళ్ళికి ముందే నాన్న వాళ్ళ కందజేసేశాడు! ఊళ్ళోని కొద్దిమంది బంధువులతో పెళ్ళినాడు మాత్రం వచ్చి మనస్ఫూర్తిగా కొడుకుని, కోడల్ని ఆశీర్వదించి మర్నాడే ఊరికి వెళ్ళిపోయేడు. పెళ్ళిలో నేను సంతోషంతో తబ్బిబ్బై పోవడం గమనించి తను కూడా బాగా తృప్తిపొంది వుంటాడు. పెళ్ళి అంతా వేడుకలలో మా ఆవిడ "ఆధిపత్యాన్ని" గ్రహించాడో లేదో, గ్రహిస్తే ఏమనుకున్నాడో నాకు నిజంగానే తెలియదు. కానీ నాకుమాత్రం భవిష్యత్తు ఎలా

ఉండబోతోందో బాగా అర్థమైపోయింది. 'కాపురం చేసే కళ వధువు కాలు తొక్కినప్పుడే తెలుస్తుందంటారు' కదా! నాకూ అలానే తెలిసింది, కాంతం నా కాలి బొటనవేలిని తన వాడిగోళ్ళు బాగా గుచ్చుకునేలా బలంగా తొక్కినప్పుడు, బిందెలో ఉంగరం నాకే దొరికినా, గిల్లి, గిచ్చి చేజిక్కించుకున్నప్పుడు!!!

పెళ్ళిపీటల మీదే నా జీవితం ఎలా ఉండబోతోందో నాకు స్పష్టమయి పోయిందని చెప్పడానికి మరికొంత సమాచారమివ్వాలి. తనతో మాట్లాడాలని అనిపించినా నేను ధైర్యం చేయలేకపోయేను గాని కాంతం గలగలా మాట్లాడుతూనే ఉంది. చెవిలో కొంటెగా చెప్పింది, "ఏ ఆటంకాలు లేవులే. తొలిరాత్రి మా ఇంట్లోనేనోయ్" అని. ఈ మాట బాజా భజంత్రీల గొడవల్లో ఎవరికీ వినపడలేదు గాని నేను సిగ్గుపడి పోవడం అందరూ గమనించి నవ్వుకున్నారు. పెళ్ళిచూపులనాడు కూడా ఏకవచనం లోనే మాట్లాడింది గాబట్టి 'ఓయ్' అనే సంబోధించిందేమిటన్న ఆశ్చర్యం గాని అభ్యంతరం గాని నాకు కలుగలేదులెండి! కాసేపటికి కాంతం అందరికీ వినపడేలా వాళ్ళ నాన్నతో చెప్పింది "నాన్నా మీ అల్లుడి సామానంతా రూము నుంచి మనింటికి ఈసాయంత్రానికే తెప్పించేయాలి. ఇకనుంచి మనింట్లోనే ఉంటాడులే"... దాంతో నా 'ఇల్లరికపు హోదా', అందరికీ అర్థమైపోయింది, అందుకు నా పూర్వానుమతి లేకపోయినా!! ఐనా నోరెత్తలేదు నేను.

సరే, మొదటిరాత్రి కూడా విభిన్నంగానే జరిగింది. నేను లోలోపల కోరుకున్నట్లుగానే కాలయాపన చేసే పురోహితుడు గాని, ఎకసెక్కాలు చేసే పేరంటాళ్లు గాని లేకుండానే సింపుల్‌గా ఏర్పాటు చేయబడింది కాంతం ఇంట్లోనే. కాదంటే కాంతం తెల్లటి పట్టుచీర కట్టుకుని సిగ్గుసిగ్గుగా గదిలోకి రాలేదు. పసుపురంగు నైటీలో ఎవరి సాయం లేకుండా ఒక్కతే వచ్చింది. కాజువల్‌గా కూనిరాగం తీసుకుంటూ వచ్చి మంచం మీద బాసింపట్టం వేసుకుని కూర్చుంది. ఎడంచేత్తో పట్టుకుని వచ్చిన కప్పులోని బ్రూ కాఫీ సిప్ చేస్తూ నావంక నవ్వుతూ చూస్తూ ఉంటే నేను పరవశుడినై పోయాను. కాఫీ సేవనం పూర్తిచేసి "ఏదోటి మాట్లాడు" అనేసరికి, "నీ అంత అందగత్తె భార్యగా దొరకడం నా పూర్వజన్మసుకృతం" అనేశాను. తిన్నగా ఉండలేక పిచ్చోణ్ణి!!

"ఆ, అది నూరుపాళ్ళు నిజమే... ఇదిగో ఈ కాఫీ కప్పు ఆ స్టూలు మీదపెట్టి, అక్కడే ఫ్రూటీలున్నాయి. ఆరెంజ్ ఫ్లేవర్‌ది తీసుకుని తాగు. కాఫీ తాగవు కదా. అందుకే నీకు సగం ఇవ్వలేదు. 'అండీకొండీ' నచ్చనట్లే'ఎంగిలి' ఇష్టం ఉండదు." వెంటనే లేచివెళ్ళి కాఫీ కప్పు స్టూలు మీదపెట్టి అక్కడ నాకిష్టమైన మేంగోఫ్లేవర్‌ది ఉన్నా కూడా ఆరెంజ్ ఫ్లేవర్ ఫ్రూటీయే తాగి కాంతం చెంతకు చేరుకున్నాను. 'ఎంగిలి', నచ్చదంది, ముద్దుపెట్టుకోవచ్చో లేదో అని అనుమానిస్తుంటే తనే ముందుగా గట్టిగా ముద్దు పెట్టింది. తర్వాత... అబ్బ ఆశ, దోశ, అప్పడం, వడ... అన్నీ విపులంగా తెలుసుకోవాలని మీకున్నా, నేను చెప్పను గాకచెప్పను. మరీ వివరంగా చెబితే ఎడిటర్‌గారు తప్పక"సెన్సార్" చేసి "డిలీట్" చేస్తారు. కాబట్టి చాలా "డిలైట్‌ఫుల్"గా ఆ రాత్రి గడిచిందని అర్థం చేసుకోండిచాలు! ఇంకోమాట... తొలిరాత్రే నా "భార్యాధిపత్య సంసార సాగర సౌధం" పకడ్బందీగా, నిర్మితమైందనని అందులో నేను ఐచ్ఛికబందీనని కూడా అర్థం చేసుకోండి... చాలు.

సరే, ఆ రోజు నుంచీ కాంతం ప్రతీరోజూ, ప్రతిక్షణం తన అధికారాన్ని, ఆధిపత్యాన్ని, మాటనీ చెల్లించుకుంటూ వస్తున్నా, నేను సంతోషంగా, ఇష్టంగా సంసార సాగరంలో ఓలలాడుతున్నాను. పరిస్థితులకు బాగానే అలవాటు పడ్డాను, పెద్దగా కష్టపడకుండానే ఇష్టంగానే! అందుకు ఏకైక కారణం ఏదో ప్రవర్తనలో కొంచెం తేడా ఉన్నా నాకాంతానికి నేనంటే అపారమైన ప్రేమ ఉందన్న నిజం. కాదంటే, 'ఏకాంతంలో ఎలా ఉన్నా పర్వాలేదు గాని అందర్లో ఉన్నప్పుడైనా కాస్తో కూస్తో నా మాట పట్టించుకుంటే బాగుండును. కనీసం నటించినా బాగుండును అని అప్పుడప్పుడు లోలోపల మధనపడుతుంటాను గాని, 'ఆ, అది జరిగేదా చచ్చేదా' అని వెంటనే అనుకుంటాను. ఏమాట కామాట చెప్పుకోవాలి, అత్తగారు, మామగారు అంటే కాంతం తల్లిదండ్రులు కూతురికి "బుద్ధులు" చెప్పే సాహసం, ఎప్పుడూ చేయలేదు గాని, తను మరీ అతిగా ప్రవర్తించేటప్పుడు మాత్రం నావైపు మౌనంగానే కొంచెం "జాలిచూపులు" ప్రసరించేవారు. అదే నాకుగుడ్డిలో మెల్ల తరహా ఉపశమనంగా ఉండేది. కాని దురదృష్టవశాత్తూ మా పెళ్లైన రెండేళ్ళలోపునే రెండునెలల తేడాలో ఇద్దరూ కాలం చేశారు.

కాని కాంతంలో ఏమాత్రం మార్పు రాలేదు. “ఎడ్డెం అంటే తెడ్డెం” అనే అలవాటు కొంచెం కూడా తగ్గలేదు. కొన్ని ఉదాహరణలు – ఒకసారి పొరపాటున “తెలుగు సినిమాకి వెళ్దామా” అంటే, వెంటనే హిందీ సినిమాకి టిక్కెట్లు తెప్పించి నన్నుకూడా లాక్కెళ్లింది. ఇంకోసారి పనికట్టుకుని “ఏం కూర వండనోయ్” అని తనే అడిగి ‘గుత్తొంకాయ కూర తినాలని ఉంది, నువ్వు బాగా చేస్తావు కూడా అనిపించుకుని, వెంటనే ఇంట్లో ఉన్న నవనవలాడుతున్న లేత వంకాయను పనిమనిషికిచ్చేసి దానితోనే బజారు నుండి బంగాళాదుంపలు తెప్పించి “కుర్మా” చేసింది. ఏమంటాను లొట్టలు వేసుకుని తింటూ “కుర్మాకూర చాలా బాగా చేస్తావే” అని మెచ్చుకున్నాను.

ఈ సందర్భంలో నేను మరీ తెలివి తక్కువ దద్దమ్మనని అనుకోకుండా ఉండడానికి ఓ రహస్యం చెప్పాలి. ఆ రహస్యం ఏమిటంటే కాంతం నన్ను ఇష్టపడి చేసుకోవడానికి కారణం నేను తన చెప్పుచేతల్లో ఉంటానన్న విశ్వాసం పెళ్ళిచూపుల రోజునే కలగటంతోబాటు నాకు వంట, ఇంటి పనులు చేయటం వచ్చునని తెలియటమని ముందే చెప్పాను కదా! కాని, ఇన్నాళ్ళ కాపురంలో ఇంటి పనులు బాగానే చేయిస్తున్నా వంట మాత్రం ఎప్పుడో గాని చేయించడం లేదు. వంట చేయించినప్పుడు నేను కావాలని (తనకి అనుమానం రాకుండా) ఉప్పో, కారమో తక్కువో, ఎక్కువో వేసి శాయశక్తులా చెడగొట్టేవాణ్ణితను తినలేనంతగా. పైగా కాంతానికి తన వంట తనకి బాగా ఇష్టం. కొత్త కొత్త ప్రయోగాలు చేయటం.

ఇంకా ఇష్టం. కాబట్టి ఎప్పుడోగాని వంటపని నాకప్పజెప్పదు. మరి నాకూ తెలివి తేటలున్నాయని తెలుస్తోందా లేదా? ఏమైనా గాని ఇతర విషయాల్లో మాత్రం “ఎడ్డెం అంటే తెడ్డెమే”. అన్నింటికన్న నాకు బాగా బాధ కలిగించిన విషయం మా ఏకైక కుమార రత్నాన్ని “ఇంగ్లీషు మీడియం”లో చేర్పించాలని అందరిలానే నేనూ కోరుకుంటే, వాణ్ణితెలుగు మాధ్యమంలో చేర్పించింది.

నా పాట్లు, అగచాట్లు చూసి అందరూ నా ముఖం మీద నవ్వుకునే వాళ్ళే గాని, ఆమెకి నచ్చచెప్పే వాళ్ళెవరూ లేరు. ఉన్న ఒక్కగానొక్క నాన్న సంవత్సరానికో సారి వచ్చి పంట డబ్బులు ఇచ్చేసి వెంటనే వెళ్ళిపోతాడు గాని ఇంకేమీ పట్టించుకోడు.

ఈ మధ్యన నాన్న గురించి ఆలోచనలెక్కువై పోయాయి నాకు. మా దగ్గరే నాన్న ఉంటే నా "దుస్థితి", ఇంతెక్కువగా ఉండదేమోనన్న నమ్మకం ఎందుకో మదిలో మెదలసాగింది. ఇంతలో మా ఊరినుంచి వచ్చినాయన ఒకతను "మీ మామకి ఈ మధ్య అంతగా బాగుండటం లేదు" అని మా ఆవిడకే చెప్పిపోయేడు. అతను వెళ్లిపోయేక కూడా మా ఆవిడ ఏమీ మాట్లాడలేదు. నాకప్పుడప్పుడు తెలివి తేటలు వికసిస్తాయి కదా... అందుకే ముందే నేనే తెడ్డెం అంటే ఎడ్డెం", అంటుందేమోనన్న ఆశ కలిగి అన్నాను.....

"పెద్దగా పట్టించుకోనక్కర్లేదు కాంతం... ఊరువెళ్తే రెండు మూడు రోజులైనా ఉండాల్సొస్తుంది, నిన్నొదిలి ఉండలేను. నేను వెళ్ళను గాకవెళ్ళను". అప్పుడు కూడా కాంతం మాట్లాడలేదు! నిరాశ కలిగింది. కాని మళ్ళీ తెలివితేటల ట్యూబ్‌లైట్ బుర్రలో వెలిగింది.

"ఈ సంవత్సరం పంట డబ్బులు ఇంతవరకు తెచ్చివ్వలేదు. ఇప్పుడు వెళ్తే అందుకోసం వచ్చేననుకుంటాడు, వెళ్లను గాకవెళ్లను" అన్నాను. ప్లాన్‌పారింది. అప్పుడేం మాట్లాడలేదు గాని నా భార్యారత్నం మర్నాడే మా ఊరి బస్సు టికెట్ తెప్పించి నా చేతిలో పెట్టింది. బయలు దేరేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు 'తెచ్చే డబ్బులు జాగ్రత్త' అంటూ ముసిముసి నవ్వులు చిలికించింది. అన్యాపదేశంగా పంట డబ్బులు అడగటం మర్చిపోవద్దని హెచ్చరించింది. ఊరికి చేరుకున్నాను. నాకోసం నాన్న ప్రత్యేకమైన కూరలు చేస్తుంటే సాయపడ్డాను. అంతా నేనే చేసినట్లుగా "కూర బాగా కుదిరిందిరా. చాలా బాగా చేశావ్" అంటూ నాన్న ఆబగా తింటుంటే నా కళ్ళు చెమర్చాయి.

భోజనాలయ్యాక నాన్న నన్ను ఒళ్లోకి తీసుకుని చెంపలు నిమురుతూ "చెప్పరా... నాకేదో చెప్పాలని నీకుందని తెలుస్తోంది... చెప్పరా కన్నా" అంటే ఇంక ఆగలేక పోయాను. ఇన్నాళ్ళుగా మనసులో దాచుకున్న విషయాలన్నీ నా వర్తమాన దురవస్థ గురించి, "నువ్వే శరణం నాన్నా" అన్నట్లుగా చెప్పేసుకున్నాను.

తనేం ప్రశ్నలు వేయకుండా నాన్న మౌనంగా విన్నాడు. అంతేగాని 'నాకు ముందే తెలుసు' అనలేదు. "అంత చేతగాని వెధవలా ఎలా ఉంటున్నావురా" అని

ఈసడించుకోలేదు. "అన్నిరోజులూ ఒకేలా ఉండవు. కాంతం స్వతహాగా మంచిపిల్ల' అని మాత్రం మెల్లగా అన్నాడు. "సర్లే ఇంకపడుకో" అని ఊరుకున్నాడు.

కాని నేను తిరిగి వచ్చేరోజున మాత్రం నేనేం చేయాలో, కాంతానికేం చెప్పాలో ఉపదేశించాడు. ఎంత వ్యూహాత్మకంగా ప్రవర్తించాలో మంత్రోపదేశం చేశాడు. "అన్నట్లుఈ సంవత్సరం పంట డబ్బులివిగో, జాగ్రత్తగా తీసుకువెళ్లు అనేసరికి నాకు నిజంగానే ఏడుపు వచ్చింది. అదిచూసి "ఛ! ఊరుకో, నా ఖర్చులకి కొంత ఉంచుకున్నానులే" అని ఊరడిరచేడు. సరే ఇంటికి, అదే కాంతం చెంతకి తిరిగొచ్చేను కాని పంట డబ్బులు ఇవ్వలేదు. తను అడగకముందే చెప్పేను "పంట డబ్బేమీ ఇవ్వలేదు... పైగా నేను వింటుండగా ఎవరితోనో అన్నాడు... మావాడు మరీ పెళ్ళాం చాటు చవట్కైపోయాడు. ఇన్నాళ్లూఏదో కొంత ఇచ్చేవాణ్ణిగాని ఇకమీదట "నాది నాకే" ఉంచుకుందామని నిశ్చయించుకున్నాను. మామని గాని మొగుణ్ణి గాని లెక్కచేయని మనిషికి నేనెందుకు సొమ్ము ధారపోయాలి? సొమ్మంతా నేనే ఉంచు కుంటాను. దాచి దాచి నా చచ్చిపోయిన చెల్లెలి బిడ్డలికిద్దామను కుంటున్నాను...." "ఇలా అనేశాడు కాంతం. ఆఖరికి సొంత మనవడి ప్రస్తావనే తేలేదు. అంత కానివాళ్లమై పోయామా" అని బావురుమన్నాను. నాకే ఆశ్చర్యం కలిగేంత బాగా నటించేను.

సహజంగానే కాంతం భగ్గుమంది. "అంత మాటన్నాడా ముసలాయన! నేను ఆయన్ని లెక్కచేయనన్నాడా! పెళ్లిరోజున అక్షింతలు వేసినప్పుడు ఆయన కాళ్ళకి దణ్ణం పెట్టానే! మా నాన్నకి కూడాఎప్పుడూ పెట్టలేదే! సంవత్సరానికోసారి వస్తుంటే దమ్ బిర్యాని, తందూరి చికెన్ పెడుతున్నానే! పంటడబ్బు నీ చేతికిచ్చినా, తర్వాత నీ దగ్గర తీసుకున్నానే గాని, నా చేతికెందుకివ్వటం లేదని అలగలేదే! ఆయన్ని ఎంత గౌరవంగా చూసుకుంటానో, నిన్ను ఎంత ప్రేమగాచూసుకుంటున్నానో తెలియదా ఆయనకి? అంతలేసి మాటలన్నాడా?" మరీ అతి చెయ్యకూడదు. ఒక్కసారిగా కాదు క్రమంగా నరుక్కు రావాలి గాబట్టి అప్పటి కేమీ అనలేదు నేను. కాని కాంతమే సుధీర్ఘంగా ఆలోచించుకుంటూ కొన్నిరోజులు గడిపింది. సమయం సందర్భం చూసుకుని నేను మెల్లగా ముట్టించసాగాను.

"నాకూ మా నాన్న మీద కోపంగానే ఉంది కాంతం. కాని ఏం చేయగలం? అంతా ఆయన స్వార్జితం. కొంత మా అమ్మపసుపు కుంకుమల తాలూకు భూమి. లీగల్‌గా మనకేమీ హక్కులేదు. పోన్లే ఆయన్నే అనుభవించుకోనీ... ఎవరికైనా ఇచ్చుకోనీ... మనకుండేదేదో మనకుంది గదా! నాకు ఉద్యోగముంది... త్వరలో ఇంకో ప్రమోషన్‌వస్తుంది... నీకైతే పూజ్యులైన నా అత్తమామలిచ్చిన ఆస్తి కావాల్సినంత ఉంది" అని నేనొకసారి అంటే "ఇంతసన్నాసివా" అన్నట్లుగా ముటముటలాడుతూ చూసింది. కాసేపాగి "మామగారినేమైనా అంటే ఊరుకోను... ఆయన చాలా మంచాయన... మనమే దూరంగా ఉంచేము. పాపం ఒక్కాయనే స్వయంపాకం చేసుకుంటూ ఒంటరిగా ఉండిపోయారు... అందుకే కొంచెం మనసు విరిగిపోయిందేమో గాని మనమంటే ఇష్టం. మనవడంటే ఎంత ప్రేమో!" అంది. కొంచెం పని జరుగుతోందని'పించి ఇంకా విజృంభించాను.

"అబ్బే! ఎట్టి పరిస్థితుల్లోనూ మనం ఆ ఆస్తి వదలకూడదు కాంతం. నువ్వు వద్దనుకున్నానేను వదలను. ఆ భూములకిప్పుడు ఎంత విలువ వచ్చిందో నీకుసరిగా తెలియదనుకుంటాను. నవ్యాంధ్రరాజధాని కాబోతున్న ఊరు మా తుళ్ళూరు! అక్కడమా నాన్నకున్న భూములు ఇప్పుడు ఎకరానికి పది, పదిహేను కోట్లు పలుకుతున్నాయి తెలుసా! అబ్బ 20 ఎకరాలంటే మొత్తం ఎంత వస్తుందంటావు?" నాకులెక్కలు తెలియనట్లుఅడిగేను. కావాలనే 20 ఎకరాలని అంతా ఎక్కువగా చెప్పేను. "అంత ఆస్తి," అంత సొమ్ము వదులుకోవాలంటే నాకు ఏడుపొస్తోంది కాంతం!" "అంటూ కంట్లో నీళ్ళు రాకపోయినా ముక్కు చీదుకుంటే తన కొంగందించింది. ముక్కు తుడిచి తల నిమిరింది. కాంతానికి కూడా కళ్లలో నీళ్ళు సుళ్లు తిరిగేయి.

"ఛ! అలా ఆలోచించటం తప్పు. ఆస్తులు, విలువల గురించి మాట్లాడవద్దు... ఇవ్వాళుంటాయి... రేపు పోతాయి ఆస్తులు... ఎప్పటికీఉండేవి ప్రేమలూ నురాగాలు, ఆప్యాయతలు. ఇన్నాళ్లూఅవి కరువైపోయాయి పాపం పెద్దాయనకి. "ఆయన మనకేం ఇచ్చినా ఇవ్వకపోయినా, ఆయన్ని బాగా చూసుకోవాల్సిన బాధ్యత మనకుంది" అని కాంతం బుద్ధులు చెబుతుంటే ఆశ్చర్యపోవడం నావంత్కెంది. 'జై తుళ్ళూరూ' అని నేను పుట్టిన ఊరికి మనసులో జయజయ ధ్వానాలు పలికేను. కాంతం

మనసులో పైకి స్పష్టంగా చెప్పకపోయినా కొంత పశ్చాత్తాపం ప్రారంభమైందని పించింది. "కాంతం స్వతహాగా మంచిపిల్ల", అని నాన్నఅన్నది నిజమేనేమో ననిపించింది. పదేపదే "మామగారు ఇన్నాళ్ళూ ఒక్కరే ఉండిపోయారు మనమంతా ఉండికూడా" అంటూ నిజంగానే కన్నీళ్ళు కారుస్తూంటే...

నేను మొదట్లో అంతగా గమనించలేదు గాని కాంతం నన్నునువ్వు... ఏమోయ్ అనటం క్రమంగా తగ్గించింది, ఏమండీ, మీరు అని స్పష్టంగా పిలవకపోయినా... కాంతం ఒకరోజు "మామగారిని చూడాలనిపిస్తోందండీ... పిల్లాడికి కూడా సెలవు లేనండి. కారు మాట్లాడేనండి. మనం ముగ్గురం రేపు వెళ్దామండీ... ఏమంటారండీ... మాట్లాడరేమిటండీ..." అనేసింది...అన్ని'అండీ'లతో నాకు వీనుల విందు చేసింది!! "సరేనండి" అన్నాను మురిపెంగా. "ఛ! ఊరుకోండి... నన్ను మన్నించకండి... మీరంటే నాకన్న మూడేళ్ళు పెద్దవారు ... భర్తను 'అండీ' అనాలి గాని, భార్యను అండీ అనకూడదండీ... మీరు అండీ అనొద్దండీ... ఇంకరేపు మన ఊరు తుళ్ళూరు వెళ్లిపదిరోజులు ఉండివద్దామండీ. ఏమండీ –" అంటూ బుగ్గన ముద్దు పెట్టబోయి దగ్గర్లోఉన్న మా బాబుని చూసి ఆగింది. వాడు చప్పట్లు కొట్టేడు... నాన్న అమ్మతో "అండీ" అనిపించు కుంటున్నందుకు కాదు... తాత దగ్గరికి వెళ్తున్నామన్న ఆనందంతో.

మా అద్దెకారు తుళ్ళూరు చేరుకోకముందే దార్లోచాలామంది ఆపేరు. నవ్యాంధ్రకి కాబోయే రాజధాని సమీపంలోని భూములని కొనడానికో, అమ్మడానికో వస్తున్న వాళ్లనుకుని, వద్దంటున్నా కొబ్బరి బొండాలతో మర్యాదలు చేశారు. తుళ్ళూరు లోనైతే ఒకపెద్ద గుంపు కనబడింది. "భూసేకరణా వద్దు, భూ సమీకరణ అసలేవద్దు, భూములే మాకు ముద్దు" ఇలా రాసి ఉన్న 'ప్లకార్డులు' పట్టుకొని నిరసన ప్రదర్శనలు చేస్తున్నఆ గుంపుకి నాయకత్వం వహిస్తున్న మా నాన్న మమ్మల్ని చూసి "ఇంటి కెళ్లండి... తర్వాత వస్తాను" అని సైగలు చేశాడు.

మేం ఇంటికి వచ్చాం. కాంతం వెంటనే కొంగు దోపుకుని చకచకా వంట చేసేసింది. నాన్న వచ్చిన వెంటనే వద్దంటున్నా కాళ్లు కడిగి నెత్తిమీద కొన్ని చుక్కలు వేసుకుంది. ఆప్యాయంగా భోజనం వడ్డించింది. చాలా సహజంగా చనువుగా మాట్లాడింది ఆయనతో.

మావాడికెలాగూ తాతంటే ఇష్టం గాబట్టి, వెంటనే బాగా మాలిమి అయిపోయాడు. రోజూ సరస్వతీ విద్యామందిరంలో తను నేర్చుకున్న వేమన, సుమతీ శతకాలలోని పద్యాలను ముద్దు ముద్దుగా వినిపించి మురిపించాడు. "తెలుగు మాధ్యమంలో చేర్పించి మీ అమ్మ మంచిపని చేసిందిరా" అనటం విని కాంతం ముసిముసిగా నవ్వుకుంది. మొత్తానికి మావాడు తాతకి బాగా దగ్గరైపోయాడు!

అదేం విచిత్రం కాదు గాని కాంతం కూడా ప్రామాణిక సాంప్రదాయక కోడల్లా ప్రవర్తించింది. నాకు కూడా అది "నటన" అనిపించలేదు. "ఏమండీ... ఏం కూర చేయమంటారండీ... మామగారికే దిష్టమండీ... అని నన్ను అడుగుతుంటే నాన్నే సమాధాన మిచ్చేవాడు, "ఫలానా కూర చెయ్యమ్మా" అని.

కాంతం 'తుళ్ళూరు మామ' దగ్గర తొందరగానే చనువు పెంచుకుంది. ఆప్యాయంగా ముమ్మారు వడ్డిస్తూ బాగానే లబ్జుగా సమాచార సేకరణ చేయగల్గింది. నాన్న కూడా అరమరికలు లేకుండా అన్నీ చెప్పేవాడు. తనకున్న భూమి ఎంతో, ఇప్పుడు ఎంత విలువ పెరిగిందో వివరంగా చెప్పేడు.

అసలు తనకున్నది మొదట్లో పదెకరాలని, కాని ఆ మధ్యన పక్కపొలం ఐదెకరాలు, ఒక"ఎన్నారై"ది అమ్మకాని కొస్తే చౌకలో కొని కలుపుకున్నానని, అది కొనడానికి సొమ్ము సరిపోకపోతే మిమ్మల్ని అడగడానికి ఇష్టంలేక సహకార బ్యాంకులో పంట రుణం తీసుకుని సర్దుబాటు చేసుకున్నానని చెప్పేడు.

"ఆహా! కొంత రుణం ఉందా? తీర్చేద్దాం లెండి", అని కోడలంటే భళ్లున నవ్వి "తీర్చనక్కరలేదు తల్లీ! రుణం మాఫీ అయిపోయింది. ఇతర ప్రాంతాల్లో వాయిదాల పద్ధతిలోనైతే, రాజధాని ప్రాంతం భూములకు ఒకే వాయిదాలో రద్దు చేశారు. ఇంకో సంగతి. భూసమీకరణకి అంగీకార పత్రం ఇస్తే నాకు జీవితాంతం పెన్షన్, ఇంకా పంటలకు బదులు ఏటా నష్టపరిహారం ఇస్తారంట.. పైగా ఇది "జరీబు భూములు" అంటే బహుళ వైవిధ్య పంట భూములన్నమాట. అందుకని ఎకరాకి 1400 చదరపు గజాల చొప్పున నూతన రాజధాని ప్రాంతంలోనే వాణిజ్య స్థలం ఒకేచోట ఇస్తారు. ఆ స్థలాన్ని ఏమైనా చేసుకోవచ్చు. ఏదైనా అంతర్జాతీయ సంస్థకి లీజుకుగాని, డెవలప్‌మెంట్‌కుగాని ఇచ్చుకోవచ్చు" అన్నాడు. దాంతో కళ్లు తేలవేయడం మా ఆవిడవంతైంది.

‘తను అడగలేదులే’ అనుకుని నేనే అడిగేను మరి ఎందుకలా ప్రభుత్వ నిరసన ప్రదర్శనలు చేస్తున్నావని. “అంతేరా నాయనా... అంతా రాజకీయం... అలా కాదు వద్దు, అంటేనే కొన్ని ఎక్కువ రాళ్ళు రాల్తాయి. అందుకే ప్రజాసేవ చేస్తున్నాను. వ్యవసాయం చేసి చేసి విసుగొచ్చేసింది. పైగా నవ్యాంధ్రరాజధాని స్థాపన విషయంలో అంతిమంగా నా వంతు సహకారం అందించాలన్న ఆశయమూ ఉంది. కాదంటే ఉచితంగా ఇవ్వరాదు, సముచితమైన విలువ పొందాలన్న స్వార్థమూ ఉంది” అని చెప్పేడు.

మావగారిని మనసారా అభినందించింది కాంతం. వేం తిరిగి వెళ్ళే రోజంతా ఏడుస్తూనే ఉంది కాంతం. ఆరోగ్యం బాగా చూసుకోమని మామగారికి పదే పదే చెప్పింది. అన్నివ్యవహారాలు అయిపోయాక అందరం ఒకేచోట ఉండాలని, అమ్మానాన్నలేని తనని కోడలిగాకాక కూతురిలా చూసుకుంటారని ఆశిస్తున్నానని నిజాయితీ ఉట్టిపడేలా చెప్పింది. తనవల్లకొన్ని పొరపాట్లు జరిగిన మాట వాస్తవమేనని, తను ఇప్పటికే మారిపోయానని, ఇది శాశ్వత మార్పని గ్రహించి క్షమించమని అరమరికలు, భేషజాలు లేకుండా వేడుకొంది.

ఇంటికి, అదే కాంతం ఇంటికి తిరిగి వచ్చేశాం. నేను లోలోపల కొంచెం అనుమానించినట్లుగా ఏమీ జరగలేదు. కాంతం అనుకూలవతిగా, మంచి ఇల్లాలుగానే ఉండిపోయింది. ఒక సంఘటన గాని, ఒక కారణం మూలంగా గాని, నాస్తికులు ఆస్తికులైపోయినట్లుగానే మా ఆవిడ మంచిఇల్లాలై పోయింది. ఇది శాశ్వత మార్పు అనే అనిపిస్తోంది.

మా తుళ్ళూరు మన నవ్యాంధ్రకు కాబోయే రాజధానిగా ప్రకటించినందు వలన నా భార్య నాకింత అనుకూలవతిగా, మంచి ఇల్లాలుగా మారింది. ఎవరైనా సన్నిహితులు తనలోని మార్పును గమనించి “ఏమిటి సంగతి” అని అడిగితే మా కాంతం “అబ్బే నా తప్పులు నేనే తెలుసుకున్నాను... భర్తని బాగా చూసుకుంటేనే, గౌరవిస్తేనే ఇల్లాలికి గౌరవం అని తెలుసుకున్నాను. మారేను” అని చెబుతోంది గాని ఇదంతా “తుళ్లూరు మామ మహిమ” అని నేననుకుంటాను.

(2015 రంజని బ హుమతి కథ – 4లో ప్రచురితం)

# దారికి రాని రాణి

మా ఆవిడచాలా స్పీడు! ఈ విషయం నాకు పెళ్ళిచూపుల రోజునే స్పష్టంగా తెలిసిపోయింది. నా ముందు ప్లేట్లో, కాబోయే అత్తగారు పెట్టిన జీడిపప్పు పలుకులు నోట్లో వేసుకొందామను కొనేలోగానే, అందాల మెరుపు తీగలా లోపలి గదిలోంచి చరచరా వచ్చేసి, నా కళ్ళలోకి సూటిగా చూస్తూ ఎడమచేత్తో షేక్‌హేండ్ ఇస్తూ తన కాళ్ళతో నా కాళ్ళను ఉద్దేశపూర్వకంగా కాకపోవచ్చు గాని తాకుతూ, కుడిచే0తిలోని వేడి వేడి కాఫీ కప్పుని ఇచ్చి వెంటనే, "ఊ తాగండి – ఎంగిలి చేయలేదు ఇది పాలగ్లాసు కాదు గదా!", అని తన జోకుకి తనే ఫకాల్న నవ్వింది. –నేను తేరుకొనేలోగానే, "మా నాన్న మీకోసం స్వయంగా చేసిన "మంచి సినిమా వంటి ఫిల్టర్ కాఫీ" అని మరోసారి నవ్వింది. వెంటనే పక్కనే ఉన్న సింహాసనం లాంటి, తనకే రిజర్వు చేసి ఉంచబడిన, ముఖ్‌మల్ పరచిన అద్దె కుర్చీలో కూర్చుని, ఇంకేమీ జోకులు వేయకుండా నా ముందున్న జీడిపప్పు ప్లేటు లాక్కొని, ఆ పలుకులు వేగంగా ఆరగించ సాగింది, కరకరలాడిస్తూ. (నేనలాగే కొయ్యబారిపోయి వుంటే గమనించి కాబోలు, మాటల్లో పెడదామని, తిండికి కాస్త విరామమిచ్చి అడిగింది "ఔనూ, మీ పేరు వెంకటప్పయ్యంట కదా – ఏం బాలేదు – ఇంకా నయం ఇంటిపేరు అల్లాటప్పాకాదు – ఇంతకీ ఇంటి పేరేంటి? అమ్మచెప్పింది గాని మర్చిపోయా" – "వెంపటి..." నెమ్మదిగా గొణిగాను – 'కుంపటిలా ఉందని' ఎద్దేవా చేస్తుందని భయపడుతూ...

"ఆ ఇది కొంత పర్వాలేదు – "వెంపటి వెంకట్" అని మార్చిద్దాం మీ పేరు?" తన ఎదసంపదను, ముత్యాల పలువరుసను చూడ్డంలోనే నిమగ్నమైపోయిన నేను ఏం మాట్లాడలేకపోయేను – కొంచెం తేరుకోవడానికి గాను, కిందిచూపులు చూస్తే ఖాళీ అయిన జీడిపప్పు ప్లేటు కనపడింది. ఉసూరుమనిపించి పక్కకిచూపులు మరల్చాను. ఓ మూలచేతులు కట్టుకొని నిలబడి ఉన్న ఓ బక్కశాల్తీని చూసి 'కాబోయే మామగారీయనే – కాఫీ పెట్టిచ్చింది కూడాఈయనేనని', నిర్ధారణ చేసుకుని, కాఫీ తాగబోయి మూతి కాల్చుకొని మూలిగాను. దాంతో రాణి నామధేయురాలు, నా గుండెల్ని పిండేస్తున్న ఆ రూపసి తోబాటు స్థూలకాయురాలైన, కాబోయే అత్తగారు

కూడా పడీపడీ నవ్వసాగేరు తెరలు తెరలుగా – కాబోయే మావగారు మాత్రం ఎటో నిర్వేదంగా చూస్తూ మౌనంగా ఉండిపోవటం చూసి ఇంట్లో ఆయన స్థానమేమిటో బాగా అర్థం చేసుకొన్నాను. ఆ ఇంటి పరిస్థితి "ఆడపెత్తనమనీ" తెలిసిపోయింది – ఈ సంబంధం ఒప్పుకుంటే, మన సంగతీ అంతేనని కూడా అర్థమై పోయింది! – కాని పిల్లబాగుంది కదా అన్న మధురభావం, మనసులో తిష్ఠ వేసుకుని కదలటం లేదు – మధ్యవర్తి ముందే చెప్పి ఉంచిన కట్నం వివరాలు, ఆ మోజుని ద్విగుణీకృతం చేస్తుంటే ఏమీ ఇదమిద్ధంగా నిర్ణయించుకోలేక, మౌనంగా ఉండిపోయాను. కూడా వచ్చిన మధ్యవర్తి, తన పని అది మాత్రమేనన్నట్టు, టిఫిన్‌లు ఆరగించటంలోనే మునిగిపోయున్నాడు. నేనైనా కాస్తంతైనా అభిజాత్యం చూపించాలన్న పాడు కోరిక కలిగి సగం తాగిన కాఫీ కప్పుని బల్లమీద, పెట్టేయ బోయి, కాబోయే అత్తగారు కాస్త తీక్షణంగా చూస్తుంటే, 'జడుసుకొని' మిగిలిన కాఫీ కూడా గడగడా తాగేశాను. దాంతో ఆవిడ ప్రసన్నమైపోయి, ఇంకో జీడిపప్పు ప్లేటు తెచ్చిస్తుందేమోనన్న చిన్నఆశ కలిగింది – కాని ఆవిడకదలలేదు – అసలే స్థూలకాయురాలాయె !

ఏదో మాట్లాడాలనిపించి నోరు విప్పేలోగా కాబోయే అత్తగారు ఆగమన్నట్లు చెయ్యూపి, "నీకు వెనుక ముందు ఎవరూ లేరటగా – ఎక్కడో వేరే రూమ్‌లో ఉంటున్నావంట – అయితే కొంచెం వంట వచ్చే ఉంటుంది" మా అమ్మాయికైతే రాదులే – దానికేం ఖర్మ" – ఈ సారి దర్జాగా కాళ్ళు కూడా ఊపుకొంటూ ఖచ్చితంగా చెప్పేసింది.

ఆరగింపు కార్యక్రమం పూర్తయిపోయింది కాబోలు తను కలుగ చేసుకొన్నాడు మధ్యవర్తి – "బాగా వంట చేయడం రాకపోతే మావగారి దగ్గర కొన్నాళ్ళు శిక్షణ తీసుకొంటాడు కుర్రాడు – అదేమన్నా బ్రహ్మ విద్యా – నేర్చుకోలేకపోవడానికి" – ఇంతకీతమరి నిర్ణయమేమిటో...." తల్లీకూతుళ్ళను మాత్రమే చూస్తూ అడిగేసాడు, నా నిర్ణయం పసిగట్టేసేడో, లేక అది అంత ప్రధానం కాదనుకొన్నాడో తెలియలేదు నాకు– అయినా, ఏదో దౌర్బల్యంతో, ఏమీ మాట్లాడలేక పోయాను. వాళ్ళూ తమ నిర్ణయం అప్పుడే చెప్పలేదు గాని, తల్లీకూతుళ్ళు నా గురించి, ఉద్యోగం జీతం

వంటి వాటి గురించి ఎన్నోప్రశ్నలు ఓ గంటసేపు అడిగితే అన్నింటికీ బహు వినయంగా జవాబిచ్చాను. మనసులో నాకే ఆశ్చర్యం గొలిపే రీతిలో – అంతలా పడిపోయేనన్నమాట ఆ రాణి అందచందాలకు. ఆఖరికి, ఆ మహాతల్లి, అదే కాబోయే అత్తగారు "మాకు సమ్మతమేనబ్బాయ్" అనటం రాణి కూడా "డిటో" అన్నట్లు మందస్మితంతో తలపంకించటం చూసి నేను ఉబ్బితబ్బిబ్బై పోయాను. ఏనుగెక్కినంత సంబరపడిపోయాను. నాకులభించిన వరానికి ఎలా కృతజ్ఞతలు చెప్పానో, ఏం వాగానో ఇప్పుడేమీ జ్ఞాపకం లేదు. ఆ విధంగా పెళ్ళిచూపులు తతంగంలో నా దుర్బలత్వానికి, దాంపత్యంలో రాణి ఆధిపత్యానికి హైబ్రీడ్ బీజాలు పడ్డాయన్నమాట! అంతే తర్వాత రాణీకున్నంత స్పీడుగా అన్ని పరిణామాలు జరిగిపోయాయి. నా ఖర్చేగాని, జోక్యం పెద్దగా లేకుండాపెళ్ళి జరిగిపోయింది పదిరోజుల్లోపే – అయినా నా తరపున పెద్దగా చుట్టాల్లేనందున వాళ్ళ అతి ప్రమేయం నాకేమీ తలవంపులు కలిగించలేదు. తలంబ్రాలు పోసుకోవటం, బిందెలో ఉంగరాలు వెతకటం, గుమ్మం దగ్గర పేరు చెప్పటం, ప్రధానంగా కాలు తొక్కటం వంటి అన్నితతంగాల్లోను రాణి ఆధిపత్యం, నాకేగాదు పెళ్ళికొచ్చిన వారందరికీస్పష్టమయిపోయినా నాకుబాధకలగలేదు. కాలు తొక్కిన విధమే కాపురం చేసేకళ తెలియజేస్తుందన్న సామెత మాత్రం నిజమైంది.

మొదటిరాత్రి గది గడియ తానే వేసింది. పాలు తనే ముందు తాగి నాకు కొంచెమే ఉంచింది. తను మాట్లాడిన మొదటిమాట ఏమిటో తెలుసా? "ఇదిగో వెంకట్! అండీకొండీఅనటం నాకిష్టముండదు ఏమంటావ్" నేనేదో అనేలోగానే గట్టిగా హత్తుకొనిపోయి, ఏవో తెలియని కొత్త లోకాలకు ఎత్తుకుపోయింది. చిత్తయి పోయాను.

ఇకమొదటి నెల జీతం రాగానే, మొత్తం లాగేసుకుందని, ఆవిధంగా ఆర్థికపరమైన ఆధిపత్యం కూడా తీసేసుకుందని వేరే చెప్పాలా? వీటన్నింటిని నేను పెద్దగా పట్టించుకోలేదు గాని, వంటావార్పు మొత్తం నామీదే పడిపోవటం మాత్రం అంతగా రుచించలేదు. ఈ దుస్థితిని కొన్నినెలలు ఎలాగో భరించి, ఓరోజు తెల్లవారు జామునే లేచి, "ఏదో చేయాలి, ఈ జీవితంలో కొంత్కెనా ఆఖరికి వంటావార్పు డ్యూటీలోనైనా కొంత పరివర్తన తేవాలని నిశ్చయించుకొన్నాను. కాఫీ పెడుతూ,

దీర్ఘంగా ఆలోచించగా, 'చించగా' తరుణోపాయం తోచింది – ప్లాన్ క్రమంగా జాగ్రత్తగా అమలు పరచసాగేను.

వంట బాధ్యత నివారణ కార్యాచరణ ప్రణాళికలో తొలిమెట్టుగా ఓ సాయంత్రం వంట త్వరగా ముగించి, తను వింటుండగా నా కజిన్ ఒకడికి ఫోన్ చేసి మాట్లాడేను "ఒరేయ్ – ఏదో వంకపెట్టి నువ్వు మా పెళ్ళికి రాలేదు. ఓసారి వచ్చి నా భార్య అందచందాలు, గుణగణాలు చూసి నువ్వు 'కుళ్ళుకోవాలని', నా కోరిక– కాబట్టి ఈ ఆదివారం మా ఇంటికి మీ ఉభయులూ, పిల్లాడితో సహా భోజనానికి రావాలి. మా ఆవిడవంట ఎలా ఉంటుందోనని భయపడాల్సిన పనిలేదు. ఎప్పటిలా నేనే వంట చేస్తాను. అన్నట్లు గిఫ్ట్ తేవటం మరచిపోకేం" సరే ఉంటాను…" ఇలా గడగడా చెప్పేసి ఫోను పెట్టేయగానే 'రాణి' గుడ్లురుముతూ కనపడింది.

"వంట ఎప్పుడూ నేనే చేస్తాను మా ఆవిడ చెయ్యదు అని పనికట్టుకుని చెప్పాలా?" అని దులిపేస్తుందనుకొన్నాను. అబ్బే అదేం కాదు, "ఏదో గిఫ్ట్ తెమ్మని చెప్పటమేమిటి? మాకుఎలక్ట్రిక్ కుక్కర్ లేదు కష్టమవుతోంది అది తేరా" అని చెప్పి ఉండొచ్చు గదా అని దులిపింది. ఏదో ఫారిన్‌లో ఉండొచ్చినట్టు, 'ఫారిన్‌లో తమకు కావల్సిన గిఫ్ట్ ఏదో స్పష్టంగా ముందే చెప్తారు – తెలుసా', అని దబాయించింది. అంతేగాని మొగుడే వంట చేస్తాడని ఇతరులకు కూడా తెలిసిపోతే ఎలా అని నామోషీ ఫీలయినట్లు మాత్రం అనిపించక ఉసూరుమంది నా మనసు.

అయినా, నిరుత్సాహం చంపుకొని నా ప్రణాళిక పకడ్బందీగా అమలు పరచసాగేను. ఆ ఆదివారం పొద్దున్న పాలవాడు బెల్ కొట్టినపుడు, ఇదివరకటిలా తలుపుచాటున నిలబడి, గిన్నెతోసి, గుట్టుగా తీసుకోకుండా బహిరంగంగా దర్జాగా బయటికి వెళ్ళి పాలుపోయించుకొని, వాడిని కబుర్లలో పెట్టాను, పక్కిళ్ళవాళ్ళకి వినిపించేంత గట్టిగా.

"ఏవోయ్ నువ్వు పొద్దున్నేఇలా పాల పంపిణీకార్యక్రమానికి వచ్చేస్తావు గదా, 'కాఫీ గట్రా' మీ ఆవిడే పెట్టుకోవాలా నిద్రాభంగం చేసుకొని, లేకమీ నాన్న ఉన్నాడా ఆ పని చేయడానికి? ఇంకా ఇతర ఇంటిపనులు, అదే… వంటావార్పూ మీ ఇంట్లో ఎవరు చేస్తారు, నువ్విలా వచ్చేస్తే? నువ్వు తిరిగి వెళ్ళాకనే చేస్తావా?

అన్నిళ్ళలో పాలు పోసి పోయేసరికి వంటకు లేటయిపోదా? మీ పిల్లలకి స్నానాలెవరు చేయిస్తారు? ఇలా ప్రశ్నల వర్షం కురిపించేసరికి, పాలవాడు బిత్తరపోయి, తన తుండుగుడ్డకూడాకంగారులో మా గుమ్మం దగ్గరే వదిలేసి పారిపోయాడు! అయితే నేను ఆశించిన ఫలితం దక్కింది. "పక్కింటి మీనాక్షమ్మగారు", అంతా స్పష్టంగా విని, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది!!

ఆవిడసలే 'బి.బి.సి'. అని మా ఆవిడోసారి చెప్పింది. కాబట్టి మా ఇంటి సమాచారం సాయంత్రంలోగా కనీసం వీధిలో వాళ్ళందరికీ తెలిసిపోతుందన్న ఆశ కలిగింది. వంటింట్లోకి వెళ్ళబోతూ పడగ్గదిలోకి తొంగి చూశాను. నా ఈవాగుడంతా విన్నదనడానికి నిదర్శనంగా మా ఆవిడ దుప్పటికింద అసహనంగా కదలటం చూసి సంతృప్తిగా తలపంకించాను.

హుషారుగా ఈల వేసుకొంటూ, వంటింట్లోకి వెళ్ళి ఉల్లిపాయలు తరుగుతుంటే ఆనందభాష్పాలొచ్చాయి! కాసేపటికి రాణి లేచిన శబ్దమైతే, "ఒక్కక్షణం – కాఫీ తెస్తున్నాను" అని గట్టిగా అరిచేను పక్కవాటాల వాళ్ళకి కూడా వినపడేలా. ఇచ్చిన కాఫీ తాగుతూ "ఇంత దగ్గరిలో ఉండికూడా అంతలా అరవటమెందుకు", అని మెల్లగా గొణిగింది. నేను విజయగర్వంతో వంటింట్లోకి వెళ్ళిపోయాను.

మళ్ళీ అక్కడ్నించే అరిచేను, "ఈ వేళ అతిథులొస్తున్నారు గదా – ఫ్రైడ్‌రైస్ చేస్తున్నాను – బంగాళదుంపకుర్మాకూడా– ఔనూ బెండకాయలు మరీ లేతగా లేవు – వేపుడు చేయనా? పులుసా?" – బాత్రూంలో ఉందనుకొంటూ, ఏమీ సమాధానం చెప్పలేదు.

తర్వాత కూడా వంట పూర్తయే వరకు– "నా పులుసయి పోయింది – నీ సీరియలైపోయిందా? అరటికాయ ఆవపెట్టనా – ఇగురు మొన్న కుదరలేదన్నావు కదా! లలల్లా... లేచింది మహిళా లోకం, దద్దరిల్లింది పురుష ప్రపంచం... నలభీమపాకం, ఆడోళ్ళకు రాదే మా లోకం – ఇలా అర్థం పర్థం లేకుండా ఆడుతూ పాడుతూ పక్కవాటాల వాళ్ళకి కూడావినపడేలా అరుస్తూ వంట పూర్తి చేశాను. అక్కడికీ, అర్ధాంగి, "అబ్బా గట్టిగా అరవొద్దు, నాకుటీవీ వినిపించటం లేదని" హాల్లోంచి గద్దించినా, లెక్కచేయలేదు. తనే టీవీ వాల్యూమ్ పెంచుకొందిగాని మరీ

కోప్పడలేదెందుకనో! నా మాటలు పాటలు పక్కవాటాల వాళ్ళు చక్కగా విని ఉంటారన్న నమ్మకం కలిగింది.

కజిన్, మిత్రుడు రవి కుటుంబంతో సహా, అంటే భార్యరమణి, పుత్రరత్నం అయిదేళ్ళవాడు ప్రవీణ్‌లతో 12 గంటలకి వచ్చేసరికి, మా రాణి చక్కగా స్నానం చేసి జరీపట్టుచీర కట్టుకుని దర్జాగా సోఫాలో కూర్చుని ఇంకో సీరియల్ చూస్తూ ఉంది. నేను మాత్రం పని అవ్వనట్లుగా నాటకమాడుతూ వంటింట్లోనే ఉండి పోయాను. రవి వచ్చి బెల్ కొట్టేసరికి, కావాలనే మసి పూసుకొన్న లుంగీతో చిల్లుల బనీన్‌తో వెళ్ళి తలుపు తీశాను. వాళ్ళని అలా రిసీవ్ చేసుకుంటుంటే, రవి భార్యరమణి నా అవతారం కేసి, దర్జాగా జరీచీరలో ఉన్న రాణి కేసి మార్చి మార్చి చూసింది. నేనదేం పట్టించుకోకుండా, “ఇప్పుడే వంట పూర్తి చేశాను, రండి... లోపలికి రండి... అని ఆహ్వానించాను. “రాణీ, వీళ్ళే మా రవి, రమణి – వీడు వాళ్ళ పుత్రరత్నం ప్రవీణ్ అని పరిచయకార్యక్రమం పూర్తిచేసి “రాణీ, రమణితో మాట్లాడుతూండు. నేను వెళ్ళి స్నానం చేసి వస్తాను” అంటూ లోపలికి పరిగెత్తాను.

వెళ్తూండగా ప్రవీణ్‌గాడు, “ఆంటీ మీఇంట్లో అంకులే వంట చేస్తారా?” అని మా ఆవిడ్నేధైర్యంగా అడిగేయటం వినపడిచాలా ఆనందించాను. రాణి ఏదో గొణిగింది గాని అది నాకువినపడలేదు. ‘సరేలే’ అనుకుని బాత్రూంలోకి దూరిపోయాను. అంతా నేను రవికి, రమణికి ముందే రహస్యంగా చెప్పి ఉంచినట్లే జరుగుతోందన్న విశ్వాసం కలిగింది. స్నానం తొందరగానే, ముగించుకునొచ్చి, రండి... భోజనానికి కూర్చోండి. రాణీ! నువ్వుకూడాకూర్చో. నేను వడ్డిస్తా కదా” అన్నా.

“అదేంటన్నయ్యగారూ! వంట ఎలానూ మీరే చేశానంటున్నారు, వడ్డన పని కూడామీకెందుకు, ఆడవాళ్ళమిద్దరం ఉండగా! ఏమంటారు రాణిగారూ”. రమణి మాటలకు రాణీ ఏమనలేదు – రవే “అందరం ఒక్కసారే కూర్చుందాం. కబుర్లు చెప్పుకుంటూ ఎవళ్ళకి వాళ్ళే వడ్డించుకుందాం” అన్నాడు. ప్రపోజల్ నచ్చినట్లు మందహాసం చేసింది, రాణి! అందరం తింటుండగా నేనే ఎక్కువగా లొడలొడా వాగుతూనే ఉన్నాను, చేసిన వంటకాల గురించి, పనిమనిషి రానప్పుడు అంట్లు కూడా దానికన్నా తెల్లగా తోముతానని సందర్భం లేకపోయినా డబ్బా కొట్టుకున్నాను.

వాకిట్లో ముగ్గులు పెట్టటం కూడా త్వరలో నేర్చుకొని ఆ లోటు కూడా లేకుండా చేస్తానని వాగాను.

రమణిని కొన్ని శాంపుల్ ముగ్గులు డ్రాయింగ్ లేసి పంపమని అభ్యర్ధించాను. రాణి ఏం మాట్లాడలేదు గాని, వాళ్ళు చూడనప్పుడు నాకేసి గుడ్లురిమి చూడటాన్ని గమనించనట్లు నటించాను. రమణి కూడా ఏం మాట్లాడకుండా భోజనం చేయటాన్ని గమనించి రవిని గిల్లేను ఎవరూ చూడకుండా. వాడు వాళ్ళబ్బాయిని గిల్లేడు. దాంతో చిచ్చరపిడుగు అందుకొన్నాడు.

"నాన్నా – అంకులే వంట చేయటం, ముగ్గులు కూడా నేర్చుకొంటాననటం చాలా విచిత్రంగా ఉంది కదా! ఇలాంటోళ్ళనేనా ఆడంగోళ్ళు అంటారు? అమాయకంగా అడిగాడు. వాళ్ళ అమ్మనాన్న'హుష్ – తప్పు' అని హెచ్చరించలేదు!

సరే భోజనాలయ్యాక, నేనే తాంబూలాలు చుట్టి అతిధులతో సహా రాణికి ఇచ్చి నేనోటి లాగించాను. వెళ్తూ వెళ్తూ ముందే మేం నిర్ణయించుకొన్నవిధంగానే రమణి అంది నువ్వు అదృష్టవంతురాలివక్కా ఇలాంటి భర్త లభించినందుకు – కానీ ఏ పనీలేక లావయిపోతున్నట్లున్నావు కాస్త జాగ్రత్త పడక్కా. "అక్కా అక్కా" అని నొక్కి పలికింది తానే పెద్దదానినని తెలిసికూడా, రాణి స్థూలకాయాన్ని పరోక్షంగా వెక్కిరిస్తూ! వెంటనే చిచ్చర పిడుగుగాడు కూడా అందుకున్నాడు. వంటచేసే మగాళ్ళని ఆడంగోళ్ళు అంటారు, ఏ పనీ చేయకుండా లావయ్యే ఆంటీలనేమంటారమ్మా" అంటూ. వాణ్ణేమాత్రం వారించకుండా తల్లిదండ్రులిద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ బయటికెళ్ళిపోయి ఒక ఆటోని పిలిచారు. ఆటోలోంచి తొంగిచూస్తూ రమణి మళ్ళీ "వస్తానక్కా" అంటూ చెయ్యూపింది

రాణి ముఖం, తిరగేయటం ఆలస్యమయిన పెసరట్టులా నల్లగా మాడింది! ఏడ్వలేక నవ్వుతూ వాళ్ళని సాగనంపింది గుమ్మంలోంచే – తర్వాత నాతో ఏమీ మాట్లాడకుండా టీవీ పెట్టుకోకుండా సోఫాలో కూర్చుని దీర్ఘాలోచనలో మునిగిపోయింది.

నా ప్లాన్ విజయవంతమయింది – రాణిలో పరివర్తన మొదల్కోంది. ఏ ఆడదీ మొగుణ్ణి "ఆడంగి" అనుకోవటం సహించలేదు అని ఊహించాను. నాకిక

“వంటింటి డ్యూటీ” క్రమంగానైనా తప్పిపోతుంది. తను త్వరలో వంట నేర్చేసు కుంటుందని ఆశించాను.

కాని నా ఆశ వమ్ము అయింది – మర్నాడు పొద్దున్న ఎప్పట్లానే ఏకవచనంలో “ఈ రోజు సెలవు పెట్టు” అని క్లుప్తంగా ఆదేశించింది. నా దగ్గరే ఒక్క రోజులోనే వంట నేర్చుకుందామన్న ఉద్దేశ్యమేమో అనుకొన్నాను. నేనేదో అనేలోగానే తనే చెప్పింది

“ఈ రోజు మనం ఇల్లు మారుతున్నాం – మా అమ్మ వాళ్ళింటికి మారుతున్నాం. సామాన్లకి లారీ మాట్లాడిరా”.

“ఎందుకు! అలా...అర్ధాంతరంగా...”అయోమయంగా గొణిగాను. ఈ సారి వివరంగా చెప్పింది మా ఆవిడరాణి –

“ఎందుకంటే... మా వాళ్ళ ఇల్లు మనందరికీ సరిపోయేంత పెద్దది. వాళ్ళకీ నేనొక్కదాన్నే కదా! కలిసుండొచ్చు. పైగా “మా ఇల్లు” ఊరికి దూరంగా విడిగా ఉంది. ఇక్కడిలా పక్కపక్క వాటాలోళ్ళు మనింట్లో ఏం జరుగుతోందనని ఆసక్తిగా చూసేవాళ్ళు, నీ పాడుపాటలు, వాగుళ్ళు విని చెవులు కొరుక్కునే వాళ్ళుండరు. ఇంటిగుట్టు ఇంట్లోనే ఉంటుంది. ఇల్లుదూరం కాబట్టి, మీ రవీ, రమణీలాంటి పనికిమాలినోళ్ళు పిలిచినా భోజనానికి రారు, నీకూ వంటలో మా నాన్న సాయం ఉంటుంది...

“మరి... మరి నీకు అస్సలు ఎక్సర్‌సైజు లేకపోతే...”

“సంతోషించాంలే నీ తెలివికి... ఆ చుప్పనాతి రమణి అక్కా” అని పిలిచినంత మాత్రాన నేను లావుపాటిదాన్నా? అయినా మా ఇంటిముందు పెద్దతోట ఉంది కదా! నేనా “తోటలో వాకింగు చేయొచ్చు. నువ్వు కూరగాయలు పండించొచ్చు. ఇంకా నిలబడిఉన్నావేం! వెళ్ళి లారీ తీసుకురా సరిగ్గా బేరమాడి..”. ఇంకేం మాట్లాడేది లేదన్నట్లుతల తిప్పేసుకొంది. ఇంకేం చేస్తాను రాణి ఆదేశాలు పాటించటం తప్ప – ఇదండీ దారికి రాని మా రాణి ధోరణి!!!

(25–4–2010 ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధంలో ప్రచురితమైంది)

## “త్యాగరాజు”

“ఏరా – ఏమంటావ్ – ఆ ‘మండపేటవాళ్ళ’కి, పెళ్ళిచూపులకి ఫలానారోజు వస్తున్నామని ఫోను చేయనా?”

...“ఏంట్రా ఉలకవ్‌పలకవ్... నేను తనని చూసే, మాట్లాడే, చెబుతున్నా ‘అమ్మాయి’ లక్షణంగా ఉంది. చదువుకున్నది, సంస్కారమున్నది – కొన్ని ‘ఇంటర్వ్యూ’లకి కూడా వెళ్ళిందట. రేపోమాపో, ఏదో మంచి ఉద్యోగంలో కుదురు కుంటుంది. నాతో మాటల్లో, నీ రచనల్ని తెగ మెచ్చుకుంది కూడా. అన్నివిధాలా నీకూ, నాకూ తగినదనే కదా, ఇంతగా మొత్తుకుంటున్నా ఒక్కసారి చూసి మాట్లాడి, నచ్చితేనే చేసుకుందువులే ... ఇదంతా నా కోసమా... ఏదో నేనుండగానే...” ఇంకా ఏదో చెప్పబోయి, దు:ఖం ముంచుకొచ్చి, నోరుపెగలక, లోపలికి వెళ్ళిపోయింది సుగుణమ్మ నోట్లోకొంగు కుక్కుకుంటూ –

వెళ్ళిపోతున్న తల్లివంక చూస్తున్న సుధాకర్ కళ్ళు చెమర్చాయి – ‘ఏదో నేనుండగానే’ అన్న పలుకులు అతని హృదయాన్ని సమ్మెటల్లాతాకి బాగా బాధించాయి. దాదాపు ఒకఆరునెలలుగా ఆమె ఆరోగ్యం క్షీణిస్తూనే ఉంది. ఎన్నోరకాల చికిత్సలకి లొంగకుండా, వైద్యులకి అసలు రోగమేమిటో అంతు చిక్కకుండా!! ‘నేనుండగానే’, అని మొదలుపెట్టి అసంపూర్ణంగా ముగించేసి, చెప్పలేక వదిలిపెట్టేసిన, అమ్మ ఇంకా అనాలనుకున్న మాటలు మెల్లగా “అశరీరవాణిలా” ‘కొడుకు హృదయ శ్రవణాల’కు ఇలా చేరుకున్నాయి.‘ఒరే – ప్రేమించి పెళ్ళి చేసుకుని, నువ్వు పుట్టిన సంవత్సరానికే తన మానాన తను వెళ్ళిపోయిన మీ నాన్న జ్ఞాపకాలతో బతుకుతూ, ఎవరిసాయం కోరకుండా, కేవలం ఆత్మాభిమాన ధనంతో ఎలాగో పెంచి పెద్ద చేసినా, తగినంత ఆర్థిక స్థాయికి నిన్ను తీసుకు రాలేక పోయానన్న బాధే నన్ను కుంగదీస్తోంది,– శారీరకంగా, మానసికంగా – నువ్వు నీ కిష్టమైన రచనా వ్యాసంగంలో కొనసాగుతూనే, ఆర్థికంగా ఏ లోటూపాటూ లేకుండా ఉండాలన్నది మాత్రమే నా తాపత్రయం. అంతేగాని, పుట్టినప్పట్నుంచీ కనీస అవసరాలు తీర్చుకోవాడానికే అష్టకష్టాలు పడ్డ నాకు, ఒక్కసారిగా నీ పెళ్ళి ద్వారా సిరిసంపదలతో వెలిగిపోవాలన్న అత్యాశ ఇప్పుడు కలుగుతుందా? ఇంకెన్నాళ్ళు

బతుకుతానో కూడా తెలియని ఈ సమయంలో? "ఏదో నేనుండగానే..." ఇక సుధాకర్ హృదయ శ్రవణాలు కూడా తర్వాతి మాటలేవీ వినలేని చెవిటివై పోయాయి! ఏమీ తేల్చుకోలేని అయోమయస్థితిలో అచేతనంగా ఉన్నచోటనే బండగా వుండిపోయాడు.

అతనికీ, ఎంతోమంది మెప్పు పొందుతున్నాకేవలం రచనా వ్యాసంగంతో ఆర్థిక పరిపుష్టిని సాధించలేనని, అనారోగ్య కారణంగా ఇంతకాలంగా చేస్తున్న పంతులమ్మ ఉద్యోగాన్ని వదిలేయాల్సి వచ్చిన అమ్మను ఇప్పట్నుంచైనా సుఖపెట్టాలంటే తాను ఏదో ఒక ఉద్యోగం చేసి తీరాలని తెలుసు. అందుకే కదా, 'సివిల్స్'కి ప్రిపేరవు తున్నాడు – ఇతర ఉద్యోగ ప్రవేశ పరీక్షలెన్నో రాస్తున్నాడు. "వరకట్నంతో జీవితాన్ని మెరుగు పరచుకోవాలన్న అమ్మ మనసులోని పరోక్ష ఆలోచన"ని మాత్రం అంగీకరించలేక పోతున్నాడంతే!

అదృష్టవశాత్తూ, 'సుధాకర్'కి ఓ 'ఆపద్భాంధవుడు'న్నాడు. అతనే "త్యాగరాజు మామయ్య". సుగుణమ్మకాయన స్వంత అన్నయ్య కాదుగాని అంతకన్న చాలా చాలా ఎక్కువ! పెదనాన్నగారి ఏకైక కుమారుడు. ప్రేమించిన 'నారాయణ'ని తల్లితండ్రుల అభీష్టానికి విరుద్ధంగా సుగుణ పెళ్ళి చేసుకున్నప్పుడు బంధుమిత్రులందరూ దూరంగా ఉండిపోయినా, చేతనైనంత ఆదరించిన ఒకే ఒక్కడు! తర్వాత భర్తపోయి అనాథైపోయిన ఆమెకు ఒక దారీతెన్నూ చూపించిన ఏకైకబంధువు – తన కున్నంతలో ఆర్థికంగా కూడా సోదరికి, మేనల్లుడికీ అండదండగా ఉండాలన్న కోరిక మనసులో ఎంతగా ఉన్నా, ఆమె ఆత్మాభిమానాన్ని అర్థం చేసుకునే సహృదయుడు, అత్యవసరమైనప్పుడు, ఎప్పుడైనా డబ్బురూపంలో సాయం కోరితే చిరునవ్వుతో అడిగిన దానికన్న ఎక్కువగా సోదరి చేతిలో పెట్టే పెన్నిధి.

వీలైనంత త్వరలో ఆమె ఆ 'అప్పు'ని తీర్చేస్తున్నప్పుడు పైకేమీ అనలేక లోలోన బాధపడుతూనే తీసుకునేవాడు. ఊళ్ళో వాళ్ళందరికీ, ఆయనంటే చాలా గౌరవం, ఇష్టం – కారణం ఆయన ఊరికి "ఉపకారి"గా, ఎందరికో "పరోపకారి"గా ఉండటం. అందుకు సరిపడా ఆర్థిక వనరులుండటం. సుధాకర్‌కి కూడా, 'త్యాగరాజు

మామయ్య' అంటే చాలా గౌరవం, ఇష్టం కూడాను. 'గురువు'గా, 'మార్గదర్శి'గా భావిస్తాడాయన్ని. వయసులో ఇరవైఏళ్ళు పెద్దోడైనా, చనువుగానే ఉంటాడాయనతో. అన్నట్లు, గతంలో అలా పెద్దగా జరగలేదు గాని, ఈ మధ్యన అమ్మకి తెలియకుండా కొద్దిపాటి సొమ్ముని 'సివిల్స్'కి ప్రిపేరవటానికి, అవసరమైన ఖర్చుల నిమిత్తం కొంత అప్పుగా తీసుకున్నాడు కూడా. అటువంటి 'ఆపద్బాంధవుడి'ని కొంత సన్నిహితంగానే కాకుండా ఏకాంతంగా కూడా అంటే పెళ్ళీ పెడాకులు తలపెట్టకుండా లంకంత స్వంత ఇంట్లో ఒంటరిగా వుండే త్యాగరాజు మామయ్యని, ఒక్కడే వెళ్ళి కలిశాడు సుధాకర్ – మండపేట సంబంధం గురించి అమ్మఆలోచనలు టూకీగా వివరించి, పరిష్కారం చెప్పమని అభ్యర్థించాడు.

చెప్పింది సావధానంగానే విన్నత్యాగరాజు – "మీ అమ్మమనసు అర్థం చేసుకోరా. నాకూ మండపేటవాళ్ళు తెలుసు. మంచోళ్లేలే, వెళ్ళి ఆ పిల్లను చూడు. అరమరికలు లేకుండా మాట్లాడు. అన్నివిధాలా నచ్చితేనే చేసుకో – ఇందులో 'సమస్యే' ముందిరా?

"సమస్య" లేకేం – ఉంది కదా. కానీ అమ్మకే చెప్పలేకపోయిన విషయాన్ని ఆయనకెలా చెప్పాలి? మనసులోనే తర్కించుకుంటూ మౌనంగా ఉండిపోయిన మేనల్లుడిని అనుమానంగా చూస్తూ సూటిగా సుత్తి లేకుండా అడిగేశాడు – "ఏంరోయ్! ఎవర్నైనా ప్రేమించావేంట్రోయ్!"

తప్పనిసరై 'ఔ'నన్నట్లుతలూపేడు సుధాకర్!!!

"ఓర్నీ! వేరే కులమా? అసలీ విషయం అమ్మకి చెప్పేవా? నీ 'ప్రేయసి' తాలూకు వాళ్ళు కాస్తో కూస్తో ఉన్నవాళ్ళేనా – అమ్మ "ఒప్పుకోక పోయినా సరే ఆ అమ్మాయినే చేసుకోవాలను కుంటున్నావా?" ఇంకా మరికొన్ని ప్రశ్నలు వేద్దామను కున్నాడు గాని ఎందుకో ఆగిపోయి – ఇంతకీ ఎవరో ఆ పిల్ల? అనడిగి ఊరుకున్నాడు.

తన ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తున్న మావయ్య ప్రశ్నలకి సమాధానం ఏదో క్రమంలో చెప్పటం తప్పదని నిర్ణయించుకున్న సుధాకర్, ఆయన ముఖంలోకి చూసే ధైర్యం లేక తలొంచుకునే బదులు పలికేడు, నట్టుతూ నట్టుతూ... "మరి

మరి తను... తను... సుమలత.. తల్లి శ్రమ వమ్ముకాకుండా ఫస్ట్‌క్లాస్‌లో 'బి.ఎ.' పాసయింది. ప్రస్తుతం నాలాగే ఉద్యోగ ప్రయత్నాల్లో ఉంది. మరేమో వాళ్ళమ్మ 'శకుంతల' ఏదో ప్రైవేట్ హాస్పిటల్‌లో ఆయాగా పనిచేస్తోంది. భర్తలేదు, ఆస్తిపాస్తులు లేవనుకో. వేరే కులం కాదు. కానీ, నీకు తెలియందే ముంది... 'అమ్మ, సంస్కార వంతురాలే గాని... ఎందుకో... మరి తనకి కుమారుడిని పెళ్ళిపీటల మీద మాత్రమే కాదు సిరిసంపదల సింహాసనం  మీద కూడా కూర్చోబెట్టాలన్న స్వార్థం కూడా ఉంది. కట్నం ఆశ ఉంది. అందుకే ఈ విషయం తనకింత వరకూ చెప్పలేదు. ఒప్పించగలనన్న ధైర్యం లేదు, కాని నువ్వు తల్చుకుంటే..." ఆగిపోయేడు.

'సరేలేరా' లేదా కనీసం, 'చూద్దాం లేరా' అంటాడనుకున్న మామయ్య చాలాసేపు మౌనంగా ఉండిపోవటమే గాక కాసేపైన తర్వాత విషయాన్ని పక్కదారి పట్టించే ప్రయత్నంలో భాగంగా – "ఇంకేమైనా డబ్బు కావాలా, సివిల్స్ కోసమైనా, ఇతర ఉద్యోగ ప్రయత్నాలకైనా?" అని అడిగేసరికి నిరాశా నిస్పృహలకి గురైపోయాడు. ఒళ్ళుమండింది కూడా. "ఏం వద్దులే, ఇంతకు ముందు తీసుకున్నదీ త్వరలో తీర్చేస్తాలే" – ఉక్రోషంగా అని, బయటికొచ్చేశాడు. 'ఛీ! ఈ పెద్దోళ్ళంతా ఇంతే! – 'పైసాయే పరమాత్మ' అనుకునే రకం," అని కసిగా అనుకున్నాడు.

ఆ మర్నాడే పక్కనున్న పట్నంలో ఒక విశ్రాంత ప్రభుత్వాధికారి 'సివిల్స్' ఇతర ఉద్యోగ ప్రవేశ పరీక్షల అభ్యర్థులకి పదిహేను రోజుల "ఉచిత శిక్షణా కార్యక్రమా"న్ని నిర్వహిస్తున్నాడని తెలిసి అక్కడికి వెళ్ళిపోయాడు. ఎవరో స్నేహితుడింట్లో ఉండివస్తానని మాత్రమే అమ్మకి చెప్పి వెళ్ళేడు.

చెప్పిన సమయానికే ఇంటికి ఓ ఉదయాన తిరిగి వచ్చేడు.  మనస్సు స్థిమితం లేక అక్కడున్నంత కాలం ఇక్కడెవర్నీ ఫోనులోనైనా పలకరించలేదు. తలుపు తీసిన వెంటనే, కుమారుడిని ఎంతో ఉత్సాహంగా కౌగిలించుకున్న తల్లిని నిర్వికారంగా చూస్తూ ఉండిపోయాడే గాని 'సంగతేమిట'ని అడగలేదు. లోపలికి వెళ్ళి మంచం మీద అలసటగా వాలిపోయేడు. "నేనింత ఉత్సాహంగా ఎందుకున్నానో చెప్పుకోచ్" – ఎప్పుడూ లేనంత హుషారుగా మంచం చుట్టూ చిన్నపిల్లలా గెంతులేస్తూ తిరుగుతున్న అమ్మధోరణి తప్పనిసరిగా విస్మయాన్ని కలిగించినా ఏమీ అడగలేదు! – చెదిరిన తలముడి వేసుకుంటూ సుగుణమ్మే ముడివిప్పింది

"ఓరే! మీ మామయ్య పోయిన సోమవారం ఎవరికీ చెప్పాపెట్టకుండా పెళ్ళి చేసేసుకున్నాడ్రోయ్ రిజిస్ట్రార్ ఆఫీసులోనేలే! నన్నొక్కదాన్నే పిలిచాడు. నేనే సాక్షి సంతకం చేశాన్లే... సరే, మర్నాడే, ఊళ్ళో అందరికీ పెద్ద విందు ఇచ్చాడురోయ్! ఆయాసం వచ్చి కాసేపాగింది.

"అదిరిపోయారనుకో వచ్చిన జనమంతా! అందరూ ఒకటే మాట 'జంట ఎంత చక్కగా ఉందో' అని. అసలు ఎవరు ఎంతగా చెప్పినా విననివాడు పెళ్ళి మాటే తలపెట్టని మీ మామయ్య ఇన్నాళ్ళకి పెళ్ళి చేసుకోవటమేమిటో ఆవిడకి ఇంత మంచివాడు, స్థితిమంతుడు దక్కటం ఏమిటో – అంతా భగవంతుడిలీల కాకపోతే మరేమిటి? – గుక్క తిప్పకుండా చెప్పుకుపోతున్న సుగుణమ్మ వాక్ప్రవాహానికి వంటింట్లోంచి వినవచ్చిన కుక్కర్ విజిల్ అడ్డుకట్ట వేసింది – విసుక్కుంటూనే అటువైపు పరుగెత్తింది.

అమ్మచెప్పిన 'విశేషవార్త' సుధాకర్‌కి ఆశ్చర్యాన్ని మాత్రమే కలిగించింది! ఆనందాన్ని కాదు! 'నీ చావు నువ్వే చావు' అనే విధంగా ఆయన పెళ్ళాడేసాడన్న భావం, 'ఉక్రోషం' మదిలో కలుక్కుమంది. 'ఇంతకీ ఎవరో ఆ దురదృష్టవంతురాలు పాపం! నాలుగు పదులు దాటిన "ముసలోడ్ని" కట్టుకున్న అభాగ్యురాలు – 'డబ్బున్న మొగుడు'ంటే సరిపోతుందనుకున్నదా పాపం అయినా ఇన్నాళ్ళుగా లేనిది ఈయన గారికెందుకు కలిగిందో 'ఓ ఇంటివాడి'ని కావాలన్నపేరాశ – కాదు – స్వార్థం' – అలా అనుకుంటూ మంచం మీదే ఉండిపోయిన సుధాకర్‌కి వంటింట్లోంచి అమ్మ ప్రసారం చేస్తున్న భగవంతుడిలీలలు వద్దనుకున్నా వినపడుతూనే ఉన్నాయి.

"ఏంటో భగవంతుడి లీలలు – మావాడిని చిన్నప్పుడు 'ఒరేయ్, తమ్ముడూ, నాకు కోడల్ని ఇవ్వటానికైనా నువ్వు పెళ్ళి చేసుకోవాల్రా అంటే చిన్మయానందస్వామిలా చిరునవ్వు నవ్వి ఊరుకునేవాడంతే గాని పెళ్ళి మాటే తలపెట్టలేదు. మిత్రులు 'ఏదో లోపముంది కాబోలు పెళ్ళికిష్టపడటం లేదని కొందరు గుసగుసలాడుతున్నార్రా' అని సరదాగా అంటుంటే కూడా, ఫక్కున నవ్వేవాడంతే! ఇన్నాళ్ళకి దేవుడి దయవల్ల పెళ్ళాడేశాడు. ఎవరికి ఎవరో రాసిపెట్టేసి ఉంచే దేవుడి లీలలు మనకి అర్థమవుతాయా? ఏమిటో, ఏమిటో.. "ఆపమ్మానీ గోల – అని

అరవాలనిపించినా, ఎలాగో నియంత్రించుకున్నాడు. అంతలోనే సుగుణమ్మ మళ్ళీ వచ్చింది. “ఒరేయ్! కాస్త ఓపిక చేసుకుని లేచి ఆ బరివి గడ్డం తీసేయ్ – వారం రోజుల్లో పెళ్ళికాబోయేవాడివి, ఇలా ఉంటే ఏం బాగుంటుందీ!” తలమీద గారంగా మొట్టుతూ అనేసరికి కొడుకు బద్ధకమంతా పారిపోయింది. కోపం నషాళానికంటింది. “ఏమంటున్నావ్ – నాకా – వారంలో పెళ్ళా?? ఎవర్నడిగి నిర్ణయం తీసుకున్నారు? నేను చేసుకోనంటే చేసుకోను” అంతే”. దిగ్గున లేచి గట్టిగా అరిచేశాడు.

కాస్త కంగారుపడ్డా వెంటనే తేరుకుని – “ఆహా! చేసుకోవా? మీ మామయ్య నిర్ణయాన్నే ధిక్కరిస్తున్నావా – పెళ్ళికూతురెవరనుకుంటున్నావురా నా పిచ్చికన్నా – సరే చేసుకోవద్దులే” ఇంకో సంబంధం చేసుకుందాంలే, సరేనా”.

ఈ సారి అమ్మగొంతులోని ‘చిలిపిదనం’ ముఖంలోని ఆప్యాయత కొడుకు దృష్టి దాటిపోలేదు. అయినా, ఏదీ అర్థంకాక, వెర్రిమొర్రి చూపులతో అయోమయంలోనే ఉండిపోయేడు. జుట్టు ముడివిప్పి, పొడుగాటి వెంట్రుకల్ని మళ్ళీ మెలితిప్పి మళ్ళీ ముడివేసుకుని అసలు ముడివిప్పింది. “ఒరేయ్! శుభవార్తలు ఒకటికన్న ఎక్కువున్నప్పుడు, ఎదుటివాడికేది ఎక్కువ ముఖ్యమో అదే ముందు చెప్పాలి, మనం ముఖ్యమనుకున్నది కాదు, అన్నది మర్చిపోయి మావయ్యపెళ్ళి సంగతి ముందు చెప్పాను. తప్పేలే – నేను, మామయ్య నీకు నిర్ణయించిన వధువు ఎవరో కాదు – తల్లికి మాట మాత్రంగానైనా చెప్పకుండా నువ్వు గాఢంగా ప్రేమించిన … సుమలతేరా –” మరేమో…

పేరు… ప్రేయసి పేరు… అమ్మ నోట వినపడినంతనే అంతవరకు ఉగ్గబట్టుకుని వింటున్న సుధాకర్ ఇంక ఆగలేక పోయేడు. వెంటనే లేచి అమ్మని గట్టిగా కౌగలించేసుకున్నాడు – వెంటనే భోరున ఏడ్చేశాడు, అపరాధభావం కమ్ముకొచ్చి వెంటనే భోరున ఏడ్చేశాన. అతను, తేరుకునేదాకా వీపు గోముగా నిమురుతూ మౌనంగా ఉండి పోయిన సుగుణమ్మ ‘పెద్దగా ఊరించకుండానే మిగిలిన ముళ్ళూ విప్పేసింది. అవేమిటంటే – క్లుప్తంగా చెప్పాలంటే – (1) త్యాగరాజు మావయ్య పెళ్ళి చేసుకున్నది సుమలత తల్లి శకుంతలనే! ప్రధాన కారణం చెప్పనవసరం లేదు గాని, – సుమలతను తన కూతురిగా చేసుకోవటమే. (2)

ఇంతకాలంగా పునర్వివాహం గురించి ఆలోచించని శకుంతల ఈ పెళ్ళికి ఒప్పుకోవటం కూతురి భవిష్యత్తు కోసమే. (3) సుమలత సంపూర్ణ సహకారం, అంగీకారంతోనే ఆ పెళ్ళి జరిగింది. (4) ఇప్పుడు త్యాగరాజు మావయ్య ఇల్లు పరస్పరానురాగ నూతన దంపతులతో, ప్రాజ్ఞురాలైన ఎదిగిన కుమార్తెతో కళకళలాడుతోంది. (5) ఒకగంటలో 'త్యాగరాజు' సంప్రదాయ బద్ధమైన రీతిలో మందీ మార్బలంతో సహా సుధాకర్ సుమలతల పెళ్ళి తాంబూలాలూ మార్చుకోవడానికి, ముహూర్తం నిర్ణయించడానికి రానున్నాడు, వధువు తండ్రి హోదాలో!

సుగుణమ్మ చెప్పని విషయం, నిజానికి ఆమెకు కూడా తెలియని విషయం మరోటి ఏంటంటే, అంతకు ముందురోజే త్యాగరాజు తన ఆస్తిలో సగం భాగం కుమార్తె సుమలత పేరున రిజిస్ట్రేషన్ చేసేశాడు! మనమైతే, సుధాకర్ సుమలత లిద్దరికీ త్వరలో మంచి ఉద్యోగాలు రావాలని, సుగుణమ్మ ఆరోగ్యం బాగుపడి మనవలు, మనవరాళ్ళతో హాయిగా నిండునూరేళ్ళు బతకాలని, త్యాగరాజు ఆదర్శ వివాహం కలకాలం వర్ధిల్లాలని కోరుకుందాం.

తథాస్తు!!!

రచనా కాలం - 2018.

## "గృహిణి – సేవాశిరోమణి"

ఓ ఆదివారం రాత్రి "డాక్టర్ మంజుల" ఇంట్లో రెండు జంటలు అంటే ఆమె, భర్త మున్సిపల్ ఛైర్మన్ "చిదానందం, వాళ్ళ ఏకైక కుమారుడు "సాఫ్ట్‌వేర్ ఉద్యోగి", ముకుందం, అతని ఏకైకభార్య"కోమలి" కలిసి భోజనం చేస్తున్న సమయం. మంజుల మనవడు "ప్రవీణ్" ముందే భోజనం చేసేసి లోపలి గదిలో బుద్ధిగా చదువుకుంటున్నాడు. భోజనాల మధ్యలో "డాక్టరమ్మ" ఒకసారి కోడలి ముఖంలోకి సాలోచనగా చూసి, ఏం "సిగ్నల్" అందుకుందో ఏమోగాని, గంభీరంగానే గాని, నిదానంగా పలికింది –

"ఈ మధ్యన "అమ్మాయి" (తను కోడలిని అలాగే అంటుంది.) తను ఎదుర్కొంటున్న సమస్య చెప్పుకుంది. వంటమనిషిని మాన్పించేయమని సూచించింది. ఆ పరిష్కారం నాకు నచ్చలేదు' – ఏంటో ఈవిడెప్పుడూ ఒక దానికొకటి పొంతనలేని మాటలు మాట్లాడుతుంది, అనిపించింది గాని చిదానందం భార్య పట్ల భయస్తుడు కాబట్టి నోరెత్తలేదు. కాని "సహజ వాచాలుడు "ముకుందుడు" మౌనంగా ఉండలేక పోయేడు. "హతవిధీ ఏమి ఈ వైపరీత్యము! మాతాశ్రీ "మంజులా దేవి" గారు శ్రీరామచంద్రుని పోలిన, ఏకపత్నీ వ్రతుడైన పతిదేవుని శంకించుచున్నదా? లేక, సదా సతి పాదాక్రాంతుడనైన ఈ అమాయకపు ప్రాణిని సదరు సతి అనుమానించుచున్నదా? లేనిచో వంటగత్తె ఉద్వాసన ప్రస్తావన ఏల?" అంటూ గ్రాంధికంలో నాటకీయంగా ఇంకా ఏదో అనబోతున్న ముకుందుడు, ఒక్కసారిగా, గ్రామ్యంలోకి దిగిపోయి "బాబోయ్ నా పెళ్లాం రాక్షసి, ఎంత గట్టిగా గిల్లేసిందో అమ్మోయ్!" అంటూ, ఓవరేక్షన్ చేసేసి, తల్లితండ్రులిద్దరినీ నవ్వించేశాడు. కోమలికీ నవ్వొచ్చింది. కాని దగ్గరలో నిలబడి చోద్యం చూస్తున్న వంటామె ముదుసలి, మాణిక్యమ్మ మాత్రం నవ్వలేదు. ఎందుకంటే ఆవిడికి పుట్టు చెముడు! అందుకే ఆవిడి సమక్షంలోనే ఆవిడమీద, అంత జోకుపేల్చేడు ముకుందం. కొడుకుని అంత గట్టిగా గిల్లినా, అత్తమామలిద్దరూ తననేమీ అనలేదన్న దన్నుతో, ఈ సారి కోమలి రెచ్చిపోయింది. "అదికాదత్తయ్యా చెట్టంత మొగుడితో ఏం చెప్పకుండా, మీతో నా

సమస్య చెప్పుకున్నానని ఈయన ఉక్రోషం. ఒకవేళ చెబితే, ఆరుస్తారా, తీరుస్తారా? ఆట పట్టిస్తారంతే.

ఒకసారేమైందో తెలుసా కాస్త, పన్ను కదులుతోందని చెప్తే 'వెంటనే వెళ్ళి నీ ప్రియమైన అత్తగారి జబ్బ గట్టిగా కొరికేయ్. డెంటిస్ట్ ఖర్చులేకుండా నీ పన్ను ఊడిపోతుంది. కోరలు లేని నిన్ను చూడాలన్న నా ముచ్చటా తీరుతుంది" అనేశారత్తయ్యా! ఇప్పుడే విన్నారు కదా మామయ్య గారి శీలం గురించి ఏం వాగారో? అసలీయనకి "అత్తాకోడళ్ల" మధ్యనుంటున్న "అన్యోన్యత గిట్టడం లేదంటే నమ్మండి". ఉక్రోషం నటిస్తూ అంది కొంటెగా. కోడలి మాటలకి, హాయిగా నవ్వేశారు చిదానందం దంపతులు. "అబ్జక్షన్– మిస్టర్ చైర్మన్– మీ కోడలు నిరాధారమైన ఆరోపణలు చేస్తోంది!" వ్యవహారం దారి మళ్ళుతుందని గ్రహించిన డాక్టర్ మంజుల, "ఒరేయ్ మనింటిని మున్సిపాలిటీ చేయెద్దురా – ఎవ్వరూ అల్లరి చేయకుండా వినండి – అమ్మాయ్, నువ్వు కూడా వాడిని 'గిల్లొద్దు' మధ్యలో – సరేనా – వంటామెను మాన్పించవలసిన అవసరం లేకుండా నేనొక ప్రత్యామ్నాయ పరిష్కారం ఆలోచించాను, 'అమ్మాయి సమస్యకి.

ఇంతకీ తన సమస్య సంపన్న కుటుంబాలలో చాలా మంది కోడళ్లకి ఉండేదే ! అది ఖాళీ సమయం, ఎక్కువగా ఉండి బాగా బోరుకొట్టడం! తను పెళ్ళికి ముందే "ఎమ్మే సైకాలజీ," చేసి ఉన్నా మనకి అభ్యంతరం ఉండదని చెప్పినా, ఏ ఉద్యోగం చేయటానికీ, ఒప్పుకోలేదు. "గృహిణి" గానే ఉంటానని మన: స్ఫూర్తిగా చెప్పింది. అలానే ఉంది కూడా పెళ్ళయ్యాక న్యాయశాస్త్రం ప్రైవేటుగా చదివి పట్టా తీసుకున్నా కోర్టులో ప్రాక్టీసు చేయలేదు. ఇప్పుడు ప్రవీణ్ కూడాపెద్దవాడై పోయి, ఎవరి ప్రమేయం పెద్దగా అవసరం లేకుండా బుద్ధిగా చదువుకుంటున్నాడు కదా– ఖాళీ సమయం ఎక్కువై పోయి, నిజంగానే కష్టపడుతోంది. ఇతర సంపన్న స్త్రీలల్లా క్లబ్బులకు వెళ్లలేదు. కాలక్షేపానికి "సమాజ సేవ అంటూ వీధుల కెక్కటమూ ఇష్టం ఉండదు. అందుకే ఇద్దరం చర్చించుకుని, నిర్ణయించుకున్నాం. మన ఔట్‌హౌస్‌లో కోమలి", స్త్రీ సేవా కేంద్రం ప్రారంభిస్తుంది.– ఏమంటారు?"

"ఏం చేయటానికి .. వంటలు నేర్పటానికా – కరాటే నేర్పటానికా.... టైలరింగ్ నేర్పటానికా.... ఒరేయ్ నీ ఎకసెక్కాలు మాను... అవి కూడా సాటి

స్త్రీలకు అవసరమైన సేవా కార్యక్రమాలే. చాలా మంది బాగా చేస్తున్నారు కూడా... కానీ నీ పెళ్లాం – సేవా చేయబోయేది చాలా ప్రత్యేకం! గృహిణిగా ఇంట్లో ఉంటూనే కుటుంబ బాధ్యతలన్నీ నెరవేర్చుకుంటూనే, సాటి స్త్రీల సమస్యలను ఓపిగ్గా విని తగు సలహాలు, సూచనలు ఇవ్వటం – అంటే ఒక సలహా కేంద్రంలా నిర్వహిస్తుందన్నమాట. ఎవరైనా సోమవారం నుండి శుక్రవారం వరకు ఉదయం పది పన్నెండు గంటల మధ్య ఫోనులో సంప్రదించవచ్చు – లేదా సాయంత్రం నాలుగు ఆరుగంటల మధ్య నేరుగా కార్యాలయానికి రావచ్చు. ఐతే ఉచితంగా మాత్రం కాదు. ఉచిత సలహాలంటే తీసుకునే వాళ్ళకు వాటి విలువ తెలియదు. పాటించరు కూడా. సలహా ఇచ్చే వాళ్లకీ, వళ్లుదగ్గర పెట్టుకుని ఇవ్వాలన్న జ్ఞానం, నిబద్ధతా ఉండవు, అందుకని నామ మాత్రంగా వంద రూపాయల రుసుం అదేలే ఫీజు, డాక్టర్ల భాషలో, చెల్లించాల్సి ఉంటుందన్న మాట.

"అబ్బో, వంద రూపాయల ఫీజా! నా గడుసు పెళ్లాం, ఎలానూ తన 'స్త్రీధనం' ముట్టుకోనీయటం లేదు. పైగా నా జీతమంతా నొక్కేస్తోంది. నాకు సాదరు ఖర్చులకీ, ఉండటం లేదు – ఇప్పుడిలా సంపాదించే ఫీజు నేను వాడుకోవచ్చా! పరిహాసంగా, దీనంగా, అల్లరిగా, అడిగేడు ముకుందం. "నో! ఎంత డబ్బొచ్చినా సరే నాన్న వాడుకోకూడదు – నాకిచ్చినా తీసుకోను "చారిటీ" కి ఇచ్చేద్దాం అంతే "గట్టిగా అరిచేడు. కోమలి ముకుందంల పుత్రరత్నం 'ప్రవీణ్'. లోపల్నించి ఎప్పుడొచ్చాడో, వీళ్ల సంభాషణని ఎప్పట్నుంచీ విన్నాడో తెలియదు గాని వాడి మాటలకి, ముందు విస్తు పోయినా, వెంటనే నలుగురూ గట్టిగా చప్పట్లు కొట్టేశారు. ప్రశంసా పూర్వకంగా, ఆమోద సూచకంగా – దాంతో వాడికి 'సిగ్గొచ్చేసి', లోపలికి పారి పోయేడు. తండ్రి ముకుందం గర్వంగా భుజాలెగరేశాడు. తల్లి కోమలి కళ్ళు చెమ్మగిల్లాయి ఆనందంతో –

"నిజమే – నెలకోసారి వచ్చిన మొత్తాన్ని ఏదో శరణాలయానికో, వృద్ధాశ్రమానికో, పంపేద్దాం, మన నిర్వహణా ఖర్చుల్ని కూడా మినహాయించు కోకుండా– సరే అమ్మాయి చేయబూనుకున్న "సేవా కార్యక్రమం" తేలికైందేమీ కాదు. కొన్ని చేదు అనుభవాలు ప్రతికూల స్పందనలు ఎదురు కావొచ్చు. కాని తను బెదిరిపోకూడదు. ఓపిగ్గా కొనసాగించి, ఓ సంవత్సరం గడిచాకతనే స్వయంగా

నిర్ణయించు కోవచ్చు. కొనసాగించాలో వద్దో. ఇప్పుడు గాని, అప్పుడు గాని మన కుటుంబ సభ్యులెవరూ, "చిలిపి మొగుడు" ముకుందంతో సహా, తన పనిలో వేలు పెట్టకూడదు. పరిహాసం చేయకూడదు. అమ్మ మాటలకి ఈ సారి ముకుందం నిజాయితీగా తలూపాడు. అంతేకాదు మనస్ఫూర్తిగా భార్యకి విక్టరీ సింబల్ చూపించాడు. ఇంతవరకు మౌనంగా ఉన్న చిదబరం నోరు విప్పేడు. "అయితే మంజులా, సంప్రదించే కొందరి స్త్రీల విషయంలో అంటే వైద్యపరమైన సమస్యల సందర్భాల్లో నీ సహాయ సహకారాలు అవసరం కావొచ్చు అన్నాడు. "నిజమే నేనెప్పుడూ సిద్ధమే. మంచి మాట చెప్పారండి" అంది మంజుల. ఈ మాత్రం ప్రశంసకే ముసలాయనకి సిగ్గొచ్చేసింది. దాంతో అందరికీ నవ్వొచ్చేసింది వంటామెకి తప్ప! ఈ రోజు వీళ్ళంతా పదే పదే ఎందుకు నవ్వుతూ తుళ్ళుతూ ఉన్నారో ఏమీ అర్థంకాక తల గోక్కుంటూ ఉండిపోయింది. దాంతో వాళ్ళకి మళ్ళీ నవ్వొచ్చింది. ఏదో, తన గురించే నవ్వుకుంటున్నారన్న అనుమానంతోపాటు సిగ్గు కూడా వచ్చేసి, వంటామె లోపలికి వెళ్ళి పోయింది. భోజనాలు పూర్తి చేసుకుని దంపతులు ఎవరి గదుల్లోకి వారు దూరిపోయారు. ఏదో అలిఖిత ఒప్పందం ఉన్నట్లు ఎవరూ తలబెట్టిన కార్యక్రమం గురించి ఏ మాత్రం ప్రస్తావించుకోలేదు ఒకరితో మరొకరు– అత్తగారి ప్రోత్సాహం స్ఫూర్తి ప్రధాన బలంగా, వారం రోజుల్లోపే కోమలి స్త్రీల సేవా సహకార కేంద్రం "అన్నపేరుతో, కేవలం ఒక కంప్యూటర్ నిపుణురాలిని, సహాయకురాలిగా నియమించుకుని తన కార్యాలయం ప్రారంభించింది, పెద్ద హడావిడి ప్రారంభోత్సవ కార్యక్రమం వంటిది ఏమీ లేకుండా కాదంటే, ఈ కేంద్రం ధ్యేయాల గురించి, పని వేళలు, ఇతర విషయాల గురించి చిన్న కరపత్రాలు పట్టణమంతటా పంపిణీ చేయబడ్డాయి. లోకల్ న్యూస్ పేపరు అనుబంధంలో, చిన్నప్రకటన కూడా ఇచ్చింది.

మొదటివారంలో ఎవరూ ఫోను ద్వారా గాని, నేరుగా వచ్చి గాని సంప్రదించ లేదు. రెండోవారంలో ఊహించినట్లుగానే సలహాలు ఇవ్వతలబెట్టిన తనకే ఎదురు సలహాలిచ్చే వారు తటస్థపడ్డారు. 'నీకెందుకొచ్చిన శ్రమమ్మా? నువ్వెంత? నీ వయస్సెంత? నిన్ను, నీ సలహాలనెవరు నమ్ముతారు? అని ప్రశ్నించినవారు కొందరైతే, స్త్రీల స్వయం ఉపాధి నిమిత్తం గిట్టుబాటయ్యే వడ్డీరేటు మీద అప్పులిచ్చే వ్యాపారం చేస్తే డబ్బూ పేరూ కూడా వస్తాయని కొందరు సూచించారు. అదే

వారంలో కొన్ని“ఎంక్వైరీ కాల్స్” వచ్చేయి. “బ్యూటీ టిప్స్” వంటింటి చిట్కాలు చెబుతారా, అని అడుగుతూ. వాళ్లకి గడుసుగా సమాధానం చెప్పింది. తప్పక చెబుతాను నాకు తెలిసినంతవరకు అయితే అలాంటివి మీ పక్కింటి పిన్నిగారి దగ్గరో, బామ్మగారి దగ్గరో “ఫ్రీ”గా తెలుసుకోవచ్చు కదా– కాదు మీ దగ్గరికే వస్తాను వంద రూపాయలు మాకేం ఎక్కువ కాదంటే వద్దంటానా? అని. కొన్నిఫేక్ కాల్స్ వచ్చినా, తగిన విధంగా “డీల్” చేసింది. కాని ఒక‘ఫేక్ కాల్’ విషయంలో మాత్రం సంయమనం కోల్పోయింది. ఒకరోజు ఒకకాలేజీ అబ్బాయి ఫోన్‌చేసి అమ్మాయి గొంతుకతో మాట్లాడే “ప్రయత్నం” చేస్తూ ఇలా అడిగేడు, చిలిపిగా – “అక్కయ్యా– ఈ మధ్యే పెద్ద మనిషయ్యాను నెలసరి రోజుల్లో ఒక అబ్బాయిని నేనే ముద్దెట్టుకున్నాను. నాకేమైనా అవుతుందా? పాపం ఆ అబ్బాయికి ఎయిడ్స్ ఏదో అంటారే, ఉందేమో – ఆ జబ్బు నాకువచ్చేస్తుందా? భయంగా ఉందక్కయ్యా? ఏం చెయ్యను?

“ఒరేయ్ వెధవా నూతిలో దూకి చావరా” అని అరిచేసింది. పోన్లే వదిలేద్దాం అనుకుందిగాని విషయం తెలిసిన అత్తగారు ఊరుకోలేదు. కోమలి అన్నయ్య పోలీస్ ఆఫీసర్ శ్రీధర్‌కి ఫోను చేసి చెప్పింది వాడిసంగతి చూడమని. గంటలో సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి, ఎవరి ఫోన్ నుండి కాల్ వచ్చిందో కనిపెట్టేసి, ఆ దుండగుడిని పట్టేసి చెల్లెలి ముందు పెట్టేడు. అయితే వాడిదగ్గరి నుండి క్షమాపణా పత్రం తీసుకుని వదిలేశారు అత్తా కోడళ్లు– దానికి తగిన కారణముంది. ఆ కారణమేమిటంటే అత్తా కోడళ్లిద్దరికి, అంతవరకు సూచనా మాత్రం గానే తెలిసిన ఒకవిషయం బాగా నిర్ధారణైంది. మన దేశంలో ఎంతో నాగరికత వృద్ధి చెందింది. వైద్య పరంగా ప్రజల్లో ముఖ్యంగా స్త్రీలలో కూడా ఎంతో అవగాహన పెరిగిందని మనం అనుకోవటం సరైంది కాదని.

మరి ఈ రెండు వారాల్లో కోమలికి వచ్చిన కాల్స్‌లో చాలా వరకు నెలసరి విషయంలో చాలా మంది స్త్రీలలో ఉన్న అపోహలు అవగాహనా లోపం గురించినవే ఎక్కువగా ఉన్నాయి. దీని గురించి సేవా కేంద్రం కార్యకలాపాలకి తోడుగా ఇద్దరూ కలిసి, ఏదైనా చేయాలని చర్చించు కుంటూండగానే ఈ సంఘటన జరిగింది. వాడిని మందలించి పంపించేశాక, డాక్టర్ మంజుల ఈ సారి కొడుకు, భర్తతో

కూడా లోతుగా చర్చించింది. ఏం చేస్తే బాగుంటుందో, అందరూ కలిసి తీసుకున్ననిర్ణయాలివి. ఇకముందు నెలసరి విషయంలోగాని స్త్రీలకే ప్రత్యేకమైన కొన్ని ఇతర ఆరోగ్య సమస్యల సందర్భాల్లో గాని, కోమలి తనకి తెలిసినంత వరకు సలహాల్వటానికే పరిమితం కాకుండా, అవసరమైన వారిని అత్తగారి క్లినిక్‌కి పంపిస్తుంది. వాళ్ళు నిజంగా బీదవాళ్లైతే డాక్టర్ మంజుల ఉచితంగా వైద్యం చేస్తుంది. డబ్బున్న వాళ్లదగ్గర సగం ఫీజు తీసుకుంటుంది. ఈ సౌకర్యాలను కలుగజేసినందుకు కోమలి తన మామూలు రుసుం వంద రూపాయలకి  అదనంగా ఏమీ తీసుకోదు. కొంతమంది ఈ విధానాన్ని "సద్వినియోగం" చేసుకున్నా, అంటే డైరెక్టుగా మంజుల క్లినిక్‌కి వెళ్లి వెయ్యిరూపాయలు కన్సల్టేషన్ ఫీజు చెల్లించే బదులు, సలహా కేంద్రం ద్వారా వచ్చి కొంత సొమ్ము మిగుల్చుకునే అవకాశ ముంటుంది గాని, దానికెవరూ బాధపడకూడదు. పరోక్షంగా సమాజసేవ "స్త్రీ జనోద్ధరణ" చేస్తున్నామని సంతృప్తి పడాలి. స్త్రీ వ్యాధుల నిపుణురాలుగా ఎంతో అనుభవమున్న వైద్యురాలైన డాక్టర్. మంజుల తన పరిజ్ఞానం అనుభవమంతా రంగరించి నెలసరి విషయాల్లో ఉన్న అపోహల గురించి, స్త్రీలకు మాత్రమే వచ్చే ఇతర వ్యాధుల గురించి వివరంగా ఒక పుస్తకం రాయాలి. కోమలి కూడా సమాచారం సేకరించి "శానిటరీపేడ్స్" గురించి, స్వయంగా, చౌకగా తయారు చేసుకునే విధానాల గురించి ఒకఅధ్యాయం రాయాలి. తెలుగులో రాసిన అలాంటి పుస్తకాన్ని కోమలి, సలహా కేంద్రానికి వచ్చే స్త్రీలందరికీ, ఉచితంగా కాదు నామమాత్రపు వెల, ఇరవై రూపాయలకి ఇవ్వాలి. తెలుగు రాష్ట్రాల్లోని అన్ని గ్రంథాలయాలకీ ఈ పుస్తకం ప్రతులు ఉచితంగా పంపించాలి. ఈ విధంగా కోమలి చేస్తున్నసేవా పరిధిని మరింత విస్తృత పరచాలి.

ఒక ప్రక్కన గ్రంథరచన జరుగుతూనే ఉంది. దానితో నిమిత్తం లేకుండానే, కోమలి నిర్వహిస్తున్న "స్త్రీల సేవా సలహాకేంద్రానికి వచ్చే వారి సంఖ్య దిన దినాభివృద్ధి చెందుతూనే ఉంది. మరి కొందరు సహాయకురాళ్లను నియమించు కోవాల్సొచ్చింది. ఫోనులో సంప్రందించ దలచ్చుకున్నవారు ఆధార్ కార్డు వివరాలతో సహా రిజిష్టరు చేయించుకుని ఫీజు వందరూపాయలు పే.టి.యం ద్వారా చెల్లించాలని, నేరుగా వచ్చేవాళ్లు కూడా ఇవే నిబంధనల్ని పాటించాలని నిర్దేశించటం ద్వారా ఫేక్ కాల్స్‌ని దాదాపుగా అరికట్ట గల్గింది కోమలి. కొందరు స్త్రీలు కేవలం వందరూపాయలు

ఈ సేవా కేంద్రానికి చెల్లించి, డాక్టర్ మంజుల వైద్య సేవలను, ఉచితంగానో, కొంత చౌకగానో పొందుతున్నారని, అత్తా కోడళ్ళిద్దరూ గ్రహించినా, బాధపడలేదు. స్త్రీ లకే పరిమితం గాని సమస్యలకు గాని, జబ్బులకి గాని సలహాలో సూచనలో పొందాలని వస్తే మాత్రం ఫీజు తిరిగిచ్చేసేది. పడతులకు పలు సమస్యలు, ఇక్కట్లు కదా ముఖ్యంగా మన దేశంలో – ఆకాశంలో సగం, నిజమే, ప్రతిభలో సగం కన్నఎక్కువే! నిజమే కాని మరి సమానావకాశాలున్నాయా? బాధ్యతల్లో 'సింహభాగం' మరి హక్కుల్లో హుళక్కే కదా! ఇంటి పనుల్లో సంపూర్ణం – మరి అధికారాల్లో నిండు పూర్ణం– ప్రతిభలో, శ్రమించే తత్వంలో లోటు లేకున్నా అన్ని రంగాల్లోను వివక్షే. ఒక్క మాటలో చెప్పాలంటే ఏ జీవజాతి జంతువుల్లోగాని జల చరాల్లోగాని, కీటకాది జీవాల్లోగాని లేని 'లింగ వివక్ష' మానవ జాతిలో మాత్రమే ఉంటోంది. మానవ స్త్రీలకి అసంఖ్యాకమైన సమస్యలు అన్నిటికీ కాకపోయినా, కొన్నిటికి పూర్తి పరిష్కారాలు కాకపోయినా కాస్త ఉపశమనా ప్రక్రియలుంటాయి. అందుకే క్రమేణా కోమలి సలహాకేంద్రానికి తమకున్న ఎన్నోసమస్యల గురించి, సలహా సంప్రదింపుల కోసం లేదాకాస్త ఉపశమనం కోసం వచ్చే వారి సంఖ్య పెరుగుతూనే ఉంది.

వారిని, వారి భిన్న,విభిన్న సమస్యలను విజయవంతంగా డీల్ చేయటానికి కోమలికి రెండు అంశాలు తోడ్పడ్డాయి. మొదటిది, మనస్తత్వ న్యాయ శాస్త్రాల్లో తనకున్న పరిజ్ఞానం ఇకరెండో అంశం, తన పెద్దన్నయ్య ఇదే పట్టణంలో పోలీస్ ఆఫీసరుగా, డిసిపిగా పనిచేస్తూండటం రెండో అన్నయ్య స్థానిక న్యాయాలయాల్లో లాయరుగా ప్రాక్టీస్ చేస్తూండటం. ఇద్దరి సోదరుల అండదండలు, తన కార్యకలాపాలకి సంపూర్ణసహాయ సహకారాలుండటం. అయితే, అరుదైన సందర్భాల్లో మాత్రమే వాళ్లసహాయం తీసుకుంటోంది. ఎక్కువగా తనే స్వంత శక్తి యుక్తుల్నే ఉపయోగిస్తోంది. ఇటీవలి కాలంలో క్రమేణా అదనపు వరకట్న బాధిత మహిళలు కోమలి దగ్గరికి రావటం ఎక్కువైంది. తనకున్న వాగ్ధాటితో మనస్తత్వ న్యాయశాస్త్రాల్లోఉన్న పరిజ్ఞానంతో బాధిత మహిళల, భర్తలు, బంధువులు, ఇతర వ్యక్తులతో తగు విధంగా మాట్లాడి నచ్చచెప్పటమో, 497(ఎ) వంటి నేర చట్టాలలోని నిబంధనల్ని వివరించి అవసరమైతే బెదిరించి, వాళ్ళని దార్లోకి తేవటం చేయగల్గుతోంది. తప్పని సరి సందర్భాల్లోమాత్రం అన్నయ్య శ్రీధర్ ఇతర పోలీస్

అధికారుల సహకారం తీసుకుంటోంది. బాధిత మహిళలను తమ సమస్యల నుండి కొంత వరకైనా విముక్తుల్ని చేయటమే ప్రధాన ధ్యేయంగా పనిచేస్తోంది. గృహహింస భాధిత మహిళలకు కొంత పరిధి దాటి కూడా న్యాయం చేసేది. కాలేజీ టీనేజీ అమ్మాయిల్లో కూడా కోమలి పేరు కొద్ది రోజుల్లోనే మారు మోగిపోయింది. వాళ్ళని ఏ రూపంలోన్కైనా సరదాకోసమో ప్రేమ పేరుతోనో, ఎవరైనా వేధిస్తూ ఉంటే, అలాంటి జులాయిగాళ్లఆగడాలని ఎలా ఎదుర్కోవాలో, ఎలా బుద్ధి చెప్పాలో ఆదివారాల్లో ప్రత్యేక ఉచిత శిక్షణా తరగతుల్ని నిర్వహించి నేర్పించింది. సెల్‌ఫోనుల్లో ఆకతాయిల మాటల్ని చేతల్ని ఎలా చిత్రీకరించాలో, రికార్డు చేయాలో నేర్పించింది. కరాటే వంటి స్వీయ రక్షణా పద్ధతుల్ని నేర్చుకోమని ఉద్బోధించింది. ప్రేమలో మోసపోయిన అమ్మాయిల తరపున అవసరమైన మేరకు పోలీస్ డిపార్ట్‌మెంట్ సహాయం తీసుకుని వాళ్ల వివాహాలు కోరుకున్న వాళ్ళతో జరిగేందుకు తోడ్పడేది.

ఇలా తన స్త్రీ జనసేవా పరిధిని, విస్తృతం చేసుకుందని చెప్పటానికి ఒక ఉదాహరణ చెప్పాలి. ఒక అత్యాచారం కేసు కూడా చేపట్టింది. మేనమామ చేత అత్యాచారానికి గురైన ఒక పద్నాలుగేళ్ల బాలిక తనని నేరుగా వచ్చి సంప్రదించి వివరాలు చెప్పిన మీదట, ఆ పిల్లతల్లి తన స్వంత సోదరుడిపై కేసుపెట్టడానికి ఇచ్ఛగించక పోయినా, తను వెనుదీయకుండా అన్నయ్య పోలీస్ ఆఫీసర్ శ్రీధర్‌కి, ఆ బాలిక చేత రాత పూర్వకంగా ఫిర్యాదు ఇప్పించి స్వయంగా చొరవ తీసుకుని తగు సాక్ష్యాధారాలు సేకరించి, “ఫాక్సో” చట్టం కిందకేసు ప్రత్యేక కోర్టులో కేసు వేయించింది. నిందితుడిప్పుడు జైలులో మగ్గుతున్నాడు. కేసు నడుస్తోంది. రేపో మాపో శిక్ష ఖరారు కావొచ్చు.

అయితే కోమలి తన దగ్గరికి విడాకులిప్పించమని వచ్చే వాళ్ళని పొమ్మని చెప్పేది కాదు గాని, అడ్డదిడ్డంగా ప్రోత్సహించేది కూడాకాదనే చెప్పాలి. సాధ్యమైనంత వరకు దంపతులు కలిసే ఉండేలా కౌన్సిలింగ్ చేసేది. ఐతే విడాకులకు అనివార్యమైన న్యాయమైన కారణాలున్నాయని నిర్ధారించుకున్న కేసులు మాత్రం తన మరో అన్నయ్య లాయర్ సుందర్ దగ్గరికి పంపేది. ఆ పాపమో పుణ్యమో నువ్వే కట్టుకోరా', అని చమత్కరించేది. పుట్టింటి వారి పరం గానో, మెట్టినింటి వారి మూలానో ఆస్తి సంబంధిత లేదా మరే ఇతర సమస్యల గురించి వచ్చే స్త్రీల సంఖ్య కూడా క్రమంగా

పెరుగుతూనే ఉంది. "గృహ హింసకు గురవుతున్న వాళ్ళూ వస్తూనే ఉన్నారు. అటువంటి వారికి సంబంధిత చట్టాల్లోని సానుకూల ప్రతికూల అంశాలన్నీ ఓపిగ్గా వివరించేది. చిన్న వివాదాల విషయాల్లో కోర్టులకు వెళ్ళకుండా ఏం చేయాలో ఓపిగ్గా వివరించేది. ఆస్తుల విషయంలో కోర్టులకు వెళ్ళకుండా ఎలా పరిష్కరించుకోవచ్చో సూచించేది. కోర్టుల కెక్కితే గాని పరిష్కారం కావనుకున్న సందర్భాలలో ఏవిధంగా ముందుకు సాగాలో ఎలాంటి కేసులు వెయ్యాలో ప్రాధమికావగాహన కల్పించి, మీ ఇష్టం వచ్చిన లాయరు దగ్గరికి వెళ్ళమని చెప్పేది. గృహహింస కేసుల్లో స్వయంగా పట్టుదలగా పనిచేసి అవసరమైన సందర్భాలలో పోలీస్ స్టేషన్‌లో కేసులు నమోదు చేయించి బాధితులకు సంపూర్ణ ఉపశమనం కలిగే వరకు నిద్రపోయేది కాదు. ఒకవృద్ధ మహిళ వచ్చి తన పేరు మీదున్న ఆస్తిని తమకు రాయించేసుకున్న తర్వాత, ఇద్దరు కొడుకులు బయటికి గెంటేసి, తిండికే లోటయ్యే దుస్థితికి తెచ్చారని వాపోతే ఆవిడను కొన్నాళ్ళు తన ఇంట్లోనే ఉంచుకుని కోర్టులో కేసు వేయించి, కొడుకుల పేర్న ఇంతకుముందు చేయబడ్డ గిఫ్ట్ డీడ్‌లను చట్ట బద్ధంగా రద్దు చేయించింది. కోమలి కేవలం స్త్రీ పక్షపాతి గానే వ్యవహరించేది కాదని తెలిపే ఒకఉదంతం గురించి చెప్పాలి. ఒకమ్మాయి వచ్చి తన సహ విద్యార్థి తనను ప్రేమించి గర్భవతిని చేసి గర్భస్రావం కూడా చేయించి ఇప్పుడు మరో అమ్మాయిని చేసుకోబోతున్నాడని వాడిని అరెస్ట్ చేయించాలి, తనతో పెళ్లి చేయించాలి లేదా భారీగా నగదు పరిహారం ఇప్పించాలని అలా చేస్తే ఇరవై శాతం కమీషన్ ఇస్తానని కూడా చెప్పింది. కోమలి నవ్వేసి రేపు రమ్మని చెప్పింది. అనుమానించి నట్లుగానే ఆమె శీలం మంచిది కాదని ఎందరితోనో తిరిగిందని, కేవలం డబ్బులాగడానికే సహ విద్యార్థిపై ఫిర్యాదు చేస్తోందని నిర్ధారణ చేసుకుని, ఆ పిల్లనే అరెస్ట్ చేయించింది. ఇలా తను స్థాపించిన స్త్రీ సేవా కేంద్రం ద్వారా ఎన్నో విధాలుగా తన సేవా కార్యకలాపాల్ని విస్తరించుకు పోతూ స్త్రీ జన సేవకురాలిగా ప్రఖ్యాతి గాంచింది. కొన్నినెలల సమయంలోనే అత్తా మామలకి భర్తకి కూడా గర్వకారణమైంది.

ఇంతలా నిస్వార్థంగా, ఎంతో నిబద్ధతతో సమాజ సేవ చేసేవాళ్ళకి గుర్తింపు రాకుండా ఉంటుందా? వచ్చింది. ఎంత వరకు వచ్చిందంటే పోలీస్ అధికారుల

సంఘం, ఆమెకు టౌన్‌హాల్ లో సన్మాన సభ ఏర్పాటు చేసి "మహిళా సేవా శిరోమణి" అన్న బిరుదు ప్రదానం చేయాలని నిర్ణయించుకునేంత వరకు! ఇందుకు ఒక "ఉదంతం"లో ఆమె ఎంతో సాహసోపేతంగా నిర్వహించిన పాత్ర దోహదం చేసింది. కోమలికి రాష్ట్ర వ్యాప్తంగా ఖ్యాతి తెచ్చిన, తెగువ తెలివి గల సమాజ సేవకురాలిగా వార్తా పత్రికల టీవీ ఛానళ్ల ద్వారా, గుర్తింపు తెచ్చిన ఆ మాటకొస్తే, పోలీస్ అధికారుల సంఘం పలు ఇతర రాష్ట్రస్థాయి మహిళా సంఘాల స్వచ్ఛంద సంస్థల సంయుక్త ఆధ్వర్యంలో ఈ సన్మాన బిరుదు ప్రధాన సభ ఏర్పాటు కావడానికి ప్రధాన కారణమైన ఆ ఉదంతం గురించి చెప్పుకుందాం మరి.

ఒకరోజు ఉదయం ఒక చిన్నపిల్ల గొంతును బట్టి, అయిదారేళ్లకంటె ఎక్కువ ఉండదనిపించింది సెల్‌ఫోన్ ఎవరిది, ఎలా, సంపాదించిందో ఏమో, తన గురించి, నెంబరు ఎలా తెలిసిందో ఏమోగాని, వెక్కి వెక్కి ఏడుస్తూ, నత్తి నత్తిగా చెప్పింది. తాత.... ఎదవ.....గత్తిగా గిల్లేడు..... అక్కడ గుచ్చేడు..... రగతం వచ్చేత్తోంది.... బయమేత్తోంది..... సచ్చి పోతానా..... అమ్మో..... అంతే ఫోన్ కట్ అయిపోయింది. కోమలికి సిక్స్‌త్ సెన్స్ చెప్పింది ఇదేదో "అత్యాచారం" కేస్ కావొచ్చునని. వెంటనే అన్నయ్య శ్రీధర్ దగ్గరికి స్వయంగా వెళ్ళింది.

అతని పోలీస్ బుర్రకి ఇది కచ్చితంగా ఎవరో వృద్ధుడిపరంగా, ఓ పసిపిల్ల అత్యాచారానికి గురైన వ్యవహారమేనని విశ్లేషించి ఎక్కించింది. అతను కూడా నిర్లక్ష్యం చేయకుండా, సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి చెల్లెలి ఫోన్‌కి ఎక్కడి నుండి కాల్ వచ్చిందో ఏ టవర్ లొకేషన్‌కు సంబంధించిందో ఒక అరగంటలోకనుగొన్నాడు. ఏ నెంబరు నుండి వచ్చిందో చూస్తే అహ్మదాబాద్‌లో సిమ్ జారీకాబడ్డ దానిగా తేలింది. ఎవరో ఫారిన్ టూరిస్ట్‌కి తాత్కాలిక ప్రాతిపదికన ఇవ్వబడినదిగా ఉంది. అహ్మదాబాద్‌కి ఒకటీమ్‌ని పంపుతానని అన్నాడు డి.సి.పి. అన్నయ్య. "అది తర్వాత చేద్దువుగాని ముందు సెల్ ఫోన్‌టవర్ ఈ ఊళ్ళోనిదే అని తేలింది కదా కాల్ ఈ ఊళ్ళోంచే వచ్చింది. అత్యాచారం ఇక్కడే జరిగింది. ఆ సెల్ ఫోన్ టవర్ దగ్గరికి వెళ్దాం పద" అంది.

చెల్లెలి తెలివి తేటలకి అబ్బుర పడుతూనే, ఆ ప్రాంతానికి వెళ్లినా, ఏ ఇంట్లోంచి, అన్నది ఎలా తేల్చుకోగలం, అన్న నిరాశ తోనే తన జీప్‌లో తీసుకుని

వెళ్లేడు. అది అన్నిరకాల దుకాణాలు ఇళ్లు, కార్యాలయాలు ఉన్న ఒక కాలనీ, అక్కడికి వెళ్లాక కోమలికి జ్ఞాపక మొచ్చింది. ఇదే కాలనీలో తన కుమారుడి పుట్టిన రోజు సందర్భంగా చాక్లెట్లు దుప్పట్లు పంచటానికి ఒక అనాధాశ్రమానికి రెండేళ్ళ క్రితం వచ్చిన సంగతి. అంతే, 'ఎక్కడికి సోదాకి వెళ్లాలా', అని టోపీ తీసేసి బుర్ర గోక్కు ఉంటున్న అన్నయ్యను నేరుగా అక్కడికి తీసుకుని వెళ్లింది. తీరా వెళ్లిచూస్తే ఆ బాలికల ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నది పట్టణంలోని ఒక ప్రముఖ సమాజ సేవకురాలు ఆశాదేవి అని తెలిసింది. ఆవిడ అనుమతి లేకుండా ఎవరూ లోపలికి రావడానికి వీలులేదని ఆశ్రమం మేనేజర్ సుమలత దబాయించినా వీళ్ళు లెక్క చేయలేదు. లోపలి గదిలో దాచిన ఒక ఏడేళ్ల బాలిక కనపడింది. తీవ్రమైన జ్వరం వళ్ళు నొప్పులతో గజ గజ వణికి పోతూ – ఆ పిల్లకి ఎక్కడ రక్త స్రావం అవుతుందో కోమలి గమనించింది. ఏమైందని అడిగితే సుమలత, తడబడుతూ మామూలు జ్వరమేనని బుకాయించింది. ఇంకా గుచ్చి గుచ్చి రక్తస్రావం గురించి అడిగితే పొద్దున్నే పెద్ద మనిషైంది పాపకి పదకొండేళ్ళే కదా– ఇది ఏంటో అర్థం కాక భయపడిపోయి జ్వరం తెచ్చుకుంది. అని బుకాయించింది. ఆ పిల్ల వయసు గురించి రక్తస్రావం కారణం గురించి అబద్ధాలు చెబుతొందని కోమలితో పాటు శ్రీధర్కి కూడా అర్థమైంది. ఆశ్రమం మేనేజర్ని అరెస్ట్ చేసి పోలీస్ స్టేషన్కి తరలించాడు. కోమలి అత్యాచారం జరిగిందన్న సాక్ష్యాధారాల కోసం ఆ పిల్లని గవర్నమెంట్ ఆసుపత్రికి తీసుకుని వెళ్లింది.

తీగ లాగితే, ఒకటి కాదు చాలా డొంకలు కదిలాయి. ఆ ఏడేళ్ల అనాధ పిల్లపై అత్యాచారం చేసింది ప్రముఖ సమాజ సేవకురాలు, పది పన్నెండు అనాధ బాలికల ఆశ్రమాలు, స్త్రీల శరణాలయాలు నిర్వహిస్తున్న ఆశాదేవి, భర్త, ప్రముఖ ఆధ్యాత్మిక ప్రవచనకర్త డబ్బై ఏళ్ల శేషాచార్యుల వారని తేలింది. సదరు అయ్యవారికి బాలికలను బలవంతంగా అనుభవించే సరదా చాలా కాలం నుండి ఉందని, భార్య సహకారంతో ఇప్పటికి ఇరవై ముప్పై అనాధ బాలికలతో సదరు సరదా తీర్చుకున్నాడని నిరూపణ అయింది. అంతేకాదు ఆశాదేవికి గల్ఫ్దేశాలలో కొందరు మహిళా వనరుల వ్యాపారులతో సత్సంబంధాలు న్నాయని, ఆమె నిర్వహిస్తున్న అనాధ స్త్రీ శరణాలయాల స్త్రీలు కొందరిని దొంగతనాలు చేసి కేసులకు భయపడి

పారిపోయారని లేదా మిస్సింగ్ కేసులుగా పలు పోలీస్ స్టేషన్లలో నమోదైన వాళ్లని కాని ప్రస్తుతం నిజానికి అరబ్బు షేక్‌ల ఇళ్లల్లో చాకిరీ చేస్తూ, అత్యాచారాలకు గురవుతున్నారన్న కోణంలో ఇప్పుడు పరిశోధనలు సాగుతున్నాయి. శేషాచార్యులు ఆశాదేవి దంపతులు చేసిన ఎన్నో నేరాలు ఇంకా ఎన్నో వెలుగులోకి వస్తున్నాయి. వాళ్లిద్దరు జైలులో మగ్గుతున్నారు. ఇవన్నీ బయటపడటానికి ప్రధాన కారకురాలైన కోమలి గురించి ఆమె నిర్వహిస్తున్న సేవా కేంద్రం గురించి వార్తా పత్రికల్లో టీవీ ఛానల్లలో పలు కథనాలు ఇంకా వస్తూనే ఉన్నాయి. డాక్టర్ మంజుల కోమలితో కలిసి రాసిన పుస్తకం తెలుగు ఆంగ్లభాషలలో ప్రచురణకు సిద్ధమైంది. కోమలి సన్మాన సభ నిర్వహించ తలబెట్టిన వాళ్ళు ఆమె అత్తగారిని కూడా సన్మానిస్తామని తలబెట్టారు గాని డాక్టరమ్మ ఒప్పుకోలేదు. వేదిక మీదకు నేను రాను గాని అదే సభలో ఆ పుస్తక ఆవిష్కరణ చేయించమని కోరింది. కోమలి సన్మాన సభ విజయవంతంగా జరిగింది. తనకు జరిగిన సన్మానానికి తను తగనని వినయంగా చెబుతూనే తన పాక్షిక విజయానికి అత్తగారు డాక్టర్ మంజులా దేవి ప్రధాన కారకురాలని పొగిడింది. ఆమె రాసిన పుస్తకం ప్రతులు ఉచితంగా మహిళా మండళ్లకు, గ్రంధాలయాలకు పంపిస్తామని ప్రకటించింది. మరో ముఖ్యమైన ప్రకటన చేసింది. ఇక ముందు కూడా జీవితాంతం తన స్త్రీ సేవా కేంద్రాన్ని కొనసాగిస్తానని, అయితే తన కుటుంబం స్త్రీలకు మాత్రమే కాదు అనాధ బాలురకు వృద్ధులైన పురుషులకు కూడా కొన్ని రకాల సేవలు అవసరమని గ్రహించినందున రాజకీయాల నుంచి విరమించదలచుకున్న మామగారు చిదానందం గారి ఆధ్వర్యంలో మరో సేవా కేంద్రాన్ని ప్రారంభించ దల్చుకున్నామని అదే సభలో హర్షాతిరేకాల మధ్య ప్రకటించింది. ఇదీ, సమాజసేవలో స్త్రీలు కూడా గణనీయమైన పాత్ర పోషించగలరని నిరూపించిన కోమలి, డాక్టర్ మంజులా దేవిగార్లకథ.

రచన కాలం – 2017

# "విశారద"

"విశారద", తనూ అలానే అనుకుంటుంది, తెలిసిన వాళ్ళంతా కూడా, అదే అంటారు, – "చాలా అదృష్టవంతురాలు", భారతదేశంలో "సంపూర్ణస్త్రీ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్న అరుదైనన "గృహిణు"ల్లో ఒకతె అని. నిజమే! ఓ మంచి కుటుంబంలో అందమైన పిల్లగా పుట్టి, అల్లారు ముద్దుగా పెరిగి, విద్యావంతురాలైంది. విద్యార్థి దశలోనే, "స్త్రీవాద రచయిత్రి"గా ప్రముఖురాలైంది. స్థానిక కళాశాలలో లెక్చరర్ ఉద్యోగం సంపాదించి, అక్కడే పనిచేస్తున్న ఒక అందగాడు, సంపన్నుడు, గుణవంతుడైన "శేఖర్"ని తన "షరతుల"కన్నిటికీ, ఒప్పించి, పెళ్ళాడి, హాయిగా కాపురం, సమర్థవంతంగా ఉద్యోగం, ప్రభావశీలంగా "మహిళాహక్కుల ఉద్యమం" కొనసాగించుకుంటోంది. పెళ్ళికి ముందే, అత్తామామలు పోయినందున, "ఉత్తమ కోడలు"గా పేరు తెచ్చుకోవటం కష్టం కాలేదు, ఆడబడుచు కూడా లేదుగదా మరి! "యు.జి.సి. స్కేల్" రావాలంటే, "పి.హెచ్.డి." చేయాలన్న నిబంధన వచ్చింది కాబట్టి, తన అభిరుచి కనుగుణంగా "స్త్రీల ప్రధాన సమస్యలు–పరిష్కారాలు" అన్న సబ్జెక్టు నెంచుకుని, "సిద్ధాంత వ్యాసం" తయారు చేసే పనిలో నిమగ్నమై ఉంది ప్రస్తుతం!

ఆ ప్రయత్నాల్లో భాగంగా, వివిధ వర్గాల స్త్రీలను "ఇంటర్వ్యూలు" చేసి సమాచారం సేకరిస్తోంది. "స్త్రీ స్వాతంత్ర్యం" పేరుతో, విశృంఖలత్వానికి, వింత పోకడలకు పోతున్న ఆధునిక మహిళామణులను, అసలు ఆ పదానికే అర్థం తెలియని, పూర్తిగా మొగుడో, కొడుకో అదుపాజ్ఞలలో ఉంటున్న పాతకాలపు వాళ్ళనీ కలిసింది. ఇక ఒక సంధి కాలపు స్త్రీని, అంటే బాగా విద్యావంతురాలే గాని, స్వచ్ఛందంగా పరిమిత స్వేచ్ఛ సరిపోతుందని తృప్తిపడే ప్రౌఢ స్త్రీని కూడా కలుసుకుంటే బాగుంటుంది, అనిపించగానే, అందుకు తన స్వంత పిన్ని "స్వర్ణలత"యే తగినదని నిర్ణయించు కుంది. కాని మొదట్లో కొంచెం సంకోచం కలిగింది – దానికి కారణం, 'మరీ దగ్గరి వాళ్ళను నిర్మొహమాటంగా అన్నీ అడగగలనా, సమాచారం సేకరించగలనా' అన్న అనుమానం – ఇంకో కారణం, అందరి వద్దా కాకపోవచ్చేమో గాని, తన లాంటి చిన్నవాళ్ళు ఎంతో సీరియస్‌గా

అడిగిన ప్రశ్నలకు పిన్నికి చాలా తేలిగ్గా తీసుకుని చిలిపి సమాధానాలు చెప్పే అలవాటు, సరదా ఉండటం – అలాంటి గత ఉదంతాలు కొన్ని విశారద మనసులో ఉండి పోయాయి. ఉదాహరణకి, ఒకసారి (చిన్నతనంలో) తనే పిన్నిని, "నీకూ అమ్మకి మెళ్ళో ఉండే మంగళసూత్రాల వల్ల ఏంటి ఉపయోగం?" అనడిగితే ఠక్కున డబ్బాల మూతలు బిగుసుకు పోతే వీటిని ఉపయోగిస్తాం కదా' అని, డిమాన్‌స్ట్రేషన్ చేసి చెప్పి నవ్వించింది. ఇంకోసారి బాబాయికి 'జంధ్యం వల్ల ఏంటి ప్రయోజనం?' అని అడిగితే, "వీపుమీద దురదొస్తే నన్ను 'డిస్టర్బ్' చేయకుండా దాంతో తీట తీర్చుకోవచ్చు గదా' అంది – సరేలే ఏదైతే అదవుతుంది ముందు ఏదో 'సరదా సమాధానం' చెప్పినా, కాస్త బతిమాలితే, తన అనుభవమంతా రంగరించి, మంచి సమాచారం ఇవ్వకపోతుందా అనుకుంది విశారద.

ఇంక ఆలస్యం చేయకుండా, 'విశారద' పిన్ని ఊరుకి, ఇంటికి రైలెక్కి ఓ ఆదివారం ఉదయాని కొచ్చేసింది – బాబాయి ఊళ్ళో లేడని తెలుసుకుని, "హమ్మయ్య" – అనుకుంది – ఆయనుంటే, స్త్రీ హక్కుల ఉద్యమాల గురించి చులకనగా కాదుగాని కొంత సరదాగా మాట్లాడుతాడు – 'నీకన్న నీ భర్తే అందగాడు – పొడుగు కూడా – నువ్వెంతగా హైహీల్స్ వాడినా, సమానమై పోతావా?' ఇలా ఉడికిస్తాడు – పిన్ని విశారదను బాగా ఆదరించింది. షడ్రసోపేతంగా భోజనం పెట్టి పక్కన సోఫాలో కూర్చోపెట్టుకుని గారంగా బుగ్గలు పుణుకుతూ అడిగేసింది, "ఏంటే, ఇంకా ఏమీ "విశేషం", లేదా, పెళ్లై ఆరేళ్ళైంది కదే" – అని. సమాధానానికి తడబడుతుంటే, "ఏంటే, మాట్లాడవు కొంప తీసి, "అతగాడికేమన్నా లోపమా?" అని మరీ పచ్చిగా అనేసింది, కవ్వించడానికి మాత్రమే! ఎక్కడలేని రోషం రాదా మరి విశారదకు? వచ్చేసింది. "ఛీ! ఏంటా, పిచ్చి వాగుడు – ఇన్నాళ్ళూ నా మాట కాదనలేక పోయారంతే' సరేలే – ఇంకా అమ్మకీ చెప్పలేదు – ఇంకా... ఈ నెల... కాలేదు. ముప్ఫైరోజులు ఆలస్యమైంది – "బుగ్గల్లో సిగ్గులు పూసి పెదాల్లోకి పాకిపోయి మాటలాగిపోయాయి.

"ఓర్నీ– దాన్నే "నెలతప్పటం" అంటారు – అమ్మకింకా చెప్పకపోవటం ఏంటే నీ మొహంమండా! ఇప్పుడే ఫోనుచేసి చెప్తాను, పాపం పిచ్చిదానికి" అంటూ దిగ్గునలేచి వెళ్ళిపోయింది స్వర్ణలత పిన్నిలోపలికి .

"మైగాడ్! ఆ "పిచ్చిది" ఈ "తెలివైంది" ఊసుల్లోపడితే, ఓ గంటకి గాని తెమలదు" అని నిరుత్సాహంగా అనుకుంది – కాని మూడున్నర నిముషాల్లో తిరిగొచ్చి "మీ అమ్మెక్కడికో పెత్తనాలకి వెళ్ళిందంట – నీ మొగుడే ఎత్తాడు ఫోను నిజంగా నువ్వు అదృష్టవంతురాలివే, మీ నాన్న పోయాక"అతగాడు" "అత్తగారిని" తీసుకొచ్చి ఇంట్లోపెట్టుకుని ఎంత బాగా చూసుకుంటున్నాడో"

"ఆ! ఎందుకు చూసుకోరు, అమ్మపేరున బోల్డు ఆస్తి లేదా"? అని ఉక్రోషంగా అనబోయి ఆగిపోయింది. ఇంతలో పిన్నే మళ్ళీ అంది – "చాలా మంచివాడే "పిచ్చి సన్నాసి" "విశేషం" విని, ఎంత సిగ్గుపడిపోయాడో – ఎంతగా మెలికలు తిరిగిపోయాడో" – ఏదో వీడియోకాల్‌లో చూసినట్లుగా చెబుతుంటే విశారదకి నవ్వొచ్చేసింది – వచ్చిన పని గుర్తుకొచ్చి తమాయించుకుని, మెల్లగా తడబడుతూ అడిగింది..."పిన్నీ...మరి...మరి నీ అభిప్రాయంలో "భారతస్త్రీ" ని సతమతం చేస్తున్న "గడ్డుసమస్యేంటి?" మొత్తానికి అడిగిందే గాని, పిన్ని ఏదో సిల్లీ "సమాధానమే" చెబుతుందిలే – అదేమై ఉంటుందో" అన్న ఆలోచనలో పడిపోయింది. పిన్ని కూడా చాలామంది భారతీయ గృహిణుల మాదిరే, కొంతకాలం అత్తగారి ఆరళ్ళు పడింది – అదృష్టం బాగుండి ఆవిడ త్వరలోనే పోయింది గాని అన్నమాట చిన్నప్పుడు విన్నది కాబట్టి, మనోళ్ళకున్న గడ్డు సమస్య అత్తగారి ఆరళ్ళు గాక ఇంకేముంది, అని చెబుతుందేమో అనుకుంది.

కాని విశారద అంచనా తప్పింది. చాలాసేపు దీర్ఘంగా ఆలోచించిన పిదప, పిన్ని సీరియస్‌గా అన్నది – "భారతీయ స్త్రీలే అన్నమాటేమిటి? ఈ భూగోళం మీద అమెరికాలోనైనా, ఆఫ్రికా అడవులలోనైనా, అమలాపురం శివారుల్లోనైనా, ఎక్కడున్న స్త్రీ కైనా కామన్‌గా ఒక గడ్డు సమస్య ఉంది – భరించటమే పరిష్కారం – సృష్టికర్త భగవంతుడు కూడా మనకు "పగోడే", "మగోడే" అనుకోవడానికి నిదర్శనమిది! లేకపోతే, పురుషులను వదిలేసి స్త్రీలకే ఎందుకు పెట్టాడీ ఇబ్బంది. ఇంతకీ ఈ కామన్"ఇక్కట్టు"' ఏంటో నీ కర్థమైందా? ఇంకా కొన్నిక్లూలు ఇవ్వమంటావా..." "సరేలే, ఇంకా అయోమయంగా చూస్తున్నావు ఈ "కష్టం", "నష్టం" సుమారుగా పన్నెండేళ్ళు – యాభై ఐదేళ్ళ మధ్యనున్న ఆడోళ్ళకి మాత్రమే వచ్చే "ఇబ్బంది" – వచ్చిన ప్రతిసారీ కాకపోయినా ఎప్పుడో ఒకసారి, ఏదో

కార్యకలాపానికో అడ్డువచ్చిందనో, ఇంకేదైనా కారణం చేతనో, "ఛీ! వెధవసంత" అని చికాకు లేదా అసౌకర్యం కల్పించేది – బ్రిటన్‌రాణినైనా, పోలీస్ అధికారిణినైనా, కూలీ నాలీ చేసుకునే వనితనైనా, ఒక వయసు వచ్చేవరకు, "ఎంతో కొంత ఇబ్బంది పెట్టేది – అంటే, శాశ్వతంగా, ఒక వయసొచ్చాక తొలగిపోయి, "అమ్మయ్య అనిపించేది – ఓర్నీపిచ్చి మొహమా ప్రస్తుతం నీకు విరామం' వచ్చిందే తాత్కాలికంగా – అదన్నమాట – "నెలసరి" అంటారే అది. ఇంత వివరంగా చెప్పాక అర్థం కాలేదా?– అయింది – చిరుకోపం కూడా వచ్చింది – "ఛీ! ఏంటి పిన్నీ– నా పి.హెచ్.డి. కోసం ఎంతో ఆశతో నీ దగ్గర కొస్తే ఏంటేంటో సిల్లీగా మాట్లాడుతున్నావేంటి?" కాస్త బుంగమూతి పెట్టి అడిగింది విశారద.

"అలా రావే దారికి! నువ్వెందు కొచ్చావో నాకుముందే తెలుసు! మీ అమ్మే మొన్నోరోజు ఫోనులో చెప్పిందిలే – చిన్నచిన్న లేదా తాత్కాలిక లేదా సహజ ఇబ్బందుల్ని భూతద్దంలో చూసే ఆధునిక స్త్రీవాదుల పోకడల గురించి నీకర్థం కావాలనే ఇలా సరదాగా మాట్లాడేను. నిజానికి ఒకోసారి "ఛీ వెధవసంత" అనుకునేలా చేసినా, "నెలసరి" అనేది, భగవంతుడు స్త్రీకిచ్చిన వరం, "మాతృత్వానికి" ప్రాతిపదిక– నువ్వు అలాంటి "విపరీతవాది"వి కావని తెలుసుగాని, కొందరు "స్త్రీవాదులు" అసలు సమస్యలను వదిలేసి, పిచ్చిపిచ్చి పరిష్కారాలు, నినాదాలు చేస్తున్నారు కదా, "బ్రాలు" తగలబెట్టుకోండి" అందాల్ని దాచరాదు, బహిరంగంగా ప్రదర్శించండి, పెళ్ళిళ్ళు మానేయండి, అంతగా చేసుకోవాలనుకుంటే, సాటి స్త్రీలనే చేసుకోండి, "పురుషుల్ని పురుగుల్లా దూరం పెట్టండి... ఇలా... ఇలా... అందుకే "నెలసరి"యే స్త్రీల ప్రధాన సమస్యని సరదాగా అన్నాను. నిజానికి, సరైన అవగాహన లేక, పరిస్థితులు అనుకూలించక లేదా, పలు అపోహల మూలంగా అభివృద్ధి చెందుతున్న దేశాల్లో స్త్రీలకు అది ఒక "గడ్డుసమస్య" కాదనటానికి వీలు లేదనుకుంటున్నాను

"విద్య, విజ్ఞానం రీత్యా, పుట్టింట్లో, మెట్టినింట్లో ఈ విషయంలో మూఢాచారాలు, అపోహలు లేనందున, ఆ అసౌకర్యాన్ని ఆరోగ్యకరమైన విధానాల్లో అధిగమించే ఆర్థిక స్థోమతు నీకున్నది. ఐనా అదో అనివార్యమైన సౌకర్యమన్న విషయాన్ని ఒప్పుకుంటావు కదా! నువ్వు ఒక"మహిళా హక్కుల ఉద్యమకారిణి"గా

కొన్ని అవగాహనా సదస్సులు ఏర్పాటు చేసి బాలికలకు, "బేడ్‌టచ్"ల వంటి విషయాలు, సోదరులతో సమానత్వం పొందడానికి పోరాడాలని, వాళ్ళ తల్లులే చిన్నప్పట్నుంచీ అవగాహన పెంచాలని ఉద్బోధిస్తున్నావని, ఆఫీసుల్లో పనిచేస్తున్న మహిళలు, తగిన 'మూత్రశాలలు' లేకపోతే, వాటి కోసం సిగ్గుపడకుండా పోరాడాలని చెబుతున్నావని విన్నాను. వాటితోబాటు "నెలసరి" గురించి కూడా తమ కూతుళ్ళకు అవగాహన కల్పించాలని చెప్పటం అవసరం – అదేవిధంగా "శానిటరీపాడ్స్" గురించి కూడా వాళ్ళకి ఆ "అవస్థ" రావడానికి కొన్ని సంవత్సరాల ముందే తెలియాలి – ఆ మాటకొస్తే రేషన్‌షాపుల ద్వారా "శానిటరీపాడ్స్" వీలైతే ఉచితంగా, "విధి"గా సరఫరా చేయాలి. ఈ అంశం కూడా మహిళాహక్కుల ఉద్యమకారిణులు పరిగణన లోకి తీసుకోవాలని నీ దృష్టికి తేవటం కోసమే "నెలసరి" గురించి ఇంత ఎక్కువగా మాట్లాడాను – ఏం అనుకోవద్దే" – సరే అసలు సంగతి కొద్దాంలే – అడుక్కో – ఇంటర్వ్యూచేస్కో....."

"లేదులే, పిన్నీ – నిన్ను ఇంటర్వ్యూ చేయటం కన్నా నీ ద్వారా నేర్చుకోవటమే మంచిదనిపిస్తోంది – నువ్వే ప్రశ్నలు వేయ్ నువ్వే అన్నీచెప్పు. "ఓ! ఇదేదో బాగున్నట్లుందే సరే ఫస్ట్ క్వశ్చన్– కాచుకోమరి – "స్త్రీల ప్రధాన సమస్య– సమానత్వ లేమికదా– సమానత్వం సాధించడానికి ఏకైక సాధనం ఏదన్నా ఉందా? ఆలోచించి చెప్పు?" "ఓ! ఉంది పిన్నీ– మన పూర్వీకులు ఆడవాళ్ళని విద్యకి దూరం చేసి తమ చెప్పుచేతల్లో ఉండేలా చేసుకున్నారు" హుషారుగా చెప్పింది. "కాదనలేను గాని – ఆ పూర్వీకులకు ఇంకా పూర్వీకులు అంటే ఎవరికీ, మగోళ్ళకి కూడా విద్యలేని రోజుల్లో లేదా"దుస్థితి" అంతేగా – మానవులు గుహల్లో ఉన్నకాలంలో కూడా పురుషులదే అధిపత్యం కాదా! ఒక్క ఆడది విద్యావంతురాలైతే, ఆ కుటుంబమంతా, విద్యావంతులైనట్లే. ఆ గృహమే విద్యాలయం అయిపోతుంది. సంతానం అందరూ సంస్కారవంతులౌతారు ఖచ్చితంగా – స్త్రీ విద్యావంతురాలైతే సమస్య అర్థమవుతుందేమో గాని తొలగిపోదు! నీకు తెలిసిన ఉదాహరణే చెప్పుకుందాం. నీ మేనత్త కూతురు మీనాక్షి ఎమ్మే పాసైంది. ఉద్యోగం వదిలేసింది కదా పెళ్ళయ్యాక, అత్తామామలకి మొగుడికి ఇష్టం లేదని. ఇప్పుడింట్లో బండచాకిరీ చేయలేకచస్తోంది. మొగుడు తాగొచ్చి రోజూ బాదుతుంటే నోర్మూసుకుని ఉంటోంది, మరిప్పటికే

రెండుజతల కవలల్నికన్నది కదా ఆరోగ్యం బాగా చెడి, చచ్చిన పీనుగులా ఏదో అలా బతికేస్తోంది పాపం – కాబట్టి నీ సమాధానం తప్పు – విద్య కొంత దోహదం చేస్తుంది, ధైర్యం కల్పిస్తుంది, సమానత్వం సాధించడానికి. అంతేకాని అది ఏకైకసాధనం కాదు – ఇంకా ఏదో కావాలి ఏంటది?...

"నువ్వు చెప్పదల్చుకున్నది అర్థమవుతోంది పిన్నీ– విద్యతోబాటు ఆర్థిక స్వాతంత్ర్యం కూడా ఉండాలి" – కొంచెం సంకోచిస్తూనే చెప్పింది. "మరి, నీ ఇంకో మేనత్త కూతురు "వనజ" నీ వయసుదే, దానికీనీలా విద్య ప్లస్ ఉద్యోగం ఉంది. పైగా మేజిస్ట్రేట్ ఉద్యోగం. జీతం బాగా వస్తుంది. కానీ మొత్తం అంతా అత్తగారి చేతికే పోతుంది. ఇకపోతే దాని మొగుడు మరీ అప్రాచ్యుడు. కోర్టు దగ్గరే ఒక అనధికార కార్యాలయం, దుకాణం తెరిచి, కక్షిదారుల దగ్గర కావాల్సిన విధంగా న్యాయం చేయిస్తాను, తీర్పు లిప్పిస్తానని, వసూళ్ళు, ఎడాపెడా చేస్తున్నాడు. "త్వరలోనే జైలు పాలవుతానేమో అత్తయ్యా" అని ఫోనులో ఏడ్చింది మొన్న. – దానికి తెలియదా, విడాకులొక్కటే తగిన పరిష్కారమని. కాని ఐదుగురు పిల్లలున్నారు కదా అన్న సంకోచం – మొగుణ్ణి వదిలేసిన ఆడదాన్ని సమాజం ఎలా చూస్తుందోనన్న భయం – పైగా విడాకుల చట్టంలో ఎన్నోలొసుగులు – వెంటనే విడాకులు దొరుకుతాయా"

"ఔను పిన్నీ అన్ని చట్టాల్లోనూ లొసుగులున్నాయి. విడాకుల కేసులేకాదు, అన్నిఆధారాలూ ఉన్న అత్యాచారకేసులు కూడా ఏళ్ళ తరబడి కోర్టుల్లో సాగుతున్నాయి. అందుకే నేను అన్నిసభలలో బల్లగుద్ది చెబుతూ ఉంటాను. స్త్రీలు "రాజ్యాధికారం" కూడా సాధించాలి. ఇప్పుడున్న చట్టసభలలో పురుషులెక్కువ గాబట్టి పురుష పక్షపాత చట్టాలు వస్తున్నాయి. మనం ఆకాశంలో సగం – చట్ట సభలలో కూడా సగం ఉండాలని, 50 శాతం రిజర్వేషన్ కావాలని పోరాడాలి – సో, విద్య+ఆర్థిక స్వాతంత్ర్యం+రాజ్యాధికారం సాధిస్తే పురుషులతో సమానత్వం దానికదే వస్తుందని, నువ్వు చెప్పదల్చుకున్నావని నాకర్థమైంది – కరెక్టేనా–"

"పూర్తిగా కరెక్ట్ కాదే – ఇంకో ఉదంతం వింటే తెలుస్తుంది నీకే – మీ పిన్నత్తగారు, విద్యాధికురాలు, "స్త్రీ ధనం" చాలా ఉంది. ఆర్థికస్వాతంత్ర్యం ఉంది. వాళ్ళ ఊరికి ఈ మధ్యనే సర్పంచ్ అయ్యింది. ఇదీ నీకుతెలుసు. ఐతే, నీకు తెలుసో

తెలియదో నాకు తెలియదు. ఆవిడఘోషా పాటించదు గాని, పంచాయతీ కార్యాలయానికి వెళ్ళదు. ఆ సీట్లో వాళ్ళాయనే కూర్చుని అన్నీతనే చక్కబెడుతూ ఉంటాడు. ఈవిడ సంతకాలు మాత్రం తీసుకుంటారు గాని నిర్ణయాలన్నీ అతగాడివే! తాసిల్దార్లు, ఇతర అధికారులు అందరూ అతనితోనే మాట్లాడుకుంటారు. దాదాపు దేశమంతటా, శాసనసభలలో, పార్లమెంటులో లేని 50 శాతం రిజర్వేషన్, మహిళలకు అన్ని“లోకల్ బాడీస్”లో పంచాయతీల్లో ఉన్నాయి. అంటే జనరల్ స్థానాల్లో ఎన్నికయ్యే ఆడవాళ్ళని కూడా కలుపుకుంటే యాభైశాతం కన్నా ఎక్కువే పదవుల్లో మహిళామణులున్నారు. నిజంగా “రాజ్యాధికారం” చలాయిస్తున్న వాళ్ళ శాతం మాత్రం చాలా తక్కువ – కాబట్టి విద్య+ ఉద్యోగం లేదా ఆర్థిక స్వాతంత్ర్యం + రాజ్యాధికారం కూడా సంపూర్ణ ఫార్ములా కాదు. ఇంకా ఏదో చెప్పమని నీకుమరో అవకాశమిస్తే శారీరక బలం అని చెబుతావేమో! అందుకే ఇంకో ఉదంతం చెబుతా విను – మా పక్కవీధిలో ఒకావిడకు మెలి తిరిగిన మీసాలు లేవుగాని, కండలు తిరిగిన శారీరక దృఢత్వం మెండుగా ఉంది. దాని మొగుడేమో “ఉఫ్ అంటే ఎగిరిపోయే అర్భకుడు. కాని రోజూ తాగకుండానే వచ్చి ధైర్యంగా చితకబాదుతాడు పెళ్ళాన్ని. దానికి చిటికెన వేలుతో వాడికి బుద్ధి చెప్పేంత బలం ఉన్నా “కాళ్ళా వేళ్ళాపడి బతిమాలుతుంది, మరీ అంత గట్టిగా కొట్టొద్దని” – ఏమంటావ్!

ఇంకేమీ అనను. నీ తెలివితేటలు, అనుభవం ముందు నేనెంత పిస్నీ! చేతులు జోడిరచి వేడుకుంటున్నా మహిళల సమస్యలేంటో వాటికి పరిష్కారాలేంటో నువ్వే చెప్పు ప్లీజ్ – నాకేం తెలియదని ఒప్పుకుంటున్నా”.

“నువ్వు చెప్పినవన్నీసరైనవే – కాదంటే ఫార్ములా సంపూర్ణంగా లేదన్నా నంతే. విద్య, ఆర్థిక స్వాతంత్ర్యం, రాజ్యాధికారం అవసరమే సమానత్వం సాధించడానికి. వాటితోబాటుగా ‘‘సమానత్వ పిపాస’’ ‘‘అర్హురాలినేనన్న మానసికబలం కూడా ఉండి తీరాలి. ఇవి లోపిస్తే, అవన్నీ వృధా అవుతాయని చెప్పటానికే చర్చను ఇంతగా సాగదీశాను. మూలాల్లోకి వెళ్లి ఆలోచిస్తే నీకే అర్థ మవుతుంది. గుహల్లో కాపురాల రోజుల్లో మగాడు, ఆడదాని పై ఆధిపత్యం ఎలా సాధించాడు? వేట కష్టమంతా నేనే పడతాను, నువ్వు అందాన్ని కాపాడుకోవటం కోసం, ‘సుకుమారిగా’ లోపలే ఉండిపో’ అంటే, ఆ ప్రేమకు కరిగిపోయింది ఆడది!

ఆధిపత్యాన్ని చేతులారా ఇచ్చేసింది. ఆ క్రమంలో బానిసత్వం, మగాడికన్న అల్పురాలినన్న న్యూనతాభావం పెరిగిపోయాయి. ఆధునిక యువతుల్లోనైనా, ఈ భావాలు పోనంతవరకు, సమానత్వం సిద్ధించదు. ఇంకో విషయం "సహనం, క్షమాగుణం, సర్దుకుపోయే తత్త్వం" స్త్రీలలో ఉండాల్సిన మంచిలక్షణాలే గాని, మోతాదు మించి ఉంటున్న సందర్భాల్లో సమానత్వానికి దూరమవుతున్నాం అని గ్రహించి వాటిని అవసరమైన మేరకు, అవసరమైన సందర్భాల్లోకొంత కట్టడిచేసుకోవాలి. తప్పుచేసినవాడు నా మొగుడే కదా, 'నా కొడుకే కదా, లేదా నాకు కావాల్సిన వాడేకదా' అన్న మీమాంసకు లోనైనా సమస్యను చేతులారా జటిలం చేసుకున్నట్లే! ఆఖర్లో ఒక్క విషయం – సమానత్వం అంటే సమానావకాశం మాత్రమే కోరుకోవాలి. ప్రత్యేక హక్కులు కాదు, సమానహక్కులు అడగాలి. కేవలం స్త్రీతత్వానికి లేదా "సహజలాలిత్యాని"కి సంబంధించి వాటిని మినహాయిస్తే అన్నిటా పురుషులతో పోటీపడగలం, ఎందులోనూ తీసిపోం అన్న "మానసికస్థైర్యం" – ఎలాంటి అవాంతరాలైనా ఎదుర్కోగలనన్న ధైర్యం కూడా మనలో ఉండాలి – అప్పుడే సమానత్వం సాధ్యం – ఏమంటావ్" అంటూ ముగించింది స్వర్ణలత పిన్ని.

విశారద ఏమంటుంది? – కృతజ్ఞతా పూర్వకంగా చెప్పినదానికి అంగీకార యోగ్యంగా తలవంచి చేతులు జోడించింది.

రచన కాలం – 2018.

# కలికాలం అత్తమామలు

శ్రీమతి చేతి కాఫీ కోసం ఎదురు చూస్తూ హాల్లోకూర్చున్న నేను, "టీవీ" పెట్టేను. అందులో, వంటిమీద విభూతి దట్టంగా పూసుకుని, మెడనిండా బంగారు తొడుగులతో ఉన్న రుద్రాక్ష మాలలు ధరించిన ఒకాయన ప్రవచనం వస్తోంది. "ఈ కలికాలంలో అంతా తారుమారై పోతుంది. గురువులను, గౌరవించాల్సిన విద్యార్థులు వాళ్లని ఒక ఆటాడిస్తున్నారు. దేవాలయాల ఆస్తుల్ని సంరక్షించాల్సిన "ధర్మకర్తలు" దేముని సొమ్ముని యదేచ్ఛగా బొక్కేస్తున్నారు. ఆస్తుల్ని లాగేసుకుని కన్నతల్లిదండ్రుల్ని వృద్ధాశ్రమాలకి పంపేస్తున్న పిల్లల్నెందర్నో చూస్తున్నాం. ఇంకో ఇంటికి కోడలైన కూతురికి తమకున్నంతలో పెట్టు పోతలు..... కరెంటు పోవటంతో, ప్రవచనం అర్థాంతరంగా ఆగిపోయింది. టీవీ మూగబోయింది. నా అత్తా మామల వంటి వారి గురించి ప్రవచనకర్త ఉదహరించ బోయాడని నాకర్థమైంది. ఏడ్వలేక నవ్వుకున్నాను,

కాసేపటికి సతీమణి, రమణి, ఏదో అస్పష్టంగా గొణుక్కుంటూ, తిట్టుకుంటూ, (నన్నే అయ్యుండాలి) విస విసా వచ్చి, కాఫీ కప్పు చేతికందివ్వ కుండా, విసురుగా, కొంచెం వలికిపోయేలా, స్టూల్ మీదపడేసి, కాళ్లు టపటపలాడించు కుంటూ, లోపలికి వెళ్తూ, మధ్యలో ఆగి, గుక్క తిప్పుకోకుండా కక్కేసింది తన ఉక్రోషాన్నంతా. "హు! ఈ ఇంట్లో, బండ చాకిరీ చేస్తున్నా, ఉద్యోగమూ చేస్తూన్నా ఖర్మ! ఖర్మ! కన్నతల్లిదండ్రులకు ఏదో 'చిన్నకానుక" ఇచ్చే ఇది లేదు! ఎందుకీపాడు బతుకు, ఖర్మ ఛీ....

తన మాటలు అంత వరకే వినపడ్డాయి. ఇంకా ఏదో అంటూనే ఉంది గాని తూటాలు పేలుస్తూనే ఉంది కానీ, అవన్నీ, వంటగదిలో పాత్రల మీద చూపుతున్న నిరసన ప్రతాపం శబ్దాల్లో కలిసి పోయాయి. తన కోపం, ఉక్రోషం తగ్గుముఖం పట్టే, అవకాశం లేదనీ, తేట తెల్లమైంది.

అయితే, అసలు విషయం మీ కర్థం కావాలంటే, నా పట్ల దురభిప్రాయం కలగకుండా ఉండాలంటే, "తను" తల్లి తండ్రులకి నా కలికాలం అత్తమామలకి ఇవ్వాలనుకున్న "చిన్న కానుక" ఏమిటో తెలియాలి. నానేపథ్యం, సమస్య

పూర్వాపరాలు మూలాలు కూడా తెలియాలి. నా "కలికాలం అత్తామామల" లీలలూ, వివరించాలి. నా "కలికాలం అత్తామామలు" వారంరోజుల్లో రాబోయే తమ ముప్పైరెండో (25వదో, యాభయ్యోదో కాదు) వివాహ వార్షికోత్సవ సందర్భంగా, తమకి చెరో "డైమండ్‌రింగ్", స్మార్ట్ ఫోను, అల్లుడు సమర్పించి ఆశీర్వాదాలు తీసుకోవాలని కూతురి ద్వారా నాకందజేసిన ఆదేశం. విన్నవెంటనే "కుదరదు" అని నేను మొదటిసారి ధైర్యంగా చెప్పటమే శ్రీమతి కోపానికి ఉక్రోషానికి ఏకైక కారణం! ఒక్కసారిగా నాకంత ధైర్యం కలగడానికి కారణం కూడా చెప్పాలి కదా మరి గత చరిత్రతో సహా !

నా చిన్నప్పుడే తల్లీ తండ్రీ పోయిన నన్ను కొన్ని కారణాల మూలంగా, వాళ్ళ జీవితకాలంలోనే రెండెకరాలకి తగ్గిపోయిన నా వారసత్వపు ఆస్తితో సహా తమ సంరక్షణలోకి తీసుకున్నారు నా స్వంత చిన్నాన్న చిన్నమ్మలు. వాళ్ల స్వంత సంతానం, అంటే నాకు వరుసకు ఒకఅక్క, ఇద్దరు తమ్ముళ్లతో సమాన ప్రేమాదరాలతో పెంచి పెద్ద చేశారు. 'అక్క'కి పెళ్లిచేసినప్పుడు, వాళ్ళ స్వంత ఆస్తి పదెకరాల నుండి ఆరెకరాలకు తరిగి పోయింది గాని, నా వారసత్వపు ఆస్తి రెండెకరాల నుండి గణనీయంగా పెరిగింది అంటే, నా వారసత్వపు ఆస్తికి మరో నాలుగెకరాలు తోడయ్యాయి. నాచదువు సంధ్యలకు కొంత ఖర్చైనా కూడా! ఇంతకన్న వేరే రుజువేం కావాలి వాళ్ల నిస్వార్థవైనాన్ని చాటి చెప్పడానికి? నేను 'గ్రాడ్యుయేట్' అయిన వెంటనే మా ఊరుకి దగ్గర్లో ఉన్న ఒక పట్టణ సహకార బ్యాంకులో అసిస్టెంట్ మేనేజరుగా ఉద్యోగం వచ్చినప్పుడు ఎంతో సంతోషించారు నా చిన్నాన్న, చిన్నమ్మలు. తమ స్వంత కొడుకు లిద్దరికి చదువు పెద్దగా అబ్బలేదని ఎక్కువ బాధపడకుండా తమ్ముళ్ళిద్దరినీ వ్యవసాయంలోకి దించేశాడు మా చిన్నాన్న- నేను వాళ్ళతోపాటే ఊర్లోనే వారి ఇంట్లోనే ఉంటూ, రోజూ ఉద్యోగానికి వెళ్లివస్తూ ఉండేవాణ్ని. ఎవరో చెప్పిన సంబంధం," ఐదెకరాల భూమి ఇస్తాం కొంత బంగారం పెడ్తాం - పెళ్లి ఘనంగా చేస్తాం- క్యాష్ మాత్రం ఇవ్వలేం" - అని వాళ్లంటే పిల్ల నాకు బాగా నచ్చిందని నిర్ధారణ చేసుకున్న తర్వాతనే సంబంధానికి పచ్చజెండా ఊపేడు చిన్నాన్న.

"ఘనంగా చేస్తామన్నవాళ్లు ఇంత సామాన్యంగా చేశారేంటి ఈ పెళ్ళి. పైగా వాళ్లే మగపెళ్ళి వాళ్లలా అహంకారంగా ప్రవర్తించారు" అని మా వాళ్ళు కొంతమంది

సణుక్కున్నా" మా చిన్నాన్న చిన్నమ్మలు ఏమీ పట్టించుకోలేదు. కాపురానికి వచ్చిన కోడలినీ ఆప్యాయంగా చూసుకున్నారు. మాకు వేరే గది కేటాయించారు ఇంట్లో–కొత్త కోడలిని పెద్దగా ఏ పనీ చేయనీయలేదు.

మొగుడితో అరమరికలు లేకుండా అన్నీ చెప్పుకోవాలన్న అమాయకత్వం ఉన్న తొలి రోజుల్లో, మా ఆవిడ అప్పుడప్పుడు చెప్పిన కొన్ని ముచ్చట్ల సారాంశం ఏమిటంటే, తన తల్లితండ్రులకు, వాడెంత పనికి మాలినవాడైనా, కొడుకు అంటేనే, తన ఏకైక సోదరుడైన ఆకార్ (ఈవిడ వికార్ అంటుందిలెండి) అంటేనే తగని ప్రేమ, వాడు ఆకారంలో మాత్రమే కాదు ప్రవర్తనలో కూడాఎంతో వికారంగా ఉన్నా, చదువబ్బని మొద్దులా ఉన్నా తండ్రికి అంతకన్న ఎక్కువగా తల్లికి ఎంతో ఇష్టం గారాబం – అన్నిట్లోనూ వీళ్ళిద్దరి మధ్య వాళ్లు చూపుతున్న"వివక్ష"ల మధ్యనే తను పెరిగింది. తను ఇంటర్ మంచి మార్కులతో పాసయినప్పుడు, మెడిసిన్ చదివే ప్రతిభాపాటవాలు మీ అమ్మాయికున్నాయని ఎందరో చెప్పినా, చదువు మాన్పించేసి ఇంటికి, ఇంటి పనులకు పరిమితం చేసినప్పుడు చాలా బాధకలిగింది. మాటి మాటికి ఆ వికార్ గాడు అక్కని ఏదో అంటున్నా ఏ మాత్రం మందలించక పోవటం మరింత బాదని కలిగించేది.

ఇలాంటి 'పుట్టింటి గుట్లు' విన్నమొగుడు నేను, గాక మరెవడో అయితే ఏం చెప్పేవాడో నాకుతెలియదు గాని, నేను కొంత విభిన్నంగా స్పందించాను. "ఛీ అలా అనుకోవద్దు–ఎక్కడ్కెనా తల్లితండ్రులకి కూతురి పట్లనే ఎక్కువ ప్రేమాభిమానాలుంటాయి. దాంతో బాటు ఎక్కువ "చనువూ" ఉంటుంది. నిన్ను ఉన్నత విద్యకి పంపించక పోవడానికి వేరే కారణాలుండవచ్చు. నిన్ను వదిలి ఉండలేక పోవటమూ కావొచ్చు. ఎప్పటికైనా ఇంకో ఇంటికి పంపించాల్సిందే కదా అనుకున్నారేమో, కొంత ఎక్కువ క్రమశిక్షణతో పెంచారేమో. భావి జీవితంలో బాధ్యతలు ఇప్పట్నుంచీ అలవాటు పడాలన్న సదుద్దేశంతో పనీ పాటలు చేయించడాన్ని తప్పు పట్టకూడదు. అందరిలానే మీ వాళ్లకి కూడా కూతురంటేనే ఎక్కువ ఇష్టం. నువ్వే అనవసరంగా అపార్థం చేసుకుంటున్నావు.

ఇప్పుడు చూడు నిన్నువిడిచి ఉండలేకే కదా, మీ అమ్మానాన్నలు వారానికోసారైనా మనింటికి రాకుండా ఉండలేక పోతున్నారు" అన్నాను. తను

ఏమీ మాట్లాడలేదు. అమాయకుడు అనుకుందేమో!

నేనన్నదాంట్లో ఒక నిజముంది. అదేమిటంటే, మా అత్తామామలు కనీసం వారానికోసారైనా మా ఇంటికి వస్తున్నారు. కూతురితో ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతున్నారు. కాని మా అందరి ఎదురుగా కాదు. కాసేపు దొడ్లోకి దూరంగా తీసుకుని వెళ్ళి గంటల తరబడి క్రమంగా మా ఆవిడలో మార్పు వచ్చింది. ప్రతీ వారం వాళ్ల రాకకోసం ఎదురు చూస్తోంది. నాకెందుకో బెదురు మొదలైంది..

అత్తామామలు మా ఇంటికి తరుచుగా వస్తూ, అడిగి మరీ, అన్ని అతిధి మార్యాదలు పొందటం తాము వట్టి చేతుల్తోనే వచ్చి వెళ్లేటప్పుడు మాత్రం మా చిన్నాన్న చిన్నమ్మ అడక్కుండానే ఇచ్చినవి, అడిగి తీసుకున్న వాటితో కలిపి 'కష్టపడి మోసుకెళ్లటం', నాకు కొంత వినోదం కలిగించినా, పైకేమీ అనే సాహసం ఎప్పుడూ చేయలేదు, కొన్ని విషయాల్లో "ఇంటి ఇంతి"తో పరాచికాలాడరాదన్న ఇంగితం ఉంది కాబట్టి! అంతే కాదు, గతంలో తల్లిదండ్రుల ప్రేమానురాగాలు తనకు తగినంతగా లేవని బాధపడిన నా శ్రీమతి ఇప్పుడు వాళ్లకి తనంటే అపారమైన ప్రేమ ఉందని మనస్ఫూర్తిగా కలిగిన విశ్వాసం మూలంగా ఎంతో హుషారుగా, ఆనందంగా ఉండటం – అది మా దాంపత్యంలో కూడా ప్రతిఫలించడం, మా అత్తా మామల ప్రవర్తనని 'పోన్లే' అనుకునేలా చేసింది. ఆదిలోనే తుంచలేని అశక్తుణ్ణి చేసింది.

ఒకరోజు సాయంత్రం "చిన్నాన్న" నా భుజం మీద ఆప్యాయం గా చెయ్యివేసి "నువ్వు ఊళ్లోనే ఉండిరోజూ పదిమైళ్ల దూరం వెళ్లిఉద్యోగం చేసి రావటం, చూస్తున్న మాకే కష్టంగా ఉంది. మీ ఇద్దరూ పట్నంలోనే ఉండటానికి  ఒక ఇల్లు అద్దెకి చూశాం. గృహ ప్రవేశానికి వచ్చే ఆదివారమే ముహుర్తం. ఏం పర్వాలేదు, మధ్యలో పదిమైళ్లే కదా దూరం. మధ్య మధ్యలో మీరూ వస్తారు. మేమూ వస్తూంటాం అనేసి నేను మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా పొలానికి వెళ్లిపోయేడు !! 'ఏదో తేడా, "వచ్చిందనిపించింది గాని అదేంటో నాకర్థం కాలేదు.

పట్నంలో గృహప్రవేశం రోజున, మా దంపతులిద్దరికీ పట్టుబట్టలు పెట్టి, ఆశీర్వదించి, సాదర వీడ్కోలు పలికేరు మా చిన్నాన్న చిన్నమ్మలు. వాళ్ల కన్నీళ్ళు

చూసిన నాకూ మా ఆవిడకు కూడాకళ్లు చెమర్చాయి. వాళ్ళు మాతో రాలేదు గాని, తమ్ముళ్లిద్దరినీ, వేరే లారీలో నాకు సంబంధించిన ఫర్నీచర్ ఇంకా "పది బుట్టల సారెతో" పంపారు. "తమ్ముళ్ళు కూడా" ఎంతోబాధ్యతగా మాతో వచ్చి కొత్త ఇంట్లోఅన్నీ చక్కగా సర్దేసి బస్సులో ఊరికి తిరిగి వెళ్ళి పోయేరు. 'సాయంత్రానికల్లా అత్తామామలు యథాప్రకారం వట్టి చేతులతో విచ్చేశారు. బావమరిది "ఆకార్" కూడా వచ్చేడు. "నాకు"గృహప్రవేశం గిఫ్ట్" ఇచ్చాకనే ఏదైనా తింటానక్కా" అన్నాడో లేదో ఈవిడ వెంటనే లోపలికి వెళ్ళి ఉదయం మా బ్యాంకు ఛైర్మన్‌పూజ సమయానికి వచ్చి ఇచ్చిన ఒకఖరీదైన వాచీని, స్టాఫ్ అంతా కలిసి ఇచ్చిన బంగారు ఉంగరాన్ని తెచ్చి వాడికలంకరించింది. వాడి ముఖంలో పెద్దగా తృప్తి కనిపించలేదు. అయినా తిండి మీద ఆత్రంతో వంటింట్లోకి దూరిపోయేడు. 'మాకు వచ్చిన ఇతర గిఫ్టులు ఈవిడ చూపించకాపోదు. వాడు వాటిలో మరి కొన్ని తనకోసం సెలెక్ట్ చేసుకోకపోడు' అనుకొని నిట్టూర్చటం నావంతైంది.

కొత్త ప్రదేశంలో ఎవరితోనూ పరిచయాలు లేని ఈ పట్నంలో ఈ పది బుట్టల సారె ఇన్ని స్వీట్లు పళ్లు ఎవరికి ఎలా పంచాలన్న సమస్య మా ఆవిడకి వచ్చిందో లేదో తెలియదు గాని, ఎవరూ లేవనెత్తని ఆ సమస్యని తనే లేవనెత్తి పరిష్కారం కూడా చెప్పేసింది మా అత్తగారు, అదే వాళ్ళమ్మ –

రేపు మేమే ఏదోలా శ్రమపడి వీటిని మోసుకుపోయి మన ఊళ్లో అదేలే, నువ్వు పుట్టినూర్లో (నిజానికీవిడ వేరే ఊళ్లో పుట్టింది) మన బంధుమిత్రులందరికీ "పంచేస్తాం" – ముక్కూ మొఖం తెలియని ఈ ముదనష్టపుపట్నంలో పంచితే ఏమొస్తుందే? సొంతూళ్లో అందరికీ ఇస్తే మాక్కాదు గాని నీకే ఎంతో గొప్పగా ఉంటుందో అంది వాళ్లమ్మమాటలకి అంగీకారసూచకంగా తను తలూపేసరికి మా బ్యాంకు స్టాఫ్ కుటుంబాలకి పంపిణీ చేద్దామనుకున్న నా ఆలోచనను విరమించు కోవటం తప్పనిసరైంది. అయినా మా బామ్మర్ది రేపటిలోగా ఎన్ని ఆరగిస్తాడో ఎన్నిమిగులుస్తాడో ఎవరికెరుక!

ఒకనెల గడిచిందో లేదో మా ఆవిడ"నాకు ఉద్యోగం వచ్చిందండీ పక్క వీధిలో ఉన్న స్కూల్లో టీచర్‌గా" అని చెప్పినప్పుడు "సరే" అని అడగని అనుమతిచ్చేశాను. ఎంతైనా ఇల్లాలు ఉద్యోగం చేస్తూంటే ఇంటి పనిలో కొంతైనా

పంచుకోవాలన్న ఇంగితం నాకుంది. అందుకే ఈ విషయంలో అత్తగారి ఉపదేశం వినాల్సిన అగత్యం తెచ్చుకోరాదనుకున్నాను. అంతేకాదు, తనకు వచ్చే జీతం, పెద్ద మొత్తం కాదనీ తెలుసు కాబట్టి, దానికి లెక్కలు అడిగే సంకుచితత్వమూ చూపించలేదు ఎప్పుడూ. అయినా, నాకు తెలియకపోతే కదా, ఇరవైఏళ్ళ తమ్ముడికిస్తోన్న పాకెట్ మనీకీ, అది సరిపోవటం లేదని. ఏ మాటకి ఆ మాట చెప్పుకోవాలి. మా బామ్మర్దికి కొంచెం "గోరోజనం" లేదా పౌరుషం ఉంది. నన్నెప్పుడూ డైరెక్టుగా ఏమీ అడగడు. కాని అలాంటి గోరోజనం వాడి అమ్మా నాన్నలకు ఏ కోశానా లేకపోవటం నా దురదృష్టం కాక మరేమిటి?

నా ''కలికాలం అత్తామామలు'' ఆర్థికంగా నన్ను ఎంతగా పీల్చి పిప్పిచేస్తున్నారో, చెప్పడానికి ఎన్నెన్నో ఉదాహరణలున్నాయి. తరచుగా జరిగేదేమిటంటే వాళ్లకి నెలకి కావాల్సిన సరుకులన్నీ మా ఊళ్ళో నాణ్యంగా ఉండవు బాబూ అని వాపోయి, ఇక్కడిసూపర్ బజార్‌లో కొనిపించేసి, ఆ కార్డేదో నువ్వే గీకేయ్ అని ఆదేశించి, నానెత్తిమీద చెయ్యిపెట్టడం, ప్రతీ పండగకి, ఉభయులతో పాటు కుమార రత్నానికి బహుమతులు అడిగి మరీ తీసుకోవటం మాత్రమే కాదు, అంతకు ముందులేని, ఆధ్యాత్మికత, ఒక్కసారిగా పెరిగిపోయి తీర్థయాత్రలకి కుమార రత్నంతో సహా తరచుగా వెళ్లాలనిపించటం "ఆ తతంగమంతా మాకేం ఎరుక, నువ్వే నొక్కేయ్", అని నాతోనే ఆన్‌లైన్‌లో టిక్కెట్లు బుక్ చేయించటం, ఇవన్నీ నాకు తలకు మించిన భారమైపోతోంది.

ఇవన్నీ పూర్తిగా కాకపోయినా, కొంత వరకైనా భార్యతో చెప్పుకుని కొంత ఉపశమనం పొందుదామనుకున్నా, తను ఏ మాత్రం అవకాశం ఇవ్వటంలేదు. తనే ముందు వాళ్ళ ప్రస్తావన తెస్తుంది. మా పెళ్ళికి ముందు కొంచెం వివక్ష చూపించేమన్న అపరాధభావంతో తననిప్పుడు అమ్మా, నాన్న ఎంతో బాగా చూసుకుంటున్నారని, తన బాగోగులకోసం అనుక్షణం "తపన" పడుతున్నారని, వాళ్ళిద్దరి ఆప్యాయతతో తను తడిసి ముద్దయి పోతున్నానని, ఇందుకోసం ఎంత మూల్యానైనా చెల్లించడం తప్పుకాదని, నా భార్యామణి రమణి ఎంతో ఉద్వేగంగా చెబుతూ ఉంటే, వాళ్లకి, వ్యతిరేకంగా ఒక్క మాట పలికినా నాకు దూరమై పోతుందని స్పష్టమవుతోంది. వాళ్ళు తరచుగా, 'మీ తమ్ముడు ఎందుకూ పనికిరానివాడని,

నువ్వు మాకోసం అంత ఖర్చు పెడుతూంటే వాడు ఎంతో ఖర్చుపెట్టిస్తున్నాడని తమని పీల్చి పిప్పి చేసేస్తున్నాడని కూతురివైనా నువ్వే మాకు కొండంత అండ, నీ సాయం లేకపోతే నీ ఆదరణ లేకపోతే, మేం ఒక్క క్షణమైనా బతకలేం వెంటనే చచ్చిపోతాం. ఇలా పదే పదే అంటున్నారని "నేనే వాళ్లకి సర్వస్వం వాళ్ళ సంతోషమే నా జీవిత ధ్యేయం" అని బరువుగా డైలాగులేసి, బుడబుడాకన్నీళ్ళు కార్చేస్తోంది. మౌనంగా ఉండడం నాకుతప్పటం లేదు. 'పిచ్చిది అమ్మానాన్నల కృత్రిమ ప్రేమను, కుతంత్రాలను అర్థం చేసుకోలేక పోతోంది. ఎప్పటికైనా తనే తెలుసుకోవాలి గాని నేనెంత చెప్పినా లాభం ఉండదు. అపార్థం చేసుకోవటం మాత్రం తథ్యం',–అనుకుని మౌనంగా అత్తామామల ఆగడాల్ని భరిస్తూ ఉన్నాను.

మేం పట్నంలో అద్దింట్లోకాపురంపెట్టి రెండేళ్లుగడిచాయోలేదో, ఒక ఆదివారం చిన్నాన్న నన్ను ఒక్కడినే ఊరికి రప్పించుకుని తన నిర్ణయం దృఢంగా చెప్పేడు. "మా పొలాలతో బాటు నీవీ చూడటం కష్టమైపోతోందిరా – నీ భూమికి మంచి బేరం వచ్చింది. అమ్మేసి ఆ సొమ్ముతో పట్నం లో ఒకమంచి ఇల్లు కొనుక్కుంటే మంచిది నీకెలానూ బదిలీలుండవు కదా!

ఆయన మాటలకి నిర్ఘాంతపోయినా, అమలు పరచటం తప్పలేదు. అమ్మిన పొలానికి సొమ్ముబాగానే వచ్చింది. ఒక సంవత్సరం క్రితమే నిర్మాణమైన ఇల్లు కుదిరింది. స్వంత ఇల్లు కుదుర్చుకున్నానన్న ఆనందమూ కలిగింది. సరే, ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు కదా – ఆ సందర్భంగా చిన్నాన్న కానుకలు లభించాయి. అత్తా మామలు, బామ్మరిదికి కానుకలివ్వటం కూడా తప్పనిసరైంది. అలవాటై పోయినందు వలన నాకు పెద్దగా బాధ కలగనలేదనే చెప్పాలి. కాని చిన్నాన్న నాతో పొలం అమ్మించడానికి అసలు కారణం తెలిసినప్పుడు చాలా బాధకలిగింది. ఆ కారణమేమిటంటే, మా మామగారు చాలా సార్లు మా ఊరువెళ్ళి అక్కడివాళ్లని "ఈ పొలాలు అమ్మితే ఎంత వస్తుంది', అని వాకబు చేయటమే కాక, మా చిన్నాన్నని మావాడి పొలానికి సాలుకి ఎంత ఆదాయం వస్తుంది? నువ్వెంత మింగేస్తున్నావు, మా అల్లుడికి, నామ మాత్రంగా ఎంతిస్తున్నావు? అని అడగటం నిందించటం అది చిన్నాన్నకి బాధకలిగించటం జరిగిందంట – ఇంకో సంగతి కూడా తెలిసింది నాపొలం అమ్మేసిన తర్వాత చిన్నాన్న తమ్ముళ్ళు కుటుంబ ఖర్చులకి స్వంత పొలాల

మీద వచ్చేది సరిపోదని వేరే వాళ్ళది, ఏడెకరాల పొలం కౌలుకు తీసుకున్నారని, మా అత్త మామల మూలంగానే చిన్నాన్న మాతో పట్నంలో కాపురం పెట్టించి ఉంటాడని గతంలోనే నాకు వచ్చిన అనుమానం ఇప్పుడు బలపడింది.

ఈ సారి ఊరు కోలేకమా ఆవిడతో "చూశావా, మీ వాళ్ళేం చేశారో" అని నిష్టూరమాడేను. కాని తను చాలా తేలిగ్గా, 'అల్లుడంటే మానాన్నకి కొడుకు కన్న ఎక్కువ. ఆయనేం చేసినా, మీ మేలుకోసమే చేస్తారు". అంది. దాంతో ఊరుకుంటే నాకు మనస్తాపం మాత్రమే కలిగేది, మీరసలే 'తింగరి ముఖం' అని కూడా అనేసింది! కాబట్టి నాకు బాగా కోపం వచ్చి నన్నునేనే గిల్లుకున్నాను. సరే ఇప్పుడు చెప్పండి. అలాంటి "కలికాలం అత్తా మామల 32వ వివాహ వార్షికోత్సవ సందర్భంగా వారుభయులకూ చెరో డైమండ్‌రింగ్ చెరో స్మార్ట్ ఫోన్ భక్తి శ్రద్ధలతో ఇవ్వాలన్న డిమాండ్‌కు 'కమాండ్‌కు' నేను తలొగ్గకపోవటం తప్పో రైటో?

నా భార్యామణి "రమణి" తో ఘర్షణ జరిగిన తర్వాత నేనూ మెట్టు దిగలేదు. తన చిటపటలూ తగ్గలేదు. అయితే, రెండు రోజులు తర్వాత నేను అర్జెంటుగా బ్యాంకు పనిమీద హైద్రాబాద్ వెళ్లాల్సిచ్చింది. అక్కడ ఉన్న నాలుగురోజుల్లోనా పట్టుదల కొంత సడలింది. కాపురంలో శాంతి సుఖ సంతోషాల కోసమైనా కొంత రాజీ పడాలనిపించింది. (ఇదే ఆఖరి సారి అని తను ఒప్పుకుంటే.....)

ఇంటికి వచ్చిన వెంటనే తలుపు తీసిన "రమణి" ముఖం చూసి హృదయం ద్రవించి పోయింది. కళ్లుబాగా ఉబ్బిపోయున్నాయి ఎడతెగక ఏడ్చినట్లు ముఖం పీక్కుని పోయింది. ఎన్నాళ్లో లంఖణం చేసిన దానిలా తూలిపోయి పడిపోబోతున్న తనని పొదివి పట్టుకుని, సోఫాలో కూర్చోబెట్టి, ఫ్యాన్ ఆన్‌చేశాను. మెల్లగా అన్నాను "మంచి ఫోన్లుకొనిద్దాంలే" డైమండ్ రింగ్‌లు తర్వాత ఎప్పుడైనా వీలు చూసుకొని........

నా మాటలు పూర్తి కాకుండానే ఆవేశంతో ఊగిపోతూ... "నో నో వీల్లేదు. పూచిక పుల్ల కూడా ఇవ్వొద్దు.... వాళ్ళు మా అమ్మా-నాన్నలని చెప్పుకోడానికే సిగ్గుగా ఉంది. వాళ్ళు మనుషులే కాదు. ఏమీ ఇవ్వొద్దు" గట్టిగా అరిచి సోఫాలో కూలబడిపోయి వెక్కి వెక్కి ఏడ్వ సాగింది. తర్వాత నన్ను గట్టిగా వాటేసుకుని, వెక్కిళ్ళ మధ్య, తడబడుతూ ఓ గంటసేపు చెప్పుకున్నదాని సారాంశమిది.

నేను హైద్రాబాద్ వెళ్ళిన తర్వాత ఒంటరిగా కూర్చుని ఆలోచించుకుంటే, మా ఇద్దరి మంచితనాన్ని వాళ్ళిద్దరూ ఎంత తెలివిగా దుర్వినియోగం చేస్తున్నారో క్రమంగా అర్థమైందట, కాబట్టి ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట ఫుల్ స్టాప్ పెట్టడం అందరికీ మంచిదని ఆలోచించిందట. ఎలా అని, సంధిగ్ధంలో, ఉన్న సమయంలో, నాన్న ఫోను చేస్తే, అవకాశం వదులుకోరాదనిపించి, అర్థం చేసుకోండి నాన్నా ప్లీజ్ నాన్నా, ఇప్పుడు మా దగ్గర ఎక్కువ సొమ్ములేదు. ఈ సారికి ఏమీ ఇవ్వలేం. పళ్ళాపూలూ తెచ్చి మీ ఇద్దరి ఆశీర్వాదాలు తీసుకుంటాం. మరేదైనా మా శక్తి మేరకు ఏదో చిన్నకానుకలు కూడా"–ఇంకా ఏదో అనబోతుండగా ఆయన మండిపడి "అదేంటే ముదనష్టపుదానా ఇప్పటికే మేం ఊళ్ళో అందరికీ చాటింపు వేసి మరీ చెప్పేసుకున్నాం మా కూతురు ఎంత వద్దంటున్నా వినకుండా రెండేసి డైమండ్ రింగ్‌లు, ఖరీదైన ఫోన్లుకొనేసిందని, తమ్ముడికీ మరేదో కొన్నదనీ మరి ఇప్పుడు వట్టి చేతుల్తో నువ్వు వస్తే మేం ముఖాలు ఎక్కడ పెట్టుకోవాలే దెయ్యమా! అని తిట్టేసి ఫోన్ పెట్టేసేడంట!

ఒక్క క్షణం తిరక్కుండానే మళ్ళీ ఫోన్‌మ్రోగింది. ఈ సారీ నాన్నే మాట్లాడేడు. "నా బంగారు తల్లీ, మేమంటే నీకెంత ఇష్టమో నాకు తెలుసులే అని అనునయంగా మొదలెట్టినా "ఇదంతా ఆ(త్రాష్టుడే నీ మొగుడే  చెప్పిస్తున్నాడని నాకర్థమైంది. కుక్కకాటుకి చెప్పుదెబ్బే సరైంది వాడికెలాగైనా  బుద్ధి చెప్పాలి. నువ్వు వెంటనే నగలన్నీ మూటకట్టుకుని ఇక్కడికొచ్చేయ్. వాడికి  "లీగల్ నోటీస్ ఇప్పిస్తా", గృహ హింసకేసు కూడాపెట్టి అరెస్ట్ చేయిస్తా. నువ్వు గట్టిగా, నిలబడితే విడాకులూ ఇప్పిస్తా. భరణమూ కక్కిస్తా. నా సత్తా చూపిస్తా వెధవకి అని అరిస్తే ఈ విడకి మతిపోయి మౌనంగా ఉండిపోతే "ముదనష్టపుదానా వస్తావా రావా! చెప్పేడవ్వే అని గద్దించాడంట. ఈ మాటలతో మనసు విరిగిపోయి, రమణి ఫోన్‌పెట్టేసినా మళ్ళీ వెంటనే ఫోన్‌మోగిందంట. ఈ సారి మాతృమూర్తి మాట్లాడిరది. "ఏంటే దెయ్యమా నీ మేలుకోరి నాన్న అంతలా చెప్తున్నా బెల్లం కొట్టిన రాయిలా ఏం మాట్లాడకుండా ఉంటున్నావ్! మేం అడిగినవి తెచ్చిస్తే సరే లేకపోతే మా గడప తొక్కొద్దు. నువ్వు చచ్చిపోయావనుకుంటాంలే దేముడా ఎంత మంచి జరిగింది! ఒకవేళ ఆ అయిదెకరాలూ నీ పేరున రాసేసి ఉంటే ఇంకా ఎంత నీల్గే దానివో

కదా నా కొడుక్కి అన్యాయం జరిగిపోయేదేకదా. పోనీ అదైనా మిగిలిందను కుంటాంలే. ఆఖరి సారి చెబుతున్నా వాడితో విడాకులు తీసుకోవడానికి ఒప్పుకోకపోతే మాకు నువ్వు చచ్చిపోయినట్లేలెక్క. నాకు నెలతప్పింది, గర్భిణీని కదా విడాకులు మంచిది కాదని కుంటి సాకులు చెప్పకు– కడుపు తీయించేయటం ఎంత సేపు. యోగ్యుణ్ణి చూసి మళ్ళీ పెళ్ళి చేయటం మాకుచేతకాదా! ఏమంటావ్, వస్తావా రావా చెప్పవే ముదనష్టపు దెయ్యమా.....

ఇలా తల్లి తిట్ల దండకం చదువుతుంటే రమణికి మనసు ఇంకా ముక్క చెక్కల్కైపోయి "ఛీ? నువ్వు తల్లివేనా అసలు ఆడదానివేనా" అని అరిచేసి, ఫోన్ పెట్టేసిందట. ఇదంతా చెప్పి వాళ్లకీ మనకీ ఇంకే సంబంధం వద్దండివాళ్ళ మాటే ఎత్తొద్దు అని ఇంకా ఏడ్చేసింది.

కాసేపయ్యాక, "ఇంకో సంగతి చెప్పాలి. – అని మళ్ళీ మొదలెట్టింది. పెళ్లిలో వాళ్లిస్తానన్న అయిదెకరాల పొలం మీద ఆదాయాన్ని వాళ్లే బొక్కేస్తున్నారని తెలిసినా మీరు మంచి వాళ్ళు కాబట్టి ఊరుకుంటున్నారు (ఈ సారి తింగరి మొఖం కాబట్టి అనలేదు).కానీ మీకెవరికీ తెలియనిదొకటుంది. ఆ పొలం మా నాన్న స్వార్జితం గాని వారసత్వపు ఆస్తిగాని కానే కాదు. మాకు దూరపు చుట్టం ఒకావిడ నాకు వీలునామా ద్వారా రాసిచ్చిందది – మైనార్టీ తీరేవరకు మా అమ్మ సంరక్షకురాలుగా ఉండాలని మాత్రమే ఉంది అందులో. అంటే గత కొన్నేళ్ళుగా, అంటే నాకు 18 ఏళ్లు నిండినప్పటి నుండి ఆ అయిదెకరాల పొలం మీద సర్వహక్కులూ నావే. ఇన్నాళ్ళు వాళ్ళు ఆదాయాన్ని తింటున్నా, ఇప్పుడు లెక్క చెప్పాలిందే. అంతేకాదు మా అమ్మకి నాన్నకి వారసత్వంగా వచ్చిన మరో ఇరవై ఎకరాల పొలం మీద ఊళ్లో ఉన్న మేడలో ఇతర స్థిర చరాస్తులలో కూడా మా తమ్ముడు వికార్ గాడితో సమంగా నాకూ హక్కుంది. మంచిగా అప్పజెప్పితే సరే లేకపోతే కోర్టులో తేల్చుకుంటాను. మీరేం అడ్డుపడొద్దు సుమా. మీరసలే "తింగరి మొఖం అనేసింది.

"తింగరి మొఖమని" అన్నా నాకు కోపం రాలేదు. నన్నునేను గిల్లుకోలేదు. కానైతే "ప్రస్తుతానికి మౌనంగా ఉంటే మంచిది వాళ్ల పాపానికి వాళ్లేపోతారు. తల్లిదండ్రులకి వ్యతిరేకంగా కోర్టు కెక్కనీయరాదు". అని నాలో నేను అనుకున్నాను.

కొంత కాలానికి అన్నీ సద్దుబాటవుతాయి. ఎంతైనా ఈవిణ్ని కన్న వాళ్ళు కాబట్టి తమ తప్పు తెలుసుకుని గాని, ఉన్న కొండంత "వెసులు బాటు" ఎందుకు పోగొట్టుకోవాలని తలచిగాని, నా "కలికాలం అత్తామామలు" కొన్నాళ్ల తర్వాతైనా, మా దగ్గరకి వాళ్లంత వాళ్లే వస్తారని కూడా నాకనిపించింది. కాని పైకేమి అనలేదు. "అన్నట్లు నాకు బ్యాంకులో మేనేజరుగా ప్రమోషనొచ్చిందోయ్ అని చెప్పి సంతోషపరిచాను, సబ్జెక్టు మార్చడానికి.

రచనా కాలం - 2020

విజ్ఞానాన్ని సంపాదించు. జ్ఞాన సంపద ఉన్నవాడు స్నేహితుల మధ్య మణిదీపంలా ప్రకాశిస్తాడు.



విజ్ఞానం ద్వారా మాత్రమే సాటి మనిషి పట్ల ప్రేమ, అతని శ్రమ పట్ల గౌరవం ఏర్పడుతుంది.



ఎవరి మనసు ఉన్నతమైనదో, ఎవరి ఆలోచన ఈ ప్రపంచమందలి ప్రజలందరినీ జ్ఞాన సంపన్నులను గావిస్తుందో, అతడే నిజమైన భాగ్యవంతుడు.

# "దుస్సాహసం" (ప్రజ్ఞకి న్యాయం కోసం)

"సాహస్", కొంత విచిత్రమైన రీతిలో పరిచయమైన మొదట్లోనే నాకు రెండు విషయాలు స్పష్టంగా అర్థమయ్యాయి, కాస్త అతిగా మాట్లాడతాడేగాని, చాలా మంచివాడని, మరీ ఊతపదంలా కాదుగాని, పదేపదే "దుస్సాహసం" అనేపదం, పలికే అలవాటుందని. అసలు తనతో పరిచయం, ఎలా అయిందంటే, అతనుండే పట్టణానికి బదిలీ అయిన నేను, ఉద్యోగంలో చేరడానికి ఒక్కడినే రైల్‌లో వెళ్తున్నాను. రైలు దారిలో ఒక స్టేషన్‌లో చాలాసేపు ఆగినంతసేపూ 'ప్లాట్‌ఫాం'మీద తీరిగ్గా పేపర్ చదువుకుంటూ నిలబడి ఉండిపోయిన ఒక బక్కపల్చటి మనిషి, రైలు కదిలి, బాగా వేగం అందుకుంటున్నప్పుడు, పరుగెత్తుకుంటూ వచ్చి అతి కష్టం మీద నేనున్న భోగీలోకి ఎగిరి దూకబోయి, 'బేలన్స్' తప్పి కిందపడి పోబోతుంటే, యాదృచ్ఛికంగా డోర్ దగ్గరున్న నేను వేగంగా స్పందించి, అతని నడుం పట్టుకుని, లోపలికి లాగేశాను.

అతను నా ముఖంలోకి మామూలుగా ఓక్షణం చూసి, అసలు ఏమీ జరగనట్లుగా, మౌనంగా వెళ్ళి ఓ సీట్లోకూర్చున్నాడు. అది నా సీటుకి ఎదుటిదే – నేనూ వెళ్ళి కూర్చున్నాను. అతను అకస్మాత్తుగా తలెత్తి నావైపు నవ్వుతూ చూస్తూ "అదేంటి మేస్టారూ, అంత "దుస్సాహసం" చేశారు. ఒకవేళ మీకు బేలన్స్ తప్పినా, నా "భారీకాయాన్ని" లోపలికి లాగటం సాధ్యపడకపోయినా, ఇద్దరం రైలు కింద పడిపోయేవాళ్ళం కదా" – అంటే నివ్వెరపోవటం నావంతైంది. "దుస్సాహసం" నాదా, అతనిదా మరి! వెంటనే, తనని పరిచయం చేసుకున్నాడు – తనపేరు "సాహస్", అయినా, పిరికితనం ఉందని, ఒక దినపత్రికలో విలేఖరిగా పని చేస్తున్నానని, 'బిఏ' పాసయినా, వేరే వాళ్ళెవరూ ఉద్యోగం ఇచ్చే 'దుస్సాహసం' చేయనందున, చాలీచాలని జీతంతో ఆ వృత్తిలోనే కొనసాగిపోతున్నానని, ఎందరో ప్రముఖుల గురించిన సంచనల నిజాలు వెలికితీసిన వాడిగా, తనకు రాష్ట్రవ్యాప్తంగా "సంచనాల సాహస్"గా గుర్తింపు ఉందని గడగడా చెప్పిన తర్వాత "నా కర్తవ్య నిర్వహణలో ఎన్నో..." అని కాస్త ఆగేడు. "సాహసాలు చేశారన్నమాట...!" అని మర్యాదకోసం నేనందుకుంటే... "కాదు...దుస్సాహసాలు చేశా" అని సరిదిద్దాడు!

తర్వాత, తనుండే పట్టణానికే నేను వెళ్తున్నానని తెలుసుకుని "మరి చెప్పారుకాదేం! కొత్తచోట అద్దె ఇల్లు చూసుకోవడం, గ్యాస్‌కనెక్షన్ పొందటం, రేషన్‌కార్డ్ వగైరా వగైరా ఏదీ స్వయంగా తంటాలుపడే "దుస్సాహసం" చేయొద్దు – అన్నీ నేను చూసుకుంటా" అన్నాడు.

అప్పుడు నేనతన్ని "కాస్త కమీషన్' కోసం సాయం చేసే మనిషేమోనని అపార్థం చేసుకున్నమాట వాస్తవం. కాసేపయ్యాక కాలక్షేపం కబుర్ల మధ్యలో "మీ ఊరు ఎందుకు ప్రసిద్ధి? నేనింతకు ముందెప్పుడూ రాలేదులే" అన్నానో లేదో, 'సాహస్'లోని విలేఖరిని ప్రేరేపించినట్లైంది. "పదిలక్షల డెబ్బైవేలపై చిలుకు జనాభా, ఒక క్రికెట్ స్టేడియం, ఇరవై సినిమా థియేటర్లు ఉన్న మా ప్రజ్ఞాపురాన్ని ఊరనే "దుస్సాహసం" చేశారు మేస్టారూ! పోన్లెండికాని, మీ పురం దేనికి, ప్రసిద్ధి అనడిగితే వేరేవాళ్ళు, తీపి కాజాలకి, పూతరేకులకి, ఏవో పరిశ్రమలకి అని చెబుతారేమో గాని, నేనైతే "ప్రజ్ఞ" అనే అపురూప బాలమేధావి, నాట్యమయూరి, గానకోకిల, పుట్టి పెరుగుతున్న గొప్ప పట్టణమని వక్కాణిస్తాను. ఇంకా పన్నెండేళ్లైనా నిండని ఆ బహుముఖ ప్రజ్ఞాశాలి ఇప్పటికే రాష్ట్రవ్యాప్తంగా ఎన్నో నాట్య, సంగీత, గానకళా ప్రదర్శనలిచ్చింది. అంతేకాదు కంప్యూటర్ సమాన వేగంతో సరైన జవాబులు, ఎన్నోక్లిష్టమైన గణిత సమస్యలకిచ్చి, పలు "రికార్డులు" నెలకొల్పింది; "అవార్డులు" తీసుకుంది. మాతృభాష తెలుగులో, జాతీయభాష హిందీలో, అంతర్జాతీయ భాష ఆంగ్లంలో కూడా, చక్కని కవితలల్ల గల "బాల విదుషీమణి"– ఆమె తల్లితండ్రులు పరమేశ్వరరావు –పార్వతి. స్థానిక యూనివర్శిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్లుగా, "ధార్మికులు"గా, "మంచివాళ్ళు"గా అందరికీ తెలుసు – తమ ఏకైక సంతానమైన "ప్రజ్ఞ"లోని అనన్య సాధ్యము, అపూర్వమైన బహుముఖ ప్రజ్ఞను, చిన్నతనం లోనే గుర్తించి, అన్నివిధాలా ప్రోత్సహిస్తున్నారు. కూతురితో ఎన్నో సమాజహిత కార్యక్రమాలు చేయిస్తూ తరిస్తున్నారేగాని, ధనార్జనకి పూనుకోవడం లేదు.

"అన్నట్టు వచ్చే ఆదివారం, "టౌన్‌హాల్"లో "ప్రజ్ఞ" ప్రదర్శన ఉంది సీతారామస్వామి దేవాలయ పునరుద్ధరణ నిధుల కోసం అది ఏర్పాటు చేయబడుతోంది. ప్రవేశ రుసుం ఐదువందలు పెట్టారులెండి. తను ఉచితంగానే

చేస్తోంది – విలేఖరిని కదా, నాకు రెండు కాంప్లిమెంటరీ టిక్కెట్లిచ్చారు లెండి మళ్ళీ మర్చిపోతానేమో ఒకటి మీదే" అంటూ బలవంతంగా నా జేబులో ఒక టిక్కెట్ పెట్టేశాడు – పైగా నాకు ఉచితం గానే వచ్చింది – డబ్బులిచ్చే "దుస్సాహసం" చేయొద్దుసుమా!" అని, ఆ పదం మరోసారి వాడేడు. అలా నాకు అతను "మంచివాడని" "దుస్సాహసం" అనే పదం పదేపదే పలుకుతాడని, పరిచయమైన కొద్దిసేపట్లోనే స్పష్టంగా తెలిసిందన్నమాట.

అక్కడికి చేరుకున్నాక, రైల్లో వాగ్దానం చేసినట్లుగానే ఇల్లుచూపెట్టటం, వగైరా, వగైరాలన్నీ అన్నీతానై చూసుకున్నాడని వేరే చెప్పాలా? తర్వాతి ఆదివారం, తనే వచ్చి మోటారు బైక్‌పై టౌన్‌హాల్‌లో ప్రజ్ఞ నాట్య, గాన ప్రదర్శనకు తీసుకుని వెళ్ళేడు. ఆ కళల్లో నాకు ప్రవేశం లేదుగాని అభిరుచి ఉంది. అందుకే నాట్య, గాన ప్రదర్శనను బాగా ఆస్వాదించాను. అది జరుగుతున్నంతసేపూ, "సాహస్" నోట్స్ రాసుకుంటూనే ఉన్నాడు – తను పనిచేసే దినపత్రికలో "సంస్కృతి" కాలమ్‌కి సమీక్షరాయడానికై ఉంటుందని ఊహించాను. నాట్యప్రదర్శన అయిన తర్వాత కొద్ది సమయంలోనే, ప్రజ్ఞ తన భరతనాట్యం దుస్తులు, అలంకరణ వేగంగా మార్చేసుకుని "తెలుగింటి పాప"లా సామాన్యమైన లంగా, ఓణీలు కట్టుకుని వచ్చి, తన గానకళా మాధుర్యాన్ని శ్రావ్యంగా శ్రోతలకందించ సాగింది.

అందరూ ముగ్ధులై వింటుండగా, మధ్యలో ఒక వెకిలి కుర్రాళ్ళ బృందం గోలగోలగా గట్టిగా అరుస్తూ హాల్లోకి ప్రవేశించింది. వాళ్ళు ఉద్దేశ్యపూర్వకంగా, పిచ్చి అల్లరి చేస్తూ, "వన్స్‌మోర్", "నోమోర్" నినాదాలు చేస్తూ అందరికీ జుగుప్స కలిగించారు. రౌడీలా కనపడుతున్న, దున్నపోతులా ఉన్న ఆ బృంద నాయకుడు మరీ రెచ్చిపోయి గోలచేస్తుంటే, ఇక సహించలేక, వాడిని వారించుదా మనిపించి లేచి నిలబడ్డాను. వేగంగా స్పందించి "సాహస్" నా భుజాలను గట్టిగా పట్టుకుని "దుస్సాహసం" వద్దు మేస్టారు అంటూ బలవంతంగా కూర్చోబెట్టేడు. "మందని మందలిస్తే ప్రయోజనం ఉండదండీ– వాళ్ళ నాయకుడు ఎవరనుకుంటున్నారు? దొంగసారా, కల్తీకల్లు వ్యాపారాల్లో కోట్లు గడించి ఈ మధ్యనే "ఎమ్మెల్సీ" పదవి తెచ్చుకున్న...కాదు కొనుక్కున్న పెంచలయ్య, కుమార రత్నం – పేరు భరత్ –

ఇంకా పాతికేళ్లైనా నిండని వాడి ఖాతాలో ఇప్పటికే మూడు అత్యాచారాలు, ఆరు దొమ్మీలున్నాయి. కేసులు మాత్రం లేవులెండి. వాడితో తలపడే, "దుస్సాహసం" చేయొద్దు – నాకు వదిలేయండి, నేనేదో చేస్తానుగా" – "నువ్వేం చేస్తావులే" అని గొణిగితే నవ్వి  ఊరుకున్నాడు.

మర్నాటి దినపత్రికలో "ప్రజ్ఞ" నాట్యగాన ప్రదర్శన గురించి సాహస్ రాసిన ఒక"గొప్ప సమీక్ష" వచ్చింది. ఆఖర్లో ఒకే ఒక వాక్యం భరత్ పేరు ప్రస్తావించలేదు గాని, "ప్రదర్శన చివర్లో సభా ప్రాంగణంలో ఒక "యువగార్ధభం" తన మందతో కలిసి జొరబడి అంతరాయం కలిగించటం మనందరి దౌర్భాగ్యం" అని ఉంది. సంఘటన జరిగాక, రెండురోజుల తర్వాత "సాహస్" చెప్పకపోయినా, ఎవరి ద్వారానో నాకు తెలిసిందది – అతను సాయంత్రం బజారులో నడిచివెళ్తోంటే ఎవరో (పత్రికల భాషలో) "గుర్తు తెలియని ఆగంతకుడు" ఒకరాయి విసిరాడని అది గురి తప్పినా, తలకు గాయమైందని – పరామర్శించుదామనుకుంటూనే, మర్చిపోయాను. ఓరోజు ఉదయాన అతని దగ్గర నుంచే ఫోన్‌వచ్చింది. అతను మాటలు వెతుక్కుంటూ "హలో, హలో", అంటున్నాడు గాని, ఏమీ చెప్పలేక పోతున్నాడనిపించింది. "నీ తలకైన గాయం తగ్గిందా" అని నేనే అడిగాడు. నా ప్రశ్నకి సమాధానం రాలేదు అటునుంచి ఏడుపు వినవచ్చింది – "ఏమైంది?" అని గాభరాగా అడుగుతుంటే "చాలా ఘోరం జరిగిపోయింది మేస్టారూ – మీరింకా టీవీగాని, పేపర్‌గాని చూసినట్లులేదు… ఇంకేమీ మాట్లాడలేక కాబోలు, ఫోన్ పెట్టేశాడు – నాకేం అర్థం కాలేదు.

హాల్లోకి వెళ్ళి టీవీ "ఆన్" చేశాను – అదేదో ఛానల్‌లో ఎప్పటివో "ప్రజ్ఞ" నాట్యప్రదర్శన తాలూకు "క్లిప్పింగ్‌లు" చూపిస్తున్నారు. తన సకల కళా ప్రావీణ్యత గురించి, బహుముఖ ప్రజ్ఞ గురించి, ఒక ఏంకర్ ఏకరువు పెడుతోంది. "ప్రజ్ఞ" పుట్టినరోజుకాబోలీవేళ అనుకున్నాను. కానీ అంతలో కింద వస్తున్న స్క్రోలింగ్‌ల మీదకి నా దృష్టి మరలింది.

– బాలమేధావి, నాట్యమయూరి, గానకోకిల

– ప్రజ్ఞపై అత్యాచారం – ఆపైన పెట్రోల్ పోసి హత్యాప్రయత్నం

– 75 శాతం కాలిన గాయాలతో హాస్పిటల్‌లో ప్రజ్ఞ –

–ఘోరం – దారుణం – మృత్యుముఖంలో ప్రజ్ఞ –

ఇంతలో కళ్ళు తుడుచుకుంటూ వస్తున్న మా ఆవిడ చేతిలోని న్యూస్‌పేపర్లు లాక్కుని చూశాను.

– అన్నిటా ఇదే పతాకశీర్షికవేర్వేరు విధాలుగా –

"చిదిమివేయబడ్డ ప్రజ్ఞాజ్యోతి"– "నలిపివేయబడ్డ ఆడబిడ్డ" – "ఎవడా "కీచకుడు?"

"ఆచూకీ తెలియని ఆగంతకుడు" – ఇలా ఇలా...

రోజంతా టీవీ ఛానళ్ళలో 'ఇదే "బ్రేకింగ్", "షాకింగ్" న్యూస్. ముందు రోజు రాత్రి ఒంటరిగా ఇంట్లో ఉన్న ప్రజ్ఞపై అత్యాచారం జరిగిందని, తర్వాత చంపాలన్న ఉద్దేశంతోనే, పెట్రోల్‌పోసి తగల పెట్టడం జరిగిందని, ఇప్పుడా చిన్నది 75 శాతం కాలిన గాయాలతో, అసలు మాట్లాడలేని స్థితిలో మాత్రమే కాదు, ఎవర్నీ గుర్తుపట్టలేని "కోమా"లో ఉందని ఎంతో ఆవేదనతో ఇవన్నీ గమనిస్తున్న మా ఆవిడ "అయ్యో! ఆ ఘోరం చేసిన అప్రాచ్యపు వెధవ ఎవడో తెలియకపోతే ఎలా అండీ– ఆ పిల్లకి త్వరగా తెలివొొచ్చి చెబితే బాగుంటుంది" అని అంది – స్థానిక రాజకీయ నేతలతో సహా, ముఖ్యమంత్రి, హెూంమంత్రి, ప్రజ్ఞపై జరిగిన అఘాయిత్యాన్ని తీవ్రంగా "ఖండించారు" – "ముఖ్యమంత్రి, "డి.జి.పి."ని బాగా కృషి చేసి, పరిశోధన చేసి, వెంటనే నిందితుడిని పట్టుకోమని ఆదేశించారు కదా, మరి పోలీసులేంటి ఇంకా ఎవర్నీ పట్టుకోలేదని" నన్ను ప్రశ్నించింది మా ఆవిడ–

నాకేం చెప్పాలో తెలియలేదు – "ఆ వెధవ ఎక్కడదాక్కున్నా వెతికి తెచ్చి నడివీధిలో ఉరి తీయాలండీ– కోర్టులు, విచారణలు అని ఆలస్యం చేయకూడదండీ" అంటుంటే ఆమె అమాయకత్వానికి జాలిపడ్డాను. వారంరోజులు గడిచాయి – "మృత్యువుతో పోరాడి ఓడిపోయిన ప్రజ్ఞ" స్పృహలోకి రాకుండానే మరణవాగ్మూలం ఇవ్వకుండానే ఆరిపోయిన కళాజ్యోతి" అంటూ బ్రేకింగ్‌న్యూస్–షాకింగ్‌న్యూస్ వచ్చిన రోజు నేను, మా ఆవిడ కూడా బాగా కలత చెందాము. ఈ ఘోరం తట్టుకోలేని ప్రజ్ఞ తల్లిదండ్రులు బాగా అస్వస్థులై అదేదో హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్నారని,

ఆ అమ్మాయి అంత్యక్రియలు ఎవరో బంధువులు చేశారని తెలిసి ఇంకా బాధపడ్డాం. సాక్ష్యాధారాలేమీ దొరకలేదనే, చెబుతున్నారు పోలీసులింకా.

దాంతో మా ఆవిడకు పోలీసులపై నమ్మకం పోయి కోపం వచ్చింది. "వీళ్ళ బొంద– పోలీసుల వల్ల ఏం కాదుగాని – "సాహస్ అన్నయ్య"కి ఫోన్‌చేసి చెప్పండి– ఏదైనా నీవల్లనే సాధ్యం – బాగా పరిశోధించి, స్టింగ్ ఆపరేషన్‌లు చేసి నిందితుడెవరో కనిపెట్టేసి, పోలీసుల కప్పజెప్పమనీ! మేం మహిళా సంఘాలవాళ్ళం – 'కోర్టులూ, గాడిద గుడ్డూ' అనకుండా ఆ వెధవని మాకు అప్పజెప్పమని ధర్నాలు చేస్తాం", అని బాగా ఆవేశంగా అంది.

తను ఆదేశించిందని కాదుగాని, నాకే "సాహస్"తో మా ఆవేదన పంచు కోవాలనిపించి ఫోన్ చేశాను – కాని దొరకలేదు. ఒకవేళ నువ్వే ఏదో చెయ్యాలని చెబితే "అంతటి దుస్సాహసం" నావల్లకాదు మేస్టారూ' అంటాడని తోచి, మళ్ళీ ప్రయత్నించలేదు – సాహస్ చెప్పలేదు గాని, ఈ మధ్యనే అతని పూర్వపరాలు గురించి కొంత తెలిసింది. అసలు అతను కుటుంబంతో వేరే ఏదో పల్లెటూరిలో ఉండేవాడట – చిన్న కిరాణా కొట్టు నడుపుకుంటూ ఆ ఊరి మోతుబారి "ఒకడు సాహస్ ఏకైక కుమార్తె 'అర్పణ' అనే పదకొండేళ్ళ చిన్నారిని, ఒక్కతే ఉన్నప్పుడు రేప్ చేశాడట – ప్రత్యక్ష సాక్షులున్నా ఎవరూ ముందుకు రాలేదు, పోలీసులకి వాంగ్మూలం ఇవ్వడానికి. దాంతో ఆ కీచకుడి మీద ఏ విధమైన కేసూ నమోదు కాలేదు. కానీ, బాధితురాలు, ఊళ్ళో వాళ్ళందరూ "శీలం చెడినదని అవమానిస్తూంటే, తట్టుకోలేక ఉరివేసుకుని చచ్చిపోతే, ఇక అక్కడ ఉండలేక 'సాహస్' ఈ పట్టణానికి భార్యతో సహా వలస వచ్చేసాడని, తరచూ తన కూతురికి జరిగిన అన్యాయం గుర్తుకొచ్చినప్పుడల్లా తీవ్రమైన కుంగుబాటుకి, ఆవేశాగ్రహాలకి గురవుతూ ఉంటాడని కూడా చెప్పారు! అందుకేనన్నమాట "సాహస్"ని "ప్రజ్ఞ" ఉదంతం అంత బాధించిందని అర్థమైంది – "కాని పాపం ఏం చేయగలడు?" అని అనుకుని నిట్టూర్చాను.

ఓరోజు టీవీలో సినిమా చూస్తూ అందులో "అత్యాచారం" సీను వస్తే చిరాకొచ్చి ఛానల్ మార్చాను. అందులో "లైవ్‌లో", స్థానిక ఎమ్మెల్సీ పెంచలయ్యని పత్రికా విలేకర్లు చుట్టుముట్టి ప్రశ్నిస్తున్నారు, అసలాయన బ్రాందిషాప్

ప్రారంభోత్సవానికి వచ్చాడని తెలుస్తూనే ఉంది విజువల్స్‌ని బట్టి.

"అయ్యా- ఇది సందర్భం కాదని తప్పించుకోకండి- మన పట్నానికే ఆణిముత్యమైన, మీరుండే వీధిలోనే ఇల్లున్న "ప్రజ్ఞ" దుర్మరణానికి సంతాపం ఎందుకు ప్రకటించలేదు? - అంత తీరిక లేకుండా ఉన్నారా? పైగా మీకు సంబంధం ఉందని అందరూ అనుకునే ఒక పత్రికలో, ప్రజ్ఞ గురించి "అభిజ్ఞవర్గాలని" ఉటంకిస్తూ అవాకులు చవాకులు రాశారు, తనకి ఎందరో బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారని, ఇటీవలి కాలంలో విలాసాలకు, వ్యసనాలకు అలవాటుపడిందని "ప్రజ్ఞ" గురించి అన్నీ తెలిసిన పురప్రజలు అట్టుడికిపోయి ఆ పత్రిక కార్యాలయంపై దాడిచేసిన ఘటనని మాత్రం మీరు "పత్రికాస్వేచ్ఛ"కు విరుద్ధమైన ఘోరంగా ప్రకటించారు. మీకూ, ప్రజ్ఞ కుటుంబానికి ఏమైనా పాతకక్షలున్నాయా?" గుక్కతిప్పు కోకుండా ఇలా ఎమ్మెల్సీ పెంచలయ్యని అంత ధైర్యంగా కడిగేస్తున్న విలేకరి "సాహస్" అని పోల్చుకున్నాను.

ముందు తడబడ్డా నీళ్ళునమిలినా, ఎంతైనా రాజకీయవేత్త కదా, తనదైన భాషలో జవాబిచ్చాడు పెంచలయ్య- "ఆ పిల్లంటే నాకు చాలా ఇదన్నమాట, బాగా తెలుసున్నాదిగందా- దాని 'చావు' ఏదైతే ఉందో దానికి నాకు శానా విచారం ఏదైతే ఉందో అది బాగా వచ్చేసీ నోటమాటరాక, గమ్ము నుండి పోయానన్నమాట. సరే ఇప్పుడు సెప్పుతా - రాస్కోండి- ఆ చావుని తీవ్రంగా "ఖండిస్తున్నా". ఇంతవరకూ కాస్త తెలివిగానే చెప్పాడేమోగని, విలేకరుల మౌనం గమనించి కాస్త రెచ్చిపోయాడు - "ఏదో పత్రికలో ఆ పిల్ల గురించి ఏదో రాస్తే నాకేం సంబంధం? ఒకే వీధిలో ఉండే పెద్దమనిషిగా, ఆ పిల్ల గురించి నాకూ కొన్ని అనుమానాలున్నాయిలే - ఈ కాలం పిల్లల సంగతి మీకెరుక లేదా? అయినా వదిలేద్దాం - చచ్చిపోయిన వాళ్ల గురించి పుచ్చుమాటలెందుకులే" అన్నాడు. చుట్టూ ఉన్నవాళ్ళు "ఛీ... ఛీ"... అనటం లైవ్‌లో వినపడిదది. ఇంతలో వాడి కుమారత్నం భరత్ ఎక్కడినుంచి వచ్చాడో ఏమో, తండ్రి వారిస్తున్నా లెక్కచేయకుండా, ఒకవిలేకరి చేతిలోని మైక్ అందు కున్నాడు.

"ఆ పిల్లనాకూ, బాగా తెలుసు - మల్లిపువ్వు లాంటి ఆ చక్కనిచుక్కని నా సొంతచెల్లిలా చూసుకున్నాను. ఎన్నోసార్లు డబ్బులూ ఇచ్చేను కూడా- నా చెల్లి

నాకన్యాయం చేసి వెళ్ళిపోయింది – ఇంకరాదు..రాదు..” అంటూ బుడిబుడి ఏడుపులు మొదలెట్టాడు.

“ఓయ్, భరత్, దొంగ ఏడుపులు చాలుగాని... ఇది చెప్పు... నిరుడు ‘ప్రజ్ఞ’ని, తను చదువుతున్న హైస్కూల్ లోని మరి కొంతమంది ఆడపిల్లల్ని నువ్వు వెంటబడి వేధిస్తున్నావని ఆ అమ్మాయే పోలీస్‌స్టేషన్‌లో ధైర్యంగా ఫిర్యాదు ఇచ్చింది కదా... ఆ కేసేమైందో... కాస్త చెబుతావా...” సాహస్ ప్రశ్నకి భరత్ బిత్తరబోయాడు... అప్పుడు ఎమ్మెల్సీ పెంచలయ్య పి.ఏ., వాళ్ళిద్దర్నీ బలవంతంగా కారెక్కించేసి తను ముందు సీట్లోకూర్చుని బయటికి చూస్తూ “ఎమ్మెల్సీ గారికి వేరే అత్యవసర కార్యక్రమాలున్నందున, ఈ పత్రికా సమావేశం ముగించటమైంది – ఏయ్ డ్రైవర్ నువ్వు పోనీయ్” అన్నాడు. తర్వాత ఏం జరిగిందో తెలియలేదు – కరెంట్ పోయి మా టీవీ ఆగిపోయింది! ఎప్పుడొచ్చి ఇదంతా చూసిందో ఏమో మా ఆవిడ, “ఇంక నాకు అనుమానం లేదు – ఆ దున్నపోతుగాడు ‘భరత్తే’ అని స్పష్టంగా ప్రకటించేసింది. నాకూ కాదనాలనిపించ లేదు! నా మిత్రుడు “సాహస్”, ఖాళీగా కూర్చోలేదు, నిందితుడిని ఎలాగైనా పట్టించడానికి ఏవో ప్రయత్నాలు రహస్యంగా చేస్తూనే ఉన్నాడని, తర్వాత జరిగిన కొన్ని ఉదంతాల మూలంగా తెలిసింది. కొన్నిరోజుల తర్వాత “మీడియా” ద్వారా ఒక సమాచారం తెలిసింది, ఒక విలేకరికి, భరత్ ఏదో పబ్‌లో మర్చిపోయిన సెల్ దొరికిందని, దాన్లోని కాల్‌డేటా, అశ్లీల చిత్రాలు వగైరా కాపీ చేసుకున్న తర్వాతనే ఆ ఫోన్‌ని పోలీసులకు, రసీదు తీసుకుని అప్పచెప్పాడని – అయినా పోలీసులు ఆ సాక్ష్యాధారాలు సరిపోవని ఇంకా తాత్సారం చేస్తున్నారని చాలా ఛానళ్ళలో వార్తాపత్రికలలో పదేపదే వచ్చింది. మహిళాసంఘాలు, “ప్రజ్ఞకి న్యాయం” అనే నినాదంతో మళ్ళీ ఉద్యమించారు. ఈ సారి చేసిన ధర్నాలలో మా ఆవిడ కూడా పాల్గొన్నది! “భరత్‌ని అరెస్ట్ చెయ్యాలి – ఉరి తీయాలి” అని నినదించింది కూడా, తోటి స్త్రీలతో కలిసి –

భరత్ ఒక యువ నాయకుడిగా ఎదుగుతున్న తనపై కుట్ర జరుగుతోందని, వాపోతూ, ప్రజ్ఞ “దిక్కుమాలిన చావు”తో తనకేం సబంధం లేదని దేవాలయంలో ప్రమాణం చేయటానికి సిద్ధమని సవాలు చేస్తూ ప్రకటనని విడుదల చేశాడు – ఆ ప్రకటనని టీవీ ఛానళ్ళు పట్టించుకోలేదు – ఒకటి రెండు వార్తాపత్రికలు ఒక

మూలన ప్రచురించాయి. వాడికి వ్యతిరేకంగా ఇంకో సాక్ష్యాధారం బయటికొచ్చింది. అదే విలేకరి ఎన్నితంటాలు పడి ఎలా సేకరించాడో ఏమో గాని, ఆ ఉదంతం జరిగిన రోజునే, ఒక పెట్రోల్‌బంక్ నుంచి ఒక యువకుడు తాజాగా పెట్రోల్ కొని ఒక కేన్ తీసుకుని వెళ్తున్న సీసీ కెమెరాలో రికార్డయిన దృశ్యసాక్ష్యం పోలీసులకు అందజేశాడని, ఆ వ్యక్తి భరత్ కాదుగాని, అతని సన్నిహిత మిత్రుడని తెలియవచ్చింది. ఈ రెండు సాక్ష్యాధారాలు అందజేసిన 'విలేకరి' సాహస్ అని ఊహించటం నాకుకష్టం కాలేదు – నేననుకున్నట్లుగానే, బైక్‌లో పెట్రోలు అంతా అయిపోతే తెప్పించానన్నది భరత్ వివరణ!

మహిళా సంఘాలు "ప్రజ్ఞకి న్యాయం" అని చేస్తున్నఉద్యమం ఇంకా ఉధృతమైంది. తప్పనిసరి పరిస్థితుల్లో 'భరత్' ని ఎట్టకేలకు అరెస్ట్ చేసి జైలుకి తరలించారు. వాడికి జైలులో రాజభోగాలందుతున్న వార్తలు కొన్ని ఛానళ్ళలో. మూడునెలలు గడిచినా, వాడు బెయిల్ కోరలేదు, జైలులో ఉండటమే సురక్షితమని అనుకున్నాడో ఏమోమరి! "ఫాస్ట్‌కోర్టులో", భరత్ మీద కేసు నత్తనడకనే సాగుతోంది. చాలామందికి తెలియని విషయం, నాకు సాహస్ ఒకరోజు చెప్పాడు – అసలు పోలీస్ డిపార్ట్‌మెంట్ నామమాత్రంగా ఫైల్ చేసిన ఛార్జ్‌షీట్‌లో రేప్‌కి సంబంధించిన, సజీవ దహనానికి సంబంధించిన ఏ నేరారోపణలూ లేనేలేవనీ! అందుకు సంబంధించిన తగు సాక్ష్యాధారాలు దొరికితేనే, భరత్‌కి వ్యతిరేకంగా మరో అనుబంధ ఛార్జ్‌షీట్ వేయాలన్నది పోలీసుల అభిప్రాయమట!

"నువ్వన్ని సాహసాలు" చేసి వాడికి వ్యతిరేకంగా కొన్నైనా సాక్ష్యాలు సంపాదించి జైల్లో పెట్టించగలిగావు కదా! అత్యాచారానికి సంబంధించిన నిజాలు, సాక్ష్యాలు ఎప్పటికైనా బయటికొస్తాయిలే – వాడికి తగిన శిక్షపడుతుందిలే. కేవలం సముదాయించాలనే అన్నాను. దానికతను; "నాకా నమ్మకం లేదు మేస్టారూ – ఏదో ''దుస్సాహసం'' తప్పదేమో అని గొణిగి మౌనంగా ఉండిపోయాడు. ఆ పదం, "దుస్సాహసం" అనేది, పదేపదే వాడుతాడు గాబట్టి పెద్దగా పట్టించుకోలేదు నేను! తర్వాత కొన్నిరోజులే గడిచాయి. జిల్లాపోలీస్ అధికారి అధికారిక ప్రకటనొకటి జారీ చేశాడు "ప్రజల సమాచారం కోసం" "ఒకరోజున ఒకవ్యక్తి భరత్‌కి మిత్రుడినని చెప్పి అతడిని ''మిలాఖత్'' సమయంలో

కలుసుకోవటానికి అనుమతి పొందాడు. కలుసుకున్న వెంటనే పోలీసుల కన్నుగప్పి తన జేబులో దాచి తెచ్చుకున్న ఒకనాటు "పిస్తోలు"తో భరత్‌ని అతి దగ్గరనుంచి కాల్చి చంపేశాడు – భరత్ స్పాట్‌లో చచ్చిపోయాడని, జైలు వైద్యుడు తర్వాత ధృవీకరించాడు. హంతకుడిని అదుపులోకి తీసుకుని తనుచేసిన దానికి కారణాలు చెప్పమని ఎంత అడిగినా ఏమీ చెప్పటం లేదు. ఎందుకోసం హత్య చేశాడో తెలియటం లేదు – కాని అతను పూర్తిగా మతిస్థిమితం లేనివాడిగా కనపడుతున్నాడు – నిందితుడిని కోర్టులో హాజరు పరుస్తాం" ఇదీ ఆ ప్రకటన. ఆఖర్లో, "నిందితు"ని పేరు "సాహస్" అని కూడా పేర్కొన్నారు!!!

అందరూ సంతోషించారు – "భలేపని చేశాడులే" అన్నారు. పేరుకి తగ్గట్లే చాలా గొప్ప సాహసం చేశాడు అని మా ఆవిడ కూడా అన్నది. "ప్రజ్ఞకి న్యాయం కోసం" ఈ "దుస్సాహసం" సాహస్ చేశాడని నాతోపాటు ఇంకా ఎందరికి అర్థమైందో తెలియదుగాని, నాకైతే ఆ పని చేయటంలో అతనికి పోలీసుల సహకారం కూడా లభించి ఉంటుందని, వాళ్ళు సాహస్‌పై ఛార్జ్‌షీట్ ఫైలు చేసినప్పుడు మతిస్థిమితంలేని మనిషి చేసిన హత్య ఇది కాబట్టి పెద్ద శిక్ష వేయనవసరం లేదని కోర్టుకి నివేదిస్తారని అనిపిస్తోంది. చూడాలి అతని "దుస్సాహసాని"కి ఏం ఫలితం దక్కుతుందో మరి!!

రచనకాలం – 2015.

# మిత్ర వియ్యం

ఆఫీసైపోయాక, బస్సులో ఇంటికి వెళ్తూ, "ఇంటికి వెళ్ళిన తర్వాత మాత్రమే చదువుకోవాలిసుమా, మీ శ్రీమతితో కూడా సంప్రదించి, నీ నిర్ణయం సోమవారం, మళ్ళీ మనం "ఆఫీసు"లో కలుసుకున్నప్పుడు, చెబుదువు గానీలే అవసరమైతే, మరి కొన్ని రోజులు తీసుకున్నా పర్వాలేదనుకో"– అంటూ ఒక"లేఖ" నా జేబులో కుక్కేసి హడావిడిగా తన బస్టాపు" వైపు వెళ్లిపోయిన, నా సహోద్యోగి, "సుబ్రహ్మణ్యం" గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఒకమంచి మిత్రునికి నిర్వచనం చెప్పాలంటే "సుబ్రహ్మణ్యం" గురించే చెప్పాలి!! అంతకుముందు, ఏ మాత్రం పరిచయం లేని నన్ను తను ఉద్యోగంలో చేరిన ఒకసంవత్సరం తర్వాత అదే కంపెనీలో సమానస్థాయిలో చేరిన నన్ను అనతి కాలంలోనే, "ఆప్త మిత్రుణ్ణి" చేసుకున్నాడు. తొలి రోజుల్లోపని నేర్పటమే కాదు, ఎవరితో ఎలా మెలగాలో కూడా బోధించాడు. నా కన్న కేవలం ఒక్క ఏడాదే పెద్దవాడైనప్పటికీ, నా జీవన గమనంలో ఆర్థిక సామాజిక వ్యవహారాల్లో మార్గదర్శనం చేస్తూనే ఉన్నాడు. 'కంపెనీ'లో ఇద్దరికీ ఒకేసారి పదోన్నతులు వచ్చేయి. అలాగే, "ఒకింటివాళ్లం", స్వంత ఇళ్ళు ఏర్పరుచుకోవటం లాంటివి కూడా కొంచెం అటూ ఇటూగా ఒకేసారి జరిగేయి, యాదృచ్ఛికంగానే కావొచ్చుగాని–ఇన్నేళ్ళుగా, అన్ని విషయాల్లోనూ సమ ఉజ్జీలుగానే, ఆప్త మిత్రులుగానే ఉంటున్నాం. వేర్వేరు కులాల వాళ్లమన్న"భేదభావం" మా మధ్య ఎప్పుడూ తలెత్తలేదు. సుబ్రహ్మణ్యానికి గాని అతని కుటుంబానికిగాని, నేను ప్రత్యేకంగా, వ్యక్తిగతంగా సహాయం చేసిన సందర్భాలు పెద్దగా లేవు. అయితే సుబ్రహ్మణ్యం, నన్ను ఆప్తునిగా ఆదుకున్నవి మాత్రం కోకొల్లలు.

ఉదాహరణకి, నేను ఊళ్ళో లేనప్పుడు నా ఏకైక కుమారుడికి, ఏదో పెద్ద ప్రమాదం జరిగితే అన్నీ తానే అయి, హాస్పిటల్‌లో చేర్పించటం మాత్రమేకాదు. అత్యవసర చికిత్సలో భాగంగా, స్వయంగా "రక్తదానం" చేసి మా వాడిప్రాణాలు కాపాడేడు. ఇంకోసారి, కంపెనీలో కొందరు నన్ను కుట్రపూరితంగా ఎందులోనో ఇరికించినప్పుడు, తన తెలివి తేటలు, ఉన్నతాధికారులతో తనకున్న "పలుకుబడి"

అంతా ఉపయోగించి పోరాడి, నా ఉద్యోగాన్ని, పరువుని రక్షించాడు. అతని రుణం తీర్చుకోవడానికి తగిన అవకాశం ఇంత వరకు నాకు రాకపోవడం నిజంగా నా దురదృష్టం. మరో విషయం, ఎందుకనో మా ఇద్దరి శ్రీమతులు మధ్య ఎక్కువ సాన్నిహిత్యం ఏర్పడలేదు, ఇన్నేళ్ళుగా! ఇలా ఎడతెగని, ఆలోచనల్లో ఉండగానే, నేనెక్కిన బస్సు ఆఖరి స్టాపు కూడా వచ్చేసింది. నేను దిగాల్సింది, దానికి ముందు స్టాప్–బస్సు దిగి, ఉసూరుమంటూ, వెనక్కి మా ఇంటి వైపు నడిచేను. దార్లో ఉన్న ఒకపార్కులో కూర్చుని "సుబ్రహ్మణ్యం ఇచ్చిన లేఖ, చదువుదామని ఒక్క క్షణం అనిపించినా, వెంటనే, 'వద్దులే' అనుకున్నాను. ఇంటికి వచ్చేక, శ్రీమతి చేతి కాఫీ కోసం వేచి ఉండకుండా, లోపలి గదిలోకి వెళ్లి, జేబులోంచి తీసిన ఉత్తరాన్ని కుర్చీలో కూర్చుని, ఏకాగ్రతతో చదవటం ఆరంభించాను. 'ఏకాంతంగా చదువుతున్నానని అనుకున్నాను, నాతోపాటు లోపలికి వచ్చి, వెనకనే నిలబడినా శ్రీమతి "కాంతం" కూడాఆలేఖ సాంతం నాతోపాటు చదువుతోందని గ్రహించకుండా! ఇంతకీ, ఆ చిన్న లేఖలో ఏముందంటే.....

"ప్రియమిత్రమా, ముఖాముఖి, అడగలేక, వ్రాత మూలకంగా అభ్యర్థిస్తున్నందుకు క్షమించు. నాకు పదిలక్షల రూపాయలు చేబదులు ఇవ్వగలవా? నా ఏకైక కుమార్తెకు సంబంధం కుదిరేలా ఉంది. వాళ్ళు "కట్నం" బాగా ఆశిస్తున్నారు. అందుకే అంత పెద్ద మొత్తం "అప్పు" తీసుకోవాల్సి వస్తోంది. నీ నిర్ణయం ఏదైనా పర్వాలేదు. స్వయంగా చెప్పలేకపోతే, ఇలాగే ఓ చిన్న ఉత్తరం ద్వారా చెప్పవచ్చు. నీ నిర్ణయం ఏదైనా, మన స్నేహానికి భంగం కలుగదు.

ఆ ఉత్తరం మళ్ళీ మళ్ళీ చదువుతుంటే" ఎన్ని సార్లు చదివినా "విషయం" అదేగా" అని విసుక్కుంటూనే నా చేతిలోని ఉత్తరాన్ని లాక్కొని, మళ్లీ, చదివింది శ్రీమతి కాంతం. "పది లక్షలంటే మాటలా? 'మా దగ్గరలేదు అంత పెద్ద మొత్తంలేదని లౌక్యంగా చెప్పేస్తేపోలా? ఆయనైనా ఎలా తీర్చగలడు? తగిన సంబంధం వేరేది చూసుకోమని' చెప్పండి అని దృఢంగా అంది.

"సొమ్ము లేదని చెప్పటం కుదరదు. ఉద్యోగంలో చేరినప్పట్నుంచీ, అతని సలహా ప్రకారమే, కడుతూ వచ్చిన "ఎల్.ఐ.సి. పాలసీ" తాలూకు డబ్బు పన్నెండు

లక్షలు వచ్చేవారం నాకు రాబోతుందని అతనికి తెలుసు. క్లైమ్ ఫారమ్ మీద తనే సాక్షిసంతకం చేశాడు కాబట్టి. ఉత్తరంలో స్పష్టంగా రాయలేదులేగాని, తీర్చగలనన్న విశ్వాసంతోనే, "అప్పు" అడుగుతున్నాడు. ఎందుకంటే, ఊళ్లో అతనికి కొంత మాగాణి భూమి ఉంది. అమ్మితే, బాగానే డబ్బు వస్తుంది. కొంత సమయం పట్టొచ్చేమోగాని అని, అంతటితో ఆగకుండా "అవసరానికి ఆదుకోవటం నాకు మిత్రధర్మం" అన్నాను. అన్నానే గాని ఆ మాటలు నోట్లోంచి మాత్రమే గాని హృదయం లోతుల్లోంచి రాలేదని నాకే అర్థమవుతోంది! పదిలక్షలంటే మామూలు మొత్తం కాదు కదా మరి! శ్రీమతి మండిపోయింది. "మీ మొహం! దీన్ని"మిత్రధర్మం" అనరాదు. "మిత్రసంకటం" అనాలి. "ఇదిగో, ఇప్పుడే చెబుతున్నా పదిలక్షలు కాదు కదా పదివేలు కూడాఇవ్వడానికి వీలు లేదు. నా మీదనా కొడుకు మీద ఒట్టు" ఆయన కన్నా బుద్ధుండొద్దా అంత అప్పు అడగడానికి? ఇవ్వొద్దంటే ఇవ్వొద్దు" అని ఖచ్చితంగా చెప్పేసింది. ఆ రోజు మర్నాడు బుసలు కొడుతూనే ఉంది. మా అబ్బాయి కూడా ఎవరో స్నేహితుడి పెళ్ళికి ఇంకో ఊరు వెళ్ళి ఉన్నందున అలాంటి సందర్భాల్లో "రాజీ" చేయడానికి ప్రయత్నించే మూడో వ్యక్తి లేనట్లయిపోయింది.

సోమవారం, ఆఫీసుకువెళ్ళి నా స్థానంలో కూర్చున్నానో లేదో, వాడిపోయిన ముఖంతో వచ్చిన సుబ్రహ్మణ్యం ఎదురుగా కూర్చున్నాడు. ''అది.... మరి.... మరి.... తడబడుతున్న నన్ను వారిస్తూనే అన్నాడు. "నాకు తెలుసు ధర్మరాజూ, నువ్వు "మిత్రధర్మం" తప్పవని ఎంత పెద్ద మొత్తమైె, ఇవ్వడానికి సిద్ధమని చెప్పబోతున్నావని కాని ఈ రోజు ఉదయం మా అమ్మాయి కచ్చితంగా చెప్పేసింది. నేను తెచ్చిన సంబంధం చేసుకోనని, తనెవరినో గాఢంగా ప్రేమిస్తోందంట! రేపో మాపో, మా దగ్గరికి తీసుకొచ్చి పైసా కట్నం వద్దని చెప్పిస్తా "అతగాడూ" మీకు నచ్చుతాడని నమ్మకముందని, కూడా చెప్పింది. అతనెవరో ఇతర వివరాలు మాత్రం ఇంకా చెప్పలేదు. ఏంటో ఈ కాలం పిల్లలు ఒక్కగానొక్క కూతురు నిర్ణయాన్ని కాదనలేను గదా! సరేలే నాకు అంత మొత్తాన్ని ఇవ్వడానికి సిద్ధపడిన నీకు మరోసారి కృతజ్ఞతలు"అనేసి వెళ్ళిపోయాడు.

"సుబ్రహ్మణ్యం" మాటలకి "మిత్ర ధర్మం" పాటించానన్నందుకు, కృతజ్ఞతలు

చెప్పినందుకు, సిగ్గుపడాలో, "మిత్రసంకటం" తప్పినందుకు ఆనందించాలో అర్థం కాలేదు.

సాయంత్రం ఇంటికి వెళ్లేక శ్రీమతితో విషయం చెప్పేను."ఇంతకీ ఆ కుర్రాడెవరో? మీ మిత్రుడి కూతురు ఎలా పట్టిందో ఏమిటో"? అని సాగదీస్తుంటే, వళ్ళుమండినా, ఏమీ అనలేదు తనని, మరీ, నాకూ, ఆత్రంగానే ఉంది కదా, ఆ "యోగ్యుడు" ఎవరో తెలుసుకోవాలని.

రెండు రోజులు గడిచేయి. నేను, మా ఆవిడకాంతం రామాలయం వెనక తోటలో కూర్చుని ఉన్నాం. 'అక్కడికి ఫలానా సమయానికి వచ్చి ఉండండి, నేనూ వస్తాను అని మా అబ్బాయి చెప్పిన ప్రకారం, విషయం ఏమిటో చెప్పకపోయినా– ఇంతలో సుబ్రహ్మణ్యం, తన భార్య సావిత్రితో కలిసి వచ్చి, మమ్మల్ని చూచి ముఖాన నవ్వుపులుముకున్నాడు. నేను ప్రశ్నార్థకంగా చూస్తుంటే, మా అమ్మాయి రమ్మందోయ్! ఏంటో ఈ కాలం పిల్లలు. మాయదారి సస్పెన్స్" ఇంకా ఏదో చెప్పబోయి, ఆగిపోయి నా పక్కనే కూర్చున్నాడు. తప్పనిసరై వాళ్ళావిడ మా ఆవిడపక్కన చేరింది. ఆడవాళ్లిద్దరు మాటలు కలపబోకముందే, ఏదో చప్పుడై నలుగురం అటు చూశాం. చెరో స్కూటర్ మీదవచ్చిన మా అబ్బాయి శేఖర్ వాళ్ళమ్మాయి సత్యవతి, చకచకా మా వైపు వస్తూంటే చూసి విస్తుపోయాం. ఏమీ అర్థం కాలేదు.

వాళ్ళిద్దరూ జంటగా, మా రెండు జంటలకి సాష్టాంగ నమస్కారం చేసి, ఎదురుగా పక్క పక్కనే కూర్చున్నారు. మేం ఒకళ్ళ ముఖాలు ఒకరు చూసుకున్నాం. ఇది మా నలుగురికీ అనూహ్యమైన సంఘటనేనని అర్థమైంది. ముందుగా, సత్యవతి నోరు విప్పింది. "నాన్నా, అమ్మా నేను ప్రేమించిన మహానుభావుడు తనే", మరి అందగాడు కాకపోయినా, కట్నం ఇవ్వక్కర్లేదుకదాని, చాలా వెంటబడితే, కాదనలేక పోయేను" అంది చిలిపిగా.

"నో, నో అదేం కాదు, తనే నా వెంటబడింది. ఏదో నాన్న ఆప్తమిత్రుడి కూతురు కదా నాతో సమానంగా అందం లేకపోయినా, చదువు ఉద్యోగం ఉందిలే అని ఒప్పుకున్నాను" అన్నాడు మా వాడు రోషంగా..

'సమస్య ఎవరు ఎవరి వెంటబడ్డారన్నది కాదు. బహుశ ఇద్దరిలో బాల్యం నుంచీ, పరస్పర ప్రేమాభిమానాలుంటూ వచ్చేయేమో అని విషయాల్లోనూ సమ ఉజ్జీలే. కాని అసలు సమస్య" కుల భేదం" కదా'......

ఇరు వృద్ధ జంటల ఆలోచనలు ఇలా సాగుతున్నాయని గ్రహించాడో ఏమో, మా వాడు శేఖర్ రెచ్చిపోయేడు. అదేదో పాత పౌరాణిక సినిమాలో "ఎన్టీఆర్" "ఏమంటివి ఏమంటివి" తరహాలో సుదీర్ఘంగా డైలాగులు పేల్చేశాడు. ప్రియురాలు ఆరాధనా పూర్వకంగా చూస్తుండగా

"నాకు "రక్తదానం" చేసి ప్రాణభిక్ష పెట్టిన మహానుభావుడి రుణం తీర్చుకోనివ్వండని ముక్తాయించేడు, మా వైపు సజల నేత్రాలతో చూస్తూ. అప్పుడు, సత్యవతి అందుకుంది "ఈ రోజుల్లో కులభేదాలెందుకు? అయినా ఇద్దరివీ వ్యవసాయ కులాలే. మాంసాహారం తినే కులాలే. అత్తగారంత గొప్పగా కాకపోవచ్చు గాని మాంసాహార శాకాహార వంటన్నీ చేయటం అమ్మ నాకు నేర్పింది. సమస్యేమీ ఉండదు. "ఈ మాటలకి మా నలుగురికీ నవ్వు వచ్చింది.

ఇంకా మౌనంగా ఉన్న మమ్మల్ని ఉక్రోషంగా చూస్తూ, "మీరు సమ్మతిస్తేనే, పెళ్ళి చేసుకుంటాం – అలా అని వేరే వాళ్లని చేసుకుంటాం అనుకోవద్దు. బాగా ఆలోచించుకోండి. ఇకమేం వెళ్తాం – ఏదో సినిమాకో పార్కుకో కాదులెండి! ఎవరిళ్లకి వాళ్ళు వెళ్తాం". ఏకకంఠంతో అని ఇద్దరూ వెళ్ళిపోయేరు.

"ఇదంతా నాకేమాత్రం ఇప్పటి వరకు తెలియదు. నన్ను నమ్ము ధర్మరాజూ" అని సుబ్రమ్మణ్యం బేలగా ఉంటుంటే, నా మనసు ద్రవించిపోయింది. "నాకూ తెలియదు, సుబ్రహ్మణ్యం" అని నేనన్నాను.

కొంత సేపైన తర్వాత, మా మధ్యనున్న భయంకర మౌనాన్ని ఛేదిస్తూ "మాకూ ఇష్టమే గాని... మరి, మరి అని మా ఆవిడ ఇంకా ఏదో అనబోతూంటే, కట్నం గురించి "ఏడవబోతోందని", నాకర్థమై గట్టిగా గిల్లి ఆపేను. అప్పుడు సుబ్రహ్మణ్యం భార్య సావిత్రి మాకున్నంతలో పెళ్ళి ఘనంగానే చేస్తాం వదినగారూ మీ హోదాకి తగ్గకుండా" అని ఊరుకోకుండా " అన్నట్లు వాళ్ళ నాన్నమ్మ పోయినప్పుడు వారసత్వంగా వచ్చిన "ఐదెకరాల మాగాణి " మా అమ్మాయి పేరునే

ఉంది. పెళ్లైన నాటి నుంచీ, మీ అమ్మాయే కాబట్టి ఆ పొలం మీద ఆదాయం మీదే అవుతుంది. పిల్లల కిదేమీ చెప్పాల్సిన అవసరం లేదు. కట్నం లేని పెళ్లనే అందరికీ చెబుదాం. అనే సరికి మా ఆవిడ ముఖం వెలిగిపోయింది. "నాకు ఇష్టమే, నీకూ ఇష్టమే" అని సుబ్రహ్మణ్యం నేను ఒకరికొకరు ముమ్మార్లు చెప్పుకున్నాం. ముహూర్తాలు త్వరలో పెట్టుకుందాం అని చెప్పుకుని ఇళ్లకి బయలుదేరాం.

ఇంతకీ నేను అప్పు ఇవ్వకుండా"మిత్ర సంకటం" తప్పించుకున్నానా? సత్యవతిని కోడలుగా చేసుకోవడానికి ఒప్పుకుని "మిత్ర ధర్మం" పాటించానా? ఏమో గాని "మిత్ర వియ్యం" పొందుతున్నాను, అదీ, మా ఆవిడ కాంతం సమ్మతి" సంతృప్తితో బాటు!!!

రచనా కాలం – 2020

మనం నిత్యం చేయవలసిన పనులన్నిటినీ ఒక క్రమపద్ధతిలో రూపొందించు కోవాలి. ఈ ప్రక్రియలోనే మన వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది.



శీలం, వ్యక్తిత్వం వికసించడానికి విద్యాభ్యాసంలో గురుశిష్యుల మధ్య ఎంతో అన్యోన్యత ఉండాలి.



మాన సంబంధాల అభివృద్ధి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది. ఆత్మీయతతో వ్యవహరించడమే మానవ సంబంధాలకు మూలం.



మాటలతో పరిమితిని, చేతలతో అపరిమత సామర్థ్యాన్ని చూపించగలగడమే ఉత్తమ వ్యక్తిత్వ లక్షణం

# "మా లోకం టీవీ రెస్క్యూ ఆపరేషన్"

"మీ, మా, మన, అభిమాన తెల్గు టీవీ ఛానెల్ "మాలోకం" తరపున వీక్షకులందరికీ లక్ష నమస్కారాలు. 'గుడ్ సండే మిడ్ డే' అంటే శుభ ఆదివారం మిట్ట మధ్యాహ్నమండే. మార్నింగ్ నుంచీ అదే పనిగా మీ చెవులు ఊదర గొడుతున్నాం గదా, ఈ రోజు గుడ్‌డే, అదే శుభదినం, మన ఈ ఛానల్ ప్రారంభించి అప్పుడే ముప్పై రోజులైపోయినందువలన, "ప్రథమ మాసికం" అనండి లేదా "ఫస్ట్ మంత్లీ సెలబ్రేషన్స్' అనండి, అందులో భాగంగా ఈ రోజంతా "స్పెషలాతి స్పెషల్" ప్రోగ్రాము లెన్నో ప్రసారం చేసి మిమ్మల్ని ప్రసన్నం చేసుకుంటాం, అలరిస్తాం, అని……"

"మార్నింగ్ వార్నింగ్" న్యూస్ బులెటిన్, తర్వాత 'జిమ్'కి వెళ్లనవసరం లేకుండా, వంటింట్లోగాని, బాత్‌రూమ్‌లోగాని "ఆ యా పనులు" చేసుకుంటూనే, ఎలాంటి ఎక్సర్ సైజులు చేసుకోవచ్చో "సుఖ వ్యాయామం" కార్యక్రమంలో చక్కని చిట్కాలు చెప్పాం. "మనసంత" ప్రోగ్రామ్‌లో కూరగాయల బేరసారాల చిట్కాలు నేర్పాం. "డాన్స్ మామ్మాడాన్స్" లో ఓ ఎనభై ఏళ్ల మహిళ అరంగేట్రం ప్రసారం చేశాం. పదిమంది "పాకే వయసు పాపలతో" ఆరున్నొక్క రాగాల "సంగీతపోటీ" నిర్వహించి, మీ "ఎస్సెమ్మెస్'ల ద్వారా "విజేత బేబి"ని ప్రకటించాం. పదకొండు గంటలకి ఇద్దరు యువనాయకుల మధ్య చర్చా కార్యక్రమం, 'రచ్చ పేరుతో "లైవ్ టెలికాస్ట్ చేశాం. చర్చమధ్యలో వాళ్లు వాగ్వివాదం ముదిరి బాహా బాహీ కొట్టుకుంటుంటే, కట్ చేయకుండా పారదర్శకంగా చూపించాం. వాళ్లిద్దరూ కలిసి, ఇకిలిస్తున్న మా "ఏంకర్" ని కొట్టినప్పుడు మాత్రమే, ఆ 'రచ్చ కార్యక్రమాన్ని' ఆపేసి, కాసేపు బ్రేక్ పాటించాం.

తర్వాత, "తల్లీకూతుళ్లలొల్లి" ధారావాహికలో నాలుగోభాగం ప్రసారం చేశాం. ఇప్పుడు, అనుకోకుండా వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకుని, ఇంతవరకు ఏ ఇతర టీవీ ఛానల్ వాళ్లు చేయలేక పోయిన ఒక మహత్తరమైన ప్రోగ్రామ్‌ని లైవ్‌లో ఔను లైవ్‌లోనే, ప్రసారం చేయబోతున్నాం. ముందుగా షెడ్యూల్ చేయబడిన వాటన్నిటినీ కేన్సిల్ చేసేసి – నిజానికి నేనిప్పుడు "కెమెరా వుమన్ కామాక్షి"తో కలిసి ఆ లైవ్ ప్రోగ్రామ్ చేయడానికే స్టూడియో నుంచి బయటికి వెళ్ళిపోబోతున్నాను

– నమ్మండి మీరెన్నో స్టింగ్ ప్రోగ్రాముల గురించి విని ఉంటారు కాని ఓ పది నిముషాల తర్వాత నుండి ఒక "ఆల్ వుమన్‌టీమ్" ఎంతో సాహసంతో చేయబోతున్న "రెస్క్యూ ఆపరేషన్‌ని "లైవ్"లో. అంటే ప్రత్యక్షప్రసారంలో చూడబోతున్నారు. 'కీప్ వాచింగ్, "మాలోకం" టీవీ ఛానల్ చూస్తూనే ఉండండి. ప్రస్తుతం "కమర్షియల్ బ్రేక్ – బై – బై, ఏంకర్  వాగుడు వాణి" నిష్క్రమించిన పిదప, ఉప్పు ఉన్నటూత్ పేస్టుల గురించి, ట్రూత్ లేని సౌందర్య క్రీముల గురించి, తిండితగ్గించకుండా లావు తగ్గించే మాత్రల గురించి, డిస్కౌంట్ యాత్రల గురించి ప్రకటనల జోరు కొనసాగింది.

"వెల్‌కమ్  ఎగైన్‌టూ "మాలోకం" టీవీ ఛానల్ వ్యూయర్స్ – ఇప్పుడు "వాగుడు వాణి" స్థానంలో మీ ముందుకొచ్చిన వ్యాఖ్యాత "సొల్లుసుబ్బారావ్" హీ హీ హీ వాణి బయటి నుండి చేయబోతున్న లైవ్‌ప్రోగ్రామ్‌ని, నేను స్టూడియోలో ఉండి సమన్వయం చేస్తూ, మీ కందిస్తానన్నమాట. ఆ "ప్రత్యక్షప్రసారం స్టార్ట్ అయ్యే లోగా అదేమిటో దేని గురించో చెప్పే డ్యూటీనాది. అది ఇంత వరకు మీరు కనీ వినీ ఎరగని ఒకగొప్ప సాహసోపేతమైనది. ఓ ముఖాలు చిట్లించుకోకండి. సుత్తి లేకుండా సూటిగా సబ్జక్ట్‌లోకి వచ్చేస్తున్నా, మరి అదేంటంటే, అది చెప్పే ముందు నిజాయితీగా ఒక విషయం చెప్పాలి. ఇది చేపట్టడానికి మాకు స్ఫూర్తి అమెరికాలోని "వెరీ వెరీ స్పెషల్ టీవీ" ఛానల్ వాళ్ళు. వాళ్ళు ఎంతో అన్యోన్యంగా చాక చక్యంగా ఎన్నో "రియాల్టీ షో"లు చేస్తుంటారు. ఈ మధ్యనే ఒక గవర్నర్ గారి అధికారిక నివాసానికి డ్రగ్స్ సప్లయర్స్‌లా వెళ్ళి రహస్య కెమేరాలతో ఆయన, సిబ్బందిలోని వందమంది ఆడామగా భేదం లేకుండా, "నిషేధిత డ్రగ్స్" సేవించటం ఆపైన విచ్చల విడిగా ఆటా, పాటా, మాటా చేయటం చిత్రీకరించి, అంతా లైవ్‌లోనే అంటే అప్పటికప్పుడే ప్రత్యక్షప్రసారం చేసి ప్రపంచానికి వినోదం విస్మయం కలిగించారు.

"టాకింగ్" అనే వ్యాఖ్యాత స్టూడియోలో ఉండి ఆ ప్రత్యక్షప్రసారాన్నంతా రక్తి కట్టించాడు. "స్పాట్‌లో ఉన్న మరో వ్యాఖ్యాత "స్పీకింగ్" చక్కగా అందర్నీ అలరించాడు. వ్యాఖ్యాతలిద్దరికీ ఎన్నో అవార్డులొచ్చాయనుకోండి. ఇంతకీ చెప్పొచ్చేదేమంటే ఆ కార్యక్రమానికి ధీటుగా  ఒక "స్టింగ్ ఆపరేషన్‌ని" నిర్వహించే అవకాశం మీ ప్రియమైన ఛానల్‌కి వచ్చిందన్నమాట ఇప్పుడు. అదేంటంటే మనకు

స్వతంత్రం వచ్చి సుమారు డెబ్బై ఏళ్లయింది. ఇండియన్‌పీనల్ కోడ్‌కి ఎన్నో సవరణలు చేసుకున్నాం. మహిళలను వరకట్న వేధింపుల నుండి, ఇతరత్రా కష్టాలనుండి'గృహ' హింస నుండి రక్షించడానికి ఎన్నో చట్టాలు చేసుకున్నాం. కానీ మన గృహిణులకు "గృహ హింస తగ్గిందా? కోడళ్లకు ఆరళ్ళు తగ్గాయా? మన రెండు తెలుగు రాష్ట్రాలలోనైనా పరిస్థితి ఏమైనా కొంచెం మెరుగ్గా ఉందా? లేదు కదా! ఇందుకు నిదర్శనమే ఒకగంట క్రితం మన ఛానల్ డైరెక్టర్ గారు "సంచలనారావు" గారికి వచ్చిన ఒక సమాచారం అదేమిటో వారి ఆదేశాలు మేరకు, మేం తలబెట్టిన 'రెస్క్యూఆపరేషన్' ఏమిటో చెప్పటానికి ఇప్పుడదే పనిలో ఉన్న "వాగుడువాణి"ని చేరుకుందాం. కనెక్టవుదాం సరేనా".........

"హలో – హలో వాణీ వినిపిస్తోందా. మన మాలోకం ఛానల్ వీక్షకులంతా ఎంతో ఉత్కంఠంగా, నిజం చెప్పాలంటే విసుగ్గా ఎదురుచూస్తున్నారు. "రెస్క్యూ ఆపరేషన్" పూర్వాపరాలు, ప్రొగ్రెస్ నీతోనే వాగించాలని, సారీ చెప్పించాలని, నేనేమీ చెప్పలేదు మరి నువ్వే చెప్పు వివరంగా ఇంతకూ ఎక్కుడున్నావ్'? స్పాట్‌కి చేరుకున్నావా?"

"మా లోకం ఛానల్ వీక్షకులకి ఈ ప్రత్యక్ష ప్రసారానికి స్వాగతం సుస్వాగతం. ఈ కార్యక్రమానికి మా డైరెక్టర్ సంచలనారావుగారు బాగా ఆలోచించి విజ్ఞతతో పెట్టిన పేరు. "ప్రమాదంలో ప్రమద" నిజానికిది స్టింగ్ ఆపరేషన్‌కాదు. ఎంతో రిస్కుతో కూడిన "రెస్క్యూ ఆపరేషన్" తెలుగులో చెప్పాలంటే ఒక అభాగ్య మహిళను కాపాడే కార్యక్రమం. దీన్ని మా ఛానల్" ప్రథమ మాసికం"లో భాగంగా చేసే అవకాశం రావటం, అందులో నేను అంటే వాగుడు వాణి, వ్యాఖ్యాతగా, కామాక్షి "కెమెరా వుమన్" గా పాల్గొనటం చాలా అదృష్టంగా భావిస్తున్నాం. ఇంతకీ ఈ అవకాశం తెచ్చింది మా డైరెక్టర్ గారి కొచ్చిన ఒక"ఎస్సెమ్మెస్. ఒక ఆపదలో ఉన్న "ఓ ఆడకూతురు" ఫోను ద్వారా పంపిన సంక్షిప్త సందేశం. ఆ మెసేజ్‌లో ఏముందంటే, తనని, మూడు ముళ్ళు వేసిన మొగుడు, ఆరవై లక్షలు తీసుకున్నా ఇంకా కట్న దాహం తీరని అత్త మామలు, అరలక్ష ఇంకా ఇతర లాంఛనాలు బాగానే ముట్టినా తృప్తి లేని ఆడబడుచు, ఇన్నాళ్లుగా వేధించి, సాధించి, అంతిమంగా గత 48 గంటలుగా ఇంట్లోనే ఒకచీకటి గదిలో తాళ్లతో కట్టేసి బంధించి ఉంచారని, తిండి పెట్టకుండా తిప్పలు పెడుతున్నారని, "ప్రమాదంలో ఉన్న ఈ

ప్రమదను" ఏదో విధంగా రక్షించాలని అతి దీనంగా కోరింది. మా డైరక్టర్ సంచలనారావుగారు చలించి పోయారు. ఈ 'రెస్క్యూ ఆపరేషన్"కి పథకం రచించి, సమర్ధవంతంగా అమలు చేయడానికి నన్ను కెమెరావుమన్ కామాక్షిని ఎంపికచేశారు. వారి నమ్మకాన్ని వమ్ము చేయం. మా డైరెక్టర్‌గారు, సామాజిక స్పృహతో మానవతా భావంతో మాకుఈ పనిని అప్పచెప్పటంతో బాటు, చట్టాన్నిచేతుల్లోకి తీసుకోవడం ఇష్టం లేక పోలీస్ డిపార్ట్‌మెంటుని కూడా ఇన్‌వాల్వ్ చేశారు, ఎంతో దూరదృష్టితో రహస్యంగా విషయం చెప్పిన తర్వాత, జిల్లా ఎస్పీ సుమతి హెగ్డే ఐ.పీ.యస్ గారు ఈ "ప్రమాదంలో ప్రమద"ను రక్షించే కార్యక్రమంలో స్వయంగా పాల్గొనడానికి అంగీకరించారు.

"ఓ గుడ్ – మీరు పోలీస్‌లు కలిసేవెళ్తున్నారా? ఇప్పుడెక్కడున్నావు? "ప్రమాదంలో ప్రమద సేఫ్టీ దృష్ట్యా మేం ఎక్కడున్నామో, ఎప్పటికి "స్పాట్"కి చేరుకుంటామో చెప్పకూడదు సుబ్రావ్!. మేం ఇప్పుడు పోలీస్ జీప్‌లోనే ఎస్పీగారితో కలిసే స్పాట్‌కి వెళ్తున్నాం. మేడమ్‌తో మాట్లాడిస్తా".

"మాకూ, తెల్గూ మంచిగ వస్తాయి. చాలా హేపీ. ఇది మనకీకొత్త కాదు. లాస్ట్‌మంత్ ఒకత్రీస్టార్ హెూటల్ రైడ్‌చేశాం. టెన్‌వుమెన్‌ని, బ్రోతల్ ఏక్ట్ కింద అరెస్ట్ చేశాం. ఇప్పుడూ ఈ "డే మ్సెల్ ఇన్‌డిస్ట్రెస్" నీ డీల్ చేస్తా ఓకే" మేడమ్ చెప్పింది నిజమే. ఆమెకు "రెస్క్యూ ఆపరేషన్‌లు కొత్త కాదు. కాదంటే ఆ సంఘటనలో అభాగ్య మహిళలనే అరెస్ట్ చేశారు గాని రాజకీయ వత్తిళ్లతో మగ విటులని వదిలేశారన్న విమర్శ వచ్చింది. అదలా ఉంచి సుబ్రావ్ పారదర్శకంగా ఉండాలన్నది మన "మాలోకం" ఛానల్ ధ్యేయం కాబట్టి మన వీక్షకులతో ఈ ప్రత్యక్షప్రసారంలో నా భావాలని పంచు కోవాలనిపిస్తోంది. ఇంతధైర్యంగా అఫ్‌కోర్స్ సాయుధ పోలీసులతో కలిసి ఈ "ప్రమాదంలో ప్రమదను" కాపాడే కార్యక్రమంలో పాలు పంచుకుంటున్నందుకు నాకు గర్వంగానే ఉంది గాని, మేం అక్కడికి వెళ్లేలోగానే ఆ దుర్మార్గులకు ఉప్పంది ఆ అమ్మాయిని ఇంకెక్కడికైనా తీసుకుపోతారేమోనని భయంగా కూడాఉంది. ఏమో మేం వెళ్లేటప్పటికే తను ఆత్మహత్య చేసేసుకుంటే లేదావాళ్ళే కిరసనాయిల్ పోసి తగల బెట్టేస్తే – తలచుకుంటేనే తల తిరిగి పోతోంది. నాకుకాస్త "బ్రేక్ కావాలి. స్పాట్‌కి చేరుకున్నాక మళ్ళీ లైన్‌లోకి వస్తాను. బై సుబ్రావ్ ఓవర్‌టు మాలోకం టీవీ స్టూడియో, వాగుడువాణి విత్ కెమెరా వుమెన్ కామాక్షి.

"విన్నారు కదా. మేం ఎంత సాహసోపేతమైన "రెస్క్యూఆపరేషన్" చేసపట్టామో? వాగుడు వాణి ఎంత తల్లడిల్లిపోతోందో అర్థమైంది కదా. తను "స్పాట్"కి చేరుకుని మళ్లీ లైన్ లోకి వచ్చే వరకు, ఈ సస్పెన్స్ సంగీతం వింటూ ఉండండి. ఈ బ్రేక్‌లో ప్రసారం చేయడానికి ఏ ప్రకటనలూ లేవు మరి! మీతో పాటు నాకూ నరాలు తెగిపోతున్నాయి. "ప్రమాదంలో ప్రమదను" రక్షించగలమా లేదా అని.......

"ఓ వాణీ స్పాట్‌కి చేరుకున్నారన్నమాట. స్టూడియోలో ఉన్నమన స్టాఫ్ అందరూ, ఈ ప్రత్యక్ష ప్రసారాన్ని చూస్తున్న జనాలంతా మీ ఆపరేషన్ సక్సెస్ కావాలని కోరుకుంటున్నాం. ఊ చెప్పు, ఏం జరుగుతోంది."? "సుబ్రావ్‌స్పాట్‌కి చేరుకున్నాం. ఎస్పీమేడమ్ జీపులోంచి దూకి 'పొజిషన్" తీసుకున్నారు. ఇంకో ముగ్గురు సాయుధ పురుష పోలీసులు మాకు తోడుగా ఉన్నారు. కామాక్షీ కేమెరా బిల్డింగ్‌కి ఫోకస్ చెయ్ – ఓ అందరూ చూస్తున్నారుగా. రెండంతస్థుల భవనం. సంపన్నులుండేదిలానే ఉంది. లోపల మనుషుల అలికిడి ఉంది. కాదంటే ముఖ ద్వారం మూసే ఉంది. "ఎస్పీ మేడమ్" దీర్ఘాలోచనలో ఉన్నారు. "తలుపులు పగల గొట్టి లోపలికి చొరబడాలా లేక మర్యాదగా కాలింగ్ బెల్ నొక్కాలా' అని. రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవాలి దుర్మార్గుల్ని ఎలాగైనా. "ఓ మీకు కనబడుతోంది కదా. ఎవరో ఒకముప్పై ఏళ్లమహిళ తలుపు తీసి చిరునవ్వులు చిందిస్తూ బొకేలతో మాకు స్వాగతం పలుకుతోంది. తను, పట్టు చీరకట్టుకుని చాలా అందంగా ఉంది. కాదంటే, మేచింగ్ సెన్స్ తక్కువనుకుంటాను. ఆకుపచ్చ చీర మీద ఎర్ర బ్లౌజ్ అంతా గందర గోళంగా ఉంది. ఏమీ అర్థం కావటం లేదు. పోలీసులని చూసీ భయపడటం లేదు. ఆమె మా వైపే వస్తోంది. తనతోనే మాట్లాడిస్తా ఓకే.

"ఓ ఆవిడే నా దగ్గరి మైకులాక్కుని లోపలికి దారి తీస్తోంది. ఏం చేస్తాం మా టీమంతా లోపలికి వెళ్తున్నాం." "మా లోకంటీమ్‌కి స్వాగతం. సుస్వాగతం. ఇదిగో పసుపు పట్టు చీరలో మహాలక్ష్మిలా ఉందే ఈ విడపేరు మహాలక్ష్మి. నాకుమేనత్త అత్త కూడా. ధర్మరాజులా గంభీరంగా ఉన్నారే. ఈయన మా మేనమామ, మామ కూడా, మా ఆయనైతే ఇప్పుడు వంటింట్లోఉన్నాడు. నన్నెప్పుడూ ఏ పనీ చేయనీయకుండా అపురూపంగా చూసుకుంటాడు. ఇకపోతే, మా అత్త మహాలక్ష్మి సుబ్బలక్ష్మి కన్న బాగా త్యాగరాజ కీర్తనలు పాడుతుందండీ. మామ ఆశువుగా

వచన గీతాలు  గడగడా అల్లేస్తారు. మీరు లైవ్‌లో అదే ప్రత్యక్ష ప్రసారంలో అత్త కీర్తనలని, మామ కవితలని రికార్డ్ చేయండి. తీసుకోండి, ప్లీజ్. నా భరతనాట్యం కూడా చూపించాలనుకుంటే కూడా అభ్యంతరం లేదు. క్షణంలో కాళ్లకి గజ్జెలు వేసుకొని వచ్చేస్తా. అన్నట్లు మా ఆయన 'దిబ్బరొట్టి' ఎలా చేయాలో చూపించగలడు ప్రత్యక్షంగా రికార్టింగ్‌కి అన్నీ అమర్చుకోండి. కష్టపడివచ్చేరు. ఈ అవకాశం రావటం మా ఇంటిల్లపాది అదృష్టం. మీరూ మీ 'ట్రిప్' వేస్టుచేసుకోవద్దు.

"ఏంటలా స్తంభాల్లా ఉండిపోయారు? 'రాంగ్ ఎడ్రస్‌కి' వచ్చే మనుకోవద్దు. మీ డైరక్టర్ గారికి మెసేజ్ ఇచ్చిన "ప్రమాదంలో ప్రమద"ని నేనే! అఫ్‌కోర్స్, నా పేరు ప్రమద కాని నాకే ప్రమాదం రాలేదు. మా అత్త మామలు నన్ను తల్లితండ్రుల్లా చూసుకుంటున్నారు. మా ఆయన ఎంతో మంచోడు. తనే వంట చేస్తాడు. మా అత్త మామలకి టీవీలో కనపడాలని తమ ప్రావీణ్యం రెండు తెలుగు రాష్ట్రాల ప్రజలందరికి చూపించాలని ఎంతో తహ తహ. మేం ఎంత ప్రయత్నించినా అవకాశాలు రాలేదు. కాబట్టి వాళ్ల కోరిక తీర్చాలని మీ డైరెక్టర్ గారికి అలా 'దొంగ మెసేజ్' పెట్టాను. ఆయన స్పందించి, మిమ్మల్నిలా పంపేరు. ఇదంతా ఎలానూ ప్రత్యక్ష ప్రసార మవుతోంది కదా అత్తమామల కీర్తనలుని, కవితలను రికార్డ్‌చేయండి. కాదన్నారో, మా చుట్టు పక్కల వాళ్ళకి ముందే చెప్పి ఉంచాను. "నేను గాని ఈల వేస్తే" వెంటనే వచ్చేయమని, గొడవ చేయమని ఈల వేయమంటారా?" ఏం సమాధానం చెప్పాలో తెలియని వ్యాఖ్యాత వాగుడు వాణి నోరు మూగబోయింది. కెమెరా వుమన్ కామాక్షి కాస్త తెలివైంది. కాబట్టి కాసేపటికి తేరుకుని కెమెరా "ఆఫ్  చేసేసింది. మాలోకం ఛానెల్‌లో "ప్రమాదంలో ప్రమద" ప్రత్యక్షప్రసారం కట్   అయిపోయింది.

(ఇది సరదాగా రాసిన కథేగాని టీవీ ప్రత్యక్షప్రసారాల మీదవ్యాఖ్యాతల మీద స్టింగ్ ఆపరేషన్‌ల మీదఏదో దురభిప్రాయాలతో మాత్రం కాదని గ్రహించ ప్రార్థన)

రచన కాలం - 2018

# "దూర దృశ్య సమావేశంలో 'కరోనా' కథలు"

"ఒకటి.... రెండు.... మూడు.... ఇప్పుడు సమయం ... భారతదేశం హైద్రాబాద్‌లో సెప్టెంబర్ ఒకటి ఇరవై ఇరవై నాటి సాయంత్రం – ఆరు గంటలు, – జంబూద్వీపే, భరత ఖండే, శార్వరినామ సంవత్సరం భాద్రపదమాసం – తిథి చతుర్దశి – ఇంకా సరిగ్గా చెప్పాలంటే "కోవిడ్‌నామ సంవత్సరం" "అన్ లాక్‌డౌన్ వన్ నేను.... మీ స్క్రీన్ మీద పేరు కనపడుతోందిగదా.... "పరమేశ్వరరావు'ని .... "విదేశీయాప్, "జూమ్", ఉపయోగించటం ఇష్టంలేక, "భారతీయం"గా "టెలిగ్రామ్ యాప్" ద్వారా జరుగుతున్న ఈ వర్చువల్ మీటింగ్‌ని తెలుగులో సుదూర దృశ్యసమావేశం అందామా – విభిన్న దూర, సుదూర ప్రాంతాల నుండి పాల్గొంటున్న నా మిత్రులకి వారి కుటుంబ సభ్యులకి, స్వాగతం – ఇది రజతోత్సవ సమావేశం" గత ఇరవై ఐదు సంవత్సరాలుగా తప్పనిసరిగా ప్రతీ ఏడూ ఇదేరోజున, అంటే సెప్టెంబర్ 1న జరుగుతున్న ఆత్మీయ సమావేశం – ఏటా జరుగుతున్నట్లుగానే, గాని, మరింత విస్తృత స్థాయిలో, భౌతికంగా దగ్గర దగ్గరగా కూర్చుని, అరమరికలు లేకుండా ఎన్నో విషయాలు పరస్పరం చెప్పుకుంటూ అనుభూతులు పంచుకుంటూ, చాలా ఆర్భాటంగా హైద్రాబాద్‌లో ఒకపెద్ద హోటల్ సమావేశ మందిరంలో జరుపు కోవాల్సిన ఈ "సిల్వర్ జూబిలీ" సమావేశం, ఇలా, లాప్‌టాప్‌ల, సాయంతో కృత్రిమంగా జరుపుకోవాల్సి రావటానికి కారణమైన "కరోనా"ని ఎంతైనా నిందించాలి.

కనీసం ఈరకంగానైనా, జరుపుకో గల్గుతున్నందుకు దోహదపడిన సాంకేతిక పరిజ్ఞానాన్ని మాత్రం మెచ్చుకోవాలి. ఈ సంవత్సరపు సమావేశంలో, కొంత మంది నూతన కుటుంబ సభ్యులు మొదటి సారిగా పాల్గొంటున్నారు కాబట్టి, దాని పూర్వోత్తరాల గురించి కొంత క్లుప్తంగానైనా చెప్పాల్సిన అవసరముందని భావిస్తున్నాను. నాతో సహా మేం ఐదుగురు, 1992–95లో విజయవాడలో ఒకే కాలేజీలో, ఒకే హాస్టల్‌లో ఉంటూ డిగ్రీ చదువు పూర్తి చేసుకున్నాం. ప్రాణమిత్రులుగా ఉండేవాళ్ళం. నా పేరు పరమేశ్వరరావు కదా– రెండో వాడు "ఈశ్వరరావు" మూడోవాడు, "ముక్కంటి" నాలుగోవాడు "నీలకంఠం", ఇరపోతే ఐదోవాడిదీ "శివ

నామమే" కాదంటే కాస్త భిన్నంగా "గౌరీపతి" –అందుకే మమ్మల్ని కాలేజీలో అందరూ, "పంచ శివులు" అనేవాళ్ళు. అదలా ఉంచి 1995లో, విడిపోయే ముందు, మేం కూడా అందరు ప్రాణస్నేహితుల్లానే, 'బాసలు' చేసుకున్నాం, జీవితాంతం "మంచి మిత్రులుగా, ఉండిపోవాలని, కాదంటే, చిత్రమైన విభిన్న రీతిలోమరప్పుడు, మాకెందుకలా అనిపించిందో, దాని హేతు బద్ధత ఏంటో ఇప్పుడడిగితే చెప్పలేం గాని, సంవత్సరానికొకసారి మాత్రమే సెప్టెంబరు 1న, కలుసుకోవాలని, మధ్యలో ఒక్కసారి కూడా, ఒకరితో ఒకరు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని, ఏ విధమైన సంబంధం సంభాషణ సమాచారం లేకుండా ఉండాలని నిర్ణయించుకున్నాం! ఆ విచిత్ర నిర్ణయాన్ని ఈ పాతిక సంవత్సరాలుగా, ఏవిధమైన తేడా పాడాలు, సడలింపులు లేకుండా పాటిస్తూ వచ్చాం. ప్రతీ సంవత్సరం సెప్టెంబర్ 1 నే కలుసుకుంటూనే ఉన్నాం. ఆ తేదీనే ఎందుకని అని అడుగవద్దు. పరమ రహస్యం. అలా కలుసుకుని, రోజంతా విందు వినోదాలు, ఎడతెగని కబుర్లతో హాయిగా గడిపిన తర్వాత, భారమైన హృదయాలతో విడిపోయే ముందు, వచ్చే ఏడాది, అదేరోజున ఎక్కడ కలుసుకోవాలో నిర్ణయించుకుంటామన్న మాట.

అంతే, సంవత్సరం మధ్యలో, ఒకరితో ఒకరికి, ఉత్తరాల ద్వారా గాని ఫోన్లద్వారా గాని పలకరింపులు కూడా ఉండవు. ఎవరింట్లో పెళ్ళిళ్ళు, చావులు, ప్రసవాలు సంభవించినా, సమాచారం ఉండదు. మొదట్నుంచి, సమావేశ, సమన్వయకర్తగా ఉన్న నాదగ్గర మాత్రమే ఇతర మిత్రులకు సంబంధించిన, చిరునామాలు, ఫోను నంబర్లువంటి కొద్ది పాటి ప్రాధమిక వివరాలు మాత్రం ఉంటాయి. అయినా నేను కూడా నిబంధనలన్నీ పాటించాల్సిందే – ఈ విధంగా 1996 నుండి ఇరవై నాలుగు సార్లు వేర్వేరు చోట్ల కలుసుకున్నాం. మొదటి నాలుగు సంవత్సరాలు మేం ఐదుగురం మాత్రమే పెళ్లాలకు లేనిపోని అనుమానాలు వస్తున్నాయి ఈ మొగుళ్ళు సంవత్సరంలో ఒకరోజు ఎక్కడికి పోతున్నారనే విషయంలో, అని గ్రహించి, ఐదో సంవత్సరం "ధర్మపత్నులను తల్లిదండ్రులను కూడాసమావేశంలో కలుపుకున్నాం. తర్వాత పదో ఏట, తిరుపతిలో మా సంతానాన్ని కలిపాం. పదిహేనో ఏట, మళ్ళీ అలాంటి విస్తృత సమావేశం జరిగింది. ఐదుగురూ కుటుంబ నియంత్రణ పాటించినందున సంఖ్య పెరగలేదు. కాని దురదృష్టవశాత్తు

తగ్గింది, ఆ మధ్యకాలంలో కొందరి పెద్దలు పరమపదించినందున. అలా ఐదేళ్ళ కొకసారి మాత్రమే కుటుంబ సభ్యులో కూడిన విస్తృత సమావేశాలు. మిగిలిన సంవత్సరాలలో మేం ఐదుగురు మాత్రమే విందు వినోదాలలోగాని, ఘనద్రవ పదార్థాల సేవనంలో గాని కుటుంబ సభ్యులు కూడాఉంటే, పాటించాల్సిన పరిమితులు, నియంత్రణలు లేకుండాహాయిగా! ఏది ఏమైనా, ప్రతీ ఏటా మా సమావేశాలు మిశ్రమానుభూతుల్నే ఇస్తూ వచ్చాయి. మధ్యలో మా కుటుంబాల్లో, వ్యక్తిగత జీవితాల్లో ఎన్నోభిన్న విభిన్న సంఘటనలు జరుగుతాయి, వాటన్నిటిని ఎటువంటి అరమరికలు లేకుండా పంచుకుంటాం కాబట్టి, ఈ సిల్వర్ జూబ్లీ సంవత్సరంలో పాల్గొనేవారి సంఖ్యపెరిగింది. కోడళ్లు, అల్లుళ్లరూపంలో ఆ నూతన సభ్యుల కోసమే నేనింత సుధీర్ఘంగా "ఉపోద్ఘాతం" చెప్పాల్సొచ్చిందన్నమాట!

నిరుడు, మా ఐదుగురితో మాత్రమే జరిగిన వార్షికసమావేశంలో 2020, లేదా శార్వరి నామ సంవత్సరంలో, చాలా అట్టహాసంగా జరుపుకుందామనుకున్న ఈ సమావేశం ఇలా ఎక్కడివాళ్లమక్కడే ఉండిపోయి, సాంకేతికంగా, కృత్రిమంగా ఇలా చేసుకోవలసొస్తుందని ఊహించలేదు. "కరోనా అనే మహమ్మారి" ఇలా విశ్వవ్యాప్తంగా అల్ల కల్లోలం సృష్టిస్తుందని అప్పుడు మేం అనుకోలేదు. మేం ఎవరం అప్పటికి "అభిగ్య"జోస్యం వినలేదు. గరుడ పురాణమో, మరేదో దాంట్లో కరోనా ప్రస్తావన ఉందంట కదా, అదీ చదవలేదు. బ్రహ్మం గారి "కాలజ్ఞానం" కూడా చదవలేదు మరి. మరి ఇప్పుడు "లాక్‌డౌన్" లేకున్నా ప్రయాణ సాధనాలు లేవుగా! అసలు ఈ ఏడు సమావేశం కుదరదనే నిరుత్సాహపడితే, మా అల్లుడు "ప్రవీణ్", సాఫ్ట్‌వేర్ నిపుణుడు లెండి, ఇలా "దూర దృశ్యసమావేశం" ఏర్పాటు చేశాడు. మా మిత్రులు ఐదుగురితో సహా, మొత్తం పాతికమంది, ఎవరింట్లోవాళ్లు ఉంటూ పాల్గొంటున్నాం. ముఖ్యసభ్యులైన మా ఐదుగురే మాట్లాడాలనే పరిమితి లేదు. కుటుంబ సభ్యులు ఎవరైనా మాట్లాడొచ్చు. చర్చించొచ్చు. ప్రశ్నించొచ్చు. ఐతే, కోవిడ్‌కి మాత్రమే పరిమితం కావాలి మన చర్చ. సరే ముందుగా మా ఐదో శివుడు "గౌరీపతి" నామధేయుడు మాట్లాడుతాడు. "వాడికీ, వాడిభార్య గౌరికి కరోనా వచ్చి తగ్గిందిలెండి. వినండిమరి.

గౌరీపతి : మీరే, అందరూ న్యాయం చెప్పండి. పరమేశ్వరంగాడు అంతసేపు మాట్లాడేడు. నాకేమో క్లుప్తంగా మాట్లాడాలని సైగ చేస్తున్నాడు. వాడు పైగా నా గురించి "వాగుతాడు" అన్నాడు. తనది గొప్ప "ప్రసంగం" నాది వాగుడా? పోన్లెండి క్షమించేస్తున్నా. నాపేరు, మా ఆవిడపేరు, మా ఇద్దరికీ కరోనా, అదే లెండి కోవిడ్19 పేరు ఏదైతేనేం, వాడిశ్రాద్ధం.... వచ్చి పోయిందని చెప్పేశాడు కదా. అసలు విషయంలోకి వెళ్లేముందు, ఎంతో "యోగ్యుడై"న నా కొడుకు"ముకుందం" గురించి చెప్పాలి. వాడితో ప్రత్యక్షంగా చెప్పలేను. అతను కూడా వాడింట్లో ఉండే ఈ సమావేశంలో పాల్గొంటున్నాడు కాబట్టి మళ్ళీ సగర్వంగా చెబుతున్నా. వాడు బహు యోగ్యుడు. మేమే తల్లితండ్రులమే సరిగా అర్థం చేసుకోలేక పోయాం. వాడు చిన్నప్పట్నుంచీ లోతైన మనిషి, అంతర్ముఖుడు, ఎక్కువ మాట్లాడడు. అనుకున్నదేదో గోప్యంగా చేస్తాడు. గొప్పలు చెప్పుకోడంటే నమ్మండి. కంగారు పడకండి విషయం లోకి వచ్చేస్తున్నా. "కరోనా గురించే ఈ సమావేశమని నాకు తెలుసు. అందరిలానే మేం మా వాడిని బాగా పెంచాం - చదివించాం. చాలా కొందరిలా స్వయం కృషితో మంచి ఉద్యోగం తెచ్చుకున్నాడు. మేం చూసిన పిల్లనే చేసుకున్నాడు. మేం మాట్లాడి, నిర్ణయించిన కట్నం తీసుకోవడానికి "నిరాకరించి" మాకు నిరుత్సాహం కల్గించాడు. ఆకోపంతో మేము పట్నంలో తనతో పాటు ఉండమన్నా"నిరాకరించి" ఊళ్లోనే ఉండిపోయాం. ఊళ్లో పొలాల మీద వచ్చే ఆదాయం మాకు ఇబ్బడి ముబ్బడిగా సరిపోతుంది గాని, తనకు బాగానే జీతం వస్తుంది కాబట్టి అందులోంచి ప్రతీ నెలా కొంత సొమ్ము ఇస్తే బాగుంటుందని "ఆశించాం". పరోక్షంగా సూచించాం కూడా. వాడు విని ఊరుకున్నాడంతే. పంపలేదు. మేం కూడా పైకి మామూలుగానే ఉన్నా లోలోపల బాధపడేవాళ్లం. ఒకరోజు కోడలు 'వరలక్ష్మీ వ్రతం చేసుకుంటున్నాను, రమ్మంటే' కొంత అయిష్టంగానే పట్టణానికి వెళ్లాం. 'వ్రతం చేసుకున్న కోడలు కొంత నయం ఇద్దరికీమంచి బట్టలే పెట్టింది. కొడుకుకే, మనకుపైసా అన్నా ఇవ్వాలనుండదు' అని ఆ రాత్రి మా గదిలో 'ముసలి దంపతులు "గుసగుస లాడుకున్నాం. మాదెంత తప్పుడు ఆలోచనో, త్వరలోనే జ్ఞానోదయమైంది. అదెలా అంటే, మర్నాటికే ఇద్దరికీ, ఒకేసారి విపరీతమైన జ్వరం, దగ్గు, వళ్లునొప్పులు వచ్చాయి. ఆఫీసుకి వెళ్లటం మానేసి, మా వాడు ఒకపెద్ద హాస్పిటల్‌కి

తీసుకుని వెళ్లాడు. వాళ్లు సాయంత్రానికల్లా మా కొచ్చింది “కరోనా” అని తేల్చి, ఐ.సీ.యూలో చేర్చాలి చెరో రెండు లక్షలు అడ్వాన్సు కట్టాలి అని చెప్పేరు. నాతో ఏం మాట్లాడకుండా వెళ్లిపోయి, పదినిమిషాల్లో తిరిగొచ్చేసి మావాడు హాస్పిటల్‌కి డబ్బు కట్టేశాడు. మాకు చికిత్స దివ్యంగా జరిగింది. అంతిమ బిల్లు కూడా అంత ‘దివ్యంగా”అంటే భారీగా వచ్చింది గాని, ఇద్దరికి పదిరోజుల్లో పూర్తిగా జబ్బు నయమైంది.

‘పాపం మావాడు ఎక్కడో అప్పుతెచ్చి ఉండాటని’ నేను తెగ బాధపడిపోతూంటే మా కోడలు తన భర్త లేనప్పుడు కొంత ‘సూచాయ’గా చెప్పింది. తర్వాతెప్పుడో అసలు రహస్యం. అదేంటంటే ఉద్యోగంలో చేరినప్పటి నుండి దూర దృష్టితో నా కొడుకు, తన జీతంలో కొంత భాగం ఒక ప్రత్యేక బ్యాంకు ఖాతాలో వేస్తున్నాడంట, వృద్ధులైన తల్లితండ్రులలో ఎవరికైనా అనారోగ్య సమస్యలొస్తే ఉండాలి కదా అని. మరో ఆలోచన, పట్టణవాసం ఇష్టంలేని మాకు ఊళ్లోనే ఇప్పుడున్న దానికన్న మంచి ఇల్లు కట్టించాలి అని కూడా! అలాంటి ఉత్తముడైన నా పుత్రుడిని అపార్థం చేసుకున్నందుకు మా ఇద్దరి పశ్చాత్తాపం చెప్పుకోవడానికి ఈ సమావేశాన్ని ఉపయోగించు కుంటున్నందుకు అన్యథాభావించొద్దు. ఇంక ఉంటా.

ముకుందం : మా నాన్నగారు గౌరీపతి గారికి, అమ్మకి ఈ సమావేశంలో పాల్గొంటున్న అందరికి నమస్కారాలు. మా నాన్న, చాలా మంది నాన్నలలానే కుమారుడి గురించి కొన్ని అతిశయోక్తులు చెప్పేరు. నేను కేవలం “పుత్రధర్మం” నిర్వర్తించానంతే. పెంచి పెద్ద చేసిన తల్లితండ్రులకు కొడుకు కొంత ఖర్చుపెట్టడం ఏవిధంగా చూసినా “గొప్ప”కాదు. నేను వాళ్లకోసమే దాచిన మొత్తంలో కొంత ఖర్చుపెట్టానంతే. ఇన్నాళ్లూ నాకోసం వాళ్లు ఖర్చుపెట్టలేదా? కష్టపడలేదా? నా ఆరోగ్యబీమా పాలసీలో వారిద్దరి పేర్లు కూడా చేర్చి ఉన్నందున ఆవిధంగా కూడా కొంత సొమ్ము సమకూరింది. అందుకే, నా సలహా ఏమిటంటే, అందరూ “ఆరోగ్య బీమా” చేసుకోవాలి. ఇప్పుడు “కోవిడ్‌కవచ్” వంటి పాలసీలు అందుబాటులో ఉన్నాయి. ఇంకో విషయం, “కోవిడ్” మన మంతా మొదట్లో అనుకున్నంత ప్రాణాంతకం కాదు. చికిత్సకు లొంగనిదీ కాదు. కాదంటే దానికి భయపడకూడదు. జాగ్రత్త పడాలంతే. ఈ సందర్భంలో ‘మా అమ్మానాన్నల ఘనత’ గురించి కొంత

చెప్పాలి. చాలా మందిలా వాళ్లు కోవిడ్ అని నిర్ధారణ అయ్యాక, విపరీతంగా ఆందోళన చెందలేదు. భయపడలేదు. అన్ని నిబంధనలు 'క్వారంటేన్‌తో' సహా ఆహార విహారాల్లో నియంత్రణలు తు. చ. తప్పకుండా పాటించారు. వైద్యులకు, చికిత్సకు సహకరించారు. వ్యాధితో పోరాడి అంతిమ విజయం సాధించారు. అంతేకాదు, ఇతర రోగుల చికిత్సలో ఉపయోగించేందుకు "ప్లాస్మాదానం" కూడా చేశారు. ఆ విధంగా ఇప్పటికే నలుగురు రోగులకు ప్రాణ దాతలయ్యారు, నా మాతా పితరులు, అని వారి పుత్రునిగా సగర్వంగా చెప్పుకుంటున్నానెలవు.

ముక్కంటి : ఇంత వరకుమాట్లాడిన నా ప్రియ మిత్రుడు గౌరీపతి, కుమారుడు ముకుందానికి నా శుభాశీస్సులు. అంతటి యోగ్యుడిని కన్న తల్లితండ్రులకు అభినందనలు. సరే నా పేరైతే మీమీ "తెరల" మీద కనపడుతుంది. వృత్తి గురించి నేనే చెప్పుకోవాలి కదా, సగర్వంగా మా మిత్రులతో బాటుగా సైన్స్‌లో గ్రాడ్యుయేషన్ చేసినా, పాసయ్యాను కూడా లెండి. నేను వంశపారంపర్యంగా వచ్చిన ఆయుర్వేదాన్ని శివాలయంలోని అర్చకత్వాన్ని వదులుకోలేదు. అర్చకత్వం డబ్బుకోసం కాదు, భక్తి నిబద్ధతలతో చేస్తున్నాను. వైద్యం, కడు పేదలకు మాత్రమే ఉచితం. డబ్బున్న వాళ్లదగ్గర బాగానే లాగుతాను. శివాలయంలో, అమ్మవారి పూజారిని గాబట్టి ఈ 'మహమ్మారి' కరోనాను, గతంలో మనవాళ్ళు మశూచివ్యాధిని "అమ్మవారిలా" భావించినట్లు చేయమని చెప్పను. "చికిత్స" అవసరం లేదనీ అనను. అందుబాటులో ఉన్నచికిత్సను పొందండి. ఔషధాలు వాడండి. ఐతే ఆధ్యాత్మికతను వీడకండి. ఏ వ్యాధైనా, రాకుండాఉండాలన్నా, వచ్చాక తగ్గాలన్నా, దైవబలం కూడా అవసరమని గ్రహించండని మాత్రం చెబుతానంతే.

అసలు 'కరోనా'గాని మరే ఇతర విషజ్వరం, వ్యాధి అసలు మనకు సోకకుండా ఉండాలంటే, మనలో రోగ నిరోధక శక్తి ఉండాలి. అది పెంపొందించు కోవడానికి, ఏం చేయాలో, చేయకూడదో, తినాలో, తాగాలో, అన్నీవివరంగా మన పూర్వీకులు గ్రంథస్థం చేసి ఉంచారు. మన ఆయుర్వేదంలో సకల వ్యాధులకూ నివారణోపాయాలు, ఔషధాలు ఉన్నాయి. ఆ మాటకొస్తే మన పోపుల డబ్బాలోనే, పసుపు శొంఠి, మిరియాలు, లవంగం, దాల్చిన చెక్క వంటి దినుసుల రూపంలో ఎన్నో మందులున్నాయి. పసుపు ఎంత సర్వరోగ నివారిణియో, బాక్టీరియా

వినాశకారియో, ఇప్పుడిప్పుడే పాశ్చాత్యులు కూడా గ్రహిస్తున్నారు. ఈ విధానాన్ని ఇప్పటకీ కొంత వరకైనా పాటిస్తున్నందువలననే ఈ కరోనా భూతం మనదేశంలో ఇతర దేశాలలో చేసినంత విలయతాండవం చేయలేక పోయిందని నేను ఘంటాపథంగా చెప్పగలను. అయితే మన సాంప్రదాయ విధానాలతో బాటు ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా 'ముఖ కవచం', "భౌతిక దూరం", ఆధునిక శుచిశుభ్రత పద్ధతులు పాటించటం కూడా అవసరమని చెబుతూ సెలవు తీసుకుంటున్నా.

మళ్ళీ పరమేశ్వరరావు : నా మిత్రులు "గౌరీపతి", "ముక్కంటి" తమదైన ప్రత్యేకశైలిలో చెప్పినవన్నీ వాస్తవాలే. కాదనను. ఐతే కరోనా అనేది అసలు భయపడాల్సిందే కాదు, అని చెప్పటం వాళ్ల ఉద్దేశం కాదనే అనుకుంటున్నా. మానవుడు సృష్ట్యాది నుండి ఎన్నో గడ్డు సమస్యలను, అవాంతరాలను దిగ్విజయంగా ఎదుర్కొంటూనే ఉన్నాడు. తన మేధో బలంతో మశూచి ప్లేగ్, క్షయ, స్పానిష్ ఫ్లూ, సార్స్, ఎబోలా వంటి ఎన్నో వ్యాధులపై అంతిమ విజయం సాధించినట్లే ఈ కరోనాపై సాధిస్తాడన్న విశ్వాసం నాకూ ఉంది. ఐతే, 'కరోనా'తో సమరం ఇంకా సాగుతూనే ఉంది. "టీకా" కనుగొనేదాకా, దానిదే పై చేయిగా ఉంటుంది. ఈ కరోనా లేదా కోవిడ్-19 యొక్క పుట్టు పూర్వోత్తరాలు మనమంతా తెలుసుకోవాల్సిన అవసరముంది. "అందుకే హర్యానా రాష్ట్రం "గుర్గావ్"లో ఒక ఔషధ పరిశోధన సంస్థలో "వైరాలజిస్ట్" అంటే రోగ క్రిముల నిపుణిడిగా పనిచేస్తున్న "విఠల్"ని మనల్నుద్దేశించి ప్రసంగించమని కోరుతున్నాను. నిజానికి విఠల్, మా "పంచశివుల్లో" ఒకడ్కైన నీలకంఠం అల్లుడు. నా బదులు మా అల్లుడికి అవకాశం ఇమ్మని వాడు కోరితే, దానికి నీ సిఫార్సు అవసరం లేదు. నీ అల్లుడిగా ఈ "సమూహం"లో సభ్యత్వానికి మాట్లాడడానికి అర్హత ఉందని చెప్పాను. ఇప్పుడు విఠల్ చెప్పేది శ్రద్ధగా వినండి.

విఠల్ : నమస్తే. ముందుగా అసలు వైరస్‌లు, అంటే "రోగక్రిములు" ఎలా ఎందుకు ఆవిర్భవిస్తాయో క్లుప్తంగా తెలుసుకుందాం. నరునితో సహా ఈ సృష్టిలో కోటానుకోట్ల చరాచరజీవులు, సూక్ష్మక్రిములు కూడా ఉన్నాయి. నరుడు బుద్ధి జీవి" కాబట్టి తన మేధోబలంతో అన్నిజీవులపై ఆధిపత్యం సాధించాడు. దానితో తృప్తి పడక కేవలం తన స్వార్థం, సౌఖ్యం కోసం పలు పర్యావరణ హానికర దుశ్చర్యలు, జీవవైవిధ్య సమతౌల్యవినాశకచేష్టలు చేసినప్పుడు 'కన్నెర్ర చేసే ప్రకృతి ప్రతి చర్యల

ఫలితమే అధిక లేక అల్పవర్షపాతాలు, వరదలు, తుఫాన్‌లు, వంటి ఉత్పాతాలు లేదావైరస్‌ల ఆవిర్భావాలు. అలా ప్రకృతి తనను తీవ్రంగా హెచ్చరించినప్పుడు కొంత పశ్చాత్తాపపడినా, వాటిని అధిగమించిన వెంటనే "షరా మామూలే" అన్నట్లు ప్రవర్తిస్తాడు. గతంలో, మశూచి, ప్లేగ్, క్షయ, స్పానిష్ ఫ్లూ, ఎబోలా, సార్స్ వంటి వైరస్‌లు వచ్చినప్పుడు చాలా జన, ధన, ప్రాణ నష్టం జరిగింది, ప్రపంచంలో వాటిపై కొంత విజయం సాధించిన నరుడు తన ప్రకృతి వ్యతిరేకచర్యలను కొనసాగిస్తూనే ఉన్నాడు. ఈ సారి మాత్రం, ఇప్పటి వరకుఈ నూతన వైరస్ "కరోనా" విలయంలో మాత్రం, నరుడికి "గరుడగర్వ భంగం" గట్టి దెబ్బేతగిలింది. ఈ వైరస్ పుట్టు పూర్వోత్తరాలు చెప్పమన్నారు కదా, ఇది, అంటు రోగ జాతి. సార్స్ వంశీకురాలు, కరోనా కులీనురాలు, కోవిడ్ నామధేయురాలు. ఆ ఎవరో ఏదో అంటున్నారు? ఆ నిజమే! "చైనీయురాలు" కూడా– కొంత వ్యూహాత్మక దురుద్దేశ పూర్వక జాప్యంతో ఈ ఏడు ఆ నంగనాచి చైనాయే వెల్లడించింది నిరుడు మా 'వూహాన్ సంత'లో పుట్టిందీ కొత్త వైరస్ అని. ఆలస్యానికి నిందించారంతా, గాని ఎవరూ ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే, పాములు, కప్పలు నత్తలు పురుగులు, ఆఖరికి గబ్బిలాలు కూడా తినే చైనాలో వైరస్‌లు పుట్టటం సహజమే కదా. చైనా ఎన్నో అబద్ధాలు చెప్పింది.అసలది, వూహాన్‌లాబ్‌లో జీవాయుధాల సృష్టికై జరిగిన దుష్ప్రయోగాల సమయంలో లీకైనదేమోనన్న అనుమానం కూడా ఉంది, ఇంకా పూర్తిగా 'నిర్ధారణ' ఐతే కాలేదు గాని పురుడు పోసుకున్న కొన్ని వారాలలోపే, ఈ కరోనా లేదా కోవిడ్‌వైరస్, నరుడే వాహకం(నం)గా విశ్వాన్నంతటినీ చుట్టు ముట్టేసింది. ఏ మాటకామాటే చెప్పుకోవాలి. దీనికి, జాతి, కుల, మత, లింగ వివక్షలేదు. ఏ వయసు వారినైనా సోకుతుంది. అగ్రరాజ్యం అమెరికాతో సహా అన్ని దేశాల్లోనూ అల్లకల్లోలం, మారణకాండ చేసేసింది అతి స్వల్ప వ్యవధిలో ఎలా ఎదుర్కోవాలో తెలియక మానవుడు మొదట్లో కొంత నిర్ఘాంత పోయినా, గతంలో ఎన్నో వైరస్‌లను ఎదుర్కొన్న అనుభవాలన్నిటి సారం రంగరించి, "టీకా" కనుగొనే వరకు దీనితో ప్రత్యక్ష పోరాటం తగదు స్వీయ రక్షణ చర్యలతో కొంతవరకైనా దాని వ్యాప్తిని తగ్గించాలని నిర్ణయించుకున్నాడు. శుచి, శుభ్రత, ముఖ కవచం, స్వచ్ఛంద గృహనిర్బంధం, వంటి రక్షణ చర్యలు చేపట్టాడు.

"మందగా తిరిగితే దాని ధాటికి గంపగుత్తగా మాడిపోతాం, విడివిడిగా ఉంటేనే దాన్ని విసిగించగలం, "గొలుసు కట్టు వ్యాప్తి"ని అరికట్ట గలం అని గ్రహించాడు. ఇలాంటి రక్షణ చర్యలతో పాటు సకల బంధనం అంటే లాక్‌డౌన్ కూడా నెలల తరబడి అన్ని దేశాలు పాటించాయి. కాని ఎన్నాళ్లలా, ప్రగతి చక్రాన్ని ఆపేసి, పూర్తిగా ఊపిరి బిగపట్టుకుని ఉండగలడు నరుడు? అందుకే ఎంతో కొంత కట్టడిచేయగల్గాను కదా అని ఇప్పుడిప్పుడే కొంత సడలింపుల పర్వం ప్రారంభిస్తున్నాడు. అయినా, కొంత కట్టడి అయిందే కాని, కరోనా పూర్తిగా తగ్గలేదు. అదెంత జిత్తుల మారి అంటే మాటి మాటికి జన్యుపటం మార్చేసుకుంటోంది. మారీచుడిలా మారిపోతుంది. అందుకే వాక్సీన్ తయారీ ఆలస్యమవుతోంది. అది ఏదోలా మనల్ని ఏ మార్చుతూనే ఉంది. ఎండలు ముదిరితే మాడిచచ్చి పోతుందేమో, చలి ఎక్కువైతే గడ్డ కట్టుకు పోతుందేమో, ఇలాంటి అపోహలన్నీ తొలగి పోయాయిప్పుడు-అదింకా విజృంభిస్తూనే ఉంది. కాని గుడ్డిలో మెల్ల ఏంటంటే ఈ వైరస్ అంత ప్రాణాంతకం కాదు. లక్షణాలు ఉన్న చికిత్సా విధానాలకు లొంగుతున్నది. ఇప్పుడు మొత్తం 33 దేశాలలో ముమ్మరంగా వాక్సీన్ ప్రయోగాలు జరుగుతున్నాయి. త్వరలో టీకా కనుగొంటాం, వైరస్‌పై అంతిమ విజయం సాధిస్తామన్న "అన్నవిశ్వాసం నాకుంది. ఎవరో అడిగిన ప్రశ్న నాస్క్రీన్‌పై కనపడుతోంది. కరోనా వైరస్ గతంలో వచ్చిన వైరస్‌ల కన్నశక్తి వంతమైనదా? అని. దానికి నాసమాధానం "కాదు" అనే. ఐతే ఆహార విహారాల్లో విశృంఖలత మూలంగా తనలోని 'రోగ సంహారకతను బలహీనపరచుకుని ఈ కరోనా ధాటికి నిలబడలేకపోతున్నాడంతే, కాబట్టి రోగనిరోధకశక్తి పెంపొందించు కోండి. ఇంతటితో విరమిద్దామనుకున్నాను, గాని ఈ లోగా కొందరు సభికులు మరికొన్ని ప్రశ్నలు సంధించారు. వాటికి క్లుప్తంగా నాకు తెలిసిన మేరకు సమాధానమిచ్చే ప్రయత్నం చేస్తాను. కోవిడ్-19కి నిర్వచనం చెప్పమని ఒకరడిగారు. ప్రస్తుతానికది "బ్రహ్మ పదార్థం", ఏ నిర్వచనానికి, వ్యాఖ్యానానికి ఇమడనిది. రోగక్రిమియా, బాక్టీరియాయో, కూడా చెప్పలేకున్నాం. ముందే చెప్పినట్లుగా మాటి మాటికీ జన్యుపటాన్ని మార్చుకుంటున్న జిత్తులమారి. కామరూపి. ఫలానా లక్షణాలుతో, హెచ్చరికలతో వస్తుందనీ చెప్పలేకపోతున్నాం. ఒకోసారి ఏ లక్షణాలు లేకుండా వస్తోంది. లక్షణాలకు

కొన్నిమందులున్నాయి. వ్యాధికికాలేవు. ఒకసారి వచ్చిపోతే, మళ్ళీ రాదనీ చెప్పలేం. హాంకాంగ్‌లో అమెరికాలో అమలాపురంలో కూడా "కరోనా" రెండో సారి వచ్చిన కేసులు నమోదయ్యాయి. వైరస్ వ్యాప్తి మార్గాలలో కూడా పూర్తి స్పష్టత లేదు. రాకుండా జాగ్రత్త పడాలి. వస్తే భయపడొద్దు. అని చెప్పగలనంతే! సెలవు.

నీలకంఠం : ఒక నిపుణుడు చెప్పిన విషయాలు విన్నారు కదా. ఒక సామాన్యుడిగా నేను పరిశీలించినవి కొన్నివినండిమరి. నేను కూడా కరోనాకి అతిగా భయపడొద్దనే చెబుతాను. చాలా శక్తి వంతమైనదేం కాదు. చికిత్సకు లొంగనిది కాదనే అంటాను. ఐతే, ఇది అంటురోమని మర్చిపోరాదు. ఆ రోగం సోకిన వ్యక్తితో చాలా సేపు ఉంటేనే ఇంకొకరికి సోకుతుంది గాని అతనిని దూరాన్నుంచి చూస్తే చాలు మనకంటుకుంటుందని అతిగా భయపడరాదు. ఈ సందర్భంలో కరోనా వచ్చి నయమైపోయిన వాళ్ళపట్ల మన సమాజంలో కొందరు చూపుతున్న వివక్ష అంటరానితనం వంటి వాటిని మనం గర్హించాల్సిందే. శ్మశానాల్లో కూడా సంభవిస్తున్న దారుణాల్ని అసహ్యించు కోవాల్సిందే. రోగంతో పోరాడాలి. రోగితో కాదు సెలవ్.

ఈశ్వరరావు : మా పంచ శివుళ్లలో ఒకడిన్నైన 'ఈశ్వరరావు' అనే నేను నా అనుభవాన్ని చెప్పాలనుకుంటున్నాను, క్లుప్తంగా వినండి. ఒకరోజు ఉదయం, అదే పనిగా తుమ్ముతుంటే మా పక్కింటి వాళ్ళు బాగా భయపడిపోయి వాళ్లింటి తలుపులు వేసేసుకుని మా వాడికి పదే పదే ఫోన్లుచేసి పోరితే, తప్పనిసరై హాస్పిట్‌లకి తీసుకుని వెళ్లాడు. "ఎమర్జెన్సీ"లో ఉన్న ఓ కుర్ర డాక్టర్ నన్ను ముట్టు కోకుండానే కరోనా వచ్చిందని తేల్చేశాడు. ఐ.సి.యులో పెట్టాలి. ఇన్సూరెన్సు ఉంటే రెండు లక్షలు, లేకుంటే 'మూడు లక్షలు ముందే చెల్లించాలని' చెప్పేడు. నీకూ నీ కుటుంబంలో ఇతరులకూ ఈ కరోనా సోకకుండా ఉండాలంటే పదిరోజుల వరకు మీనాన్న సంగతి మాకు వదిలేయ్. ఇటు రావద్దు. అదనంగా డబ్బు ఎంత కట్టాలో ఎప్పటి కప్పుడు ఫోన్లో చెబుతాంలే. ఆన్‌లైన్‌లో కట్టే సౌలభ్యం ఉంటుందిలే అని చెప్పి కొంత సొమ్ముకట్టించుకుని నా కొడుకుని పంపించేశారు. తర్వాత నన్ను ఒక గదిలో అదేం ఐ.సి.యు. కాదు. పెట్టి వారం రోజులు 'చాలా బాగా' చూసుకున్నారు ఆ హాస్పిటల్ వాళ్లు.

అంటే చాలా బలవర్ధకమైన ఆహారం ఠంచనుగా టైము ప్రకారం పెట్టేవారు. చికిత్సంటూ పెద్దగా ఏం జరగలేదు. రోజూ మూడుసార్లు ఓ అందమైన నర్సు, ఆవిరి పట్టించేది. కాస్త వేళాకోళం ఆడేది. తిండి ఎక్కువైతే కడుపుబ్బరం రాదూ. ఓ మేల్‌నర్స్ వచ్చి ఎనిమా చేసేవాడు. ఏవో ఇంజక్షన్లు రోజూ రెండు సార్లు ఇచ్చేవారు. చాలా ఖరీదైనవని చెప్పేరు.

వారం రోజులు గడిచేక, నా కొడుకుకి ఫోన్ చేను ఇతర రోగుల తాకిడితో బెడ్స్ కొరత వచ్చింది. మీ నాన్నని 'విడుదల' చేస్తాం కాని, మాతో టైఅప్ ఉన్న ఒకహోటల్‌లో క్వారంటైన్‌లో ఉండాలి. అక్కడి ఛార్జీలు వాళ్లకే చెల్లించాలని చెప్పారు. మావాడు మొత్తం బిల్లు 8 లక్షల ఏడువేల ఆరువందల యాభై నాలుగు కట్టి అంబులెన్స్‌లో హోటల్‌కి తీసుకుని వెళ్లాడు. ఆ హోటల్‌లో భోజనం అంత బాగోలేదు. ఇతర సౌకర్యాలూ అంతంత మాత్రమే. ఇంకో రెండు రోజులలో "విడుదల" అవుతాననగా ఓ తెల్లవారుజామున "షార్ట్ సర్క్యూటై" అగ్ని ప్రమాదం జరిగింది. పొగలో ఊపిరాడక ఓ అరడజను మంది టపా కట్టేశారంట, కాని మొదటి అంతస్థు నుంచి ధైర్యంగా దూకేసిన నాకు ప్రాణం దక్కింది. ఒకకాలు విరిగింది.

అసలు నాకు "కరోనా" వచ్చిందో లేదో గాని ఇప్పుడిలా వీల్‌ఛైర్‌లో కాలుకి సిమ్మెంట్ కట్టుతో మీతో మాట్లాడుతున్నాను. ..... ఆ... ఆ హాస్పిటల్ పేరేంటని అడుగుతున్నారా... ఏదోలేండి. శ్రీకృష్ణుడి తల్లిపేరు దేవకియో, ఏదో సరిగా జ్ఞాపకం లేదు. ఉంటా.

ఆఖర్లో పరమేశ్వరరావు : ఈ దూర సుదూర దృశ్య శ్రవణ సమావేశం "కరోనాయే" ఏకైక చర్చా అంశంగా, చాలా బాగా జరిగింది. అందుకనే అందరికీ కృతజ్ఞతలు చెప్పటం, సమావేశ సమన్వయకర్తగా నా కర్తవ్యం. అదలా ఉంచి ముగించే ముందు రెండు ప్రకటనలు – దాదాపు సభ్యులందరూ ఒకవిషయం అడిగారు–సెప్టెంబరు 1నే గత పాతికేళ్లుగా ఈ సమావేశం జరపడానికి కారణమేంటో తెలియజేయమని. ఇలా అడిగిన వాళ్లలో మా పంచశివుళ్ళ భార్యామణులు కూడా ఉన్నారు. అంతా పారదర్శకంగా ఉన్నాం కాబట్టి ఆ రహస్యం చెప్పేస్తున్నా. కాలేజీలో చదువు కుంటున్నప్పుడు మేం ఐదుగురం, ఒకరికొకరి గాని ఆఖరికి ఆ అమ్మాయికి గాని తెలియనీయకుండా ఇష్టపడ్డాం. కేవలం "టీనేజ్ క్రష్" అంతే – ఆ అమ్మాయి

పుట్టిన రోజు సెప్టెంబర్ 1, అంతే తర్వాత ఆ అమ్మాయి సినిమాల్లో హీరోయిన్ వేషాలు వేసిందిలెండి. ఇకపోతే ఇకనుంచి మధ్యలో కలుసుకో కూడదు, మాట్లాడుకో కూడదు, ఫోన్లు కూడా చేసుకోకూడదు వంటి నిబంధనలేవీ పాటించకూడదని ఐదుగురం నిర్ణయించుకున్నామని చెప్పటానికి సంతోషిస్తున్నాను. మళ్లీ కలుసుకునే వరకు బై.. బై... "కరోనా" అంతం, త్వరలో చూస్తామన్న విశ్వాసంతో ఉందాం అందరం బై.. బై...

రచనాకాలం – కరోనా మొదట వేవ్ తరువాత

'ఆదర్శాలు' లేని మనిషి అభివృద్ధిని సాధించలేడు.



ప్రపంచంలో అందరికీ ఆమోదయోగ్యమైన విధానం ఎక్కడా లేదు.



ఒక మంచి వ్యక్తి ఎదురైతే, ఆయనను ఆదర్శంగా తీసుకో! ఒక చెడ్డ వ్యక్తి తారసిల్లినప్పుడు నీ మనస్సును పరిరక్షించుకో.



పాతలో ఉన్న మంచిని ఆధారంగా చేసుకొని, చెడును విసర్జిస్తూ, ముందుకు సాగిపోవడం ఉత్తమ మానవుని లక్షణం.

## 'నానమ్మ' ఆదర్శ సతీమణి

'కాలింగ్‌బెల్' మోగగానే, వీధి తలుపులు తీసిన, ఎనభై రెండేళ్ల వృద్ధుడు – "సుబ్రహ్మణ్యం" గుమ్మం బయట చేతిలో చిన్నబేగ్‌తో సంకోచిస్తూ నిలబడ్డ ఇరవై రెండేళ్ల యువకుడు సుందర్, ఒకరినొకరు భౌతికంగా మొదటిసారి చూసుకుని నిర్ఘాంతబోయి, నోట మాటరాక, స్థాణువుల్లా ఉన్న చోటే నిలబడిపోయారు 'ఈ కుర్రాడేంటి, అచ్చుగుద్దినట్లు నా శ్రీమతి "సుందరి"లా ఉన్నాడేంటి? విచిత్రం!! అనుమానం లేదు. నా ఏకైక కుమారుడు "శేఖర్‌గాడి" కొడుకే అయ్యుంటాడు. అని మరుక్షణంలోనే, నిర్ణయించేసుకుని, ఆపుకోలేని ఉత్సాహ, ఉద్వేగాలతో, పెద్దాయన, ముందుకుకదిలితే – "ఇంకో ఇరవై ఏళ్లు గడిస్తే "నాన్న" ఎలా ఉంటాడో, అలానే ఉన్నాడు "తాత" అనుకుంటూ, ఓ అడుగు ముందుకేశాడు "కుర్రాడు". అంతే, ఎలాంటి పరిచయ కార్యక్రమాలు లేకుండానే, అత్యంత సహజ సిద్ధంగా, ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగిపోయేరు జన్మలో తొలిసారి కలుసుకున్న తాతా మనవళ్లు!

అస్పష్టంగా ఏంటేంటో గొణుక్కుంటూ, కన్నీళ్లుకార్చుకుంటూ, అలానే ఉండిపోయారు, తమ శరీరాలు, హృదయాలు మౌన భాషలో పరస్పరం పలకరించు కుంటోండగా, ఏదీ పట్టని ఆనందకరమైన స్థితిలో పెద్దాయనే, ముందుగా ఈ లోకంలోకి వచ్చి "చిట్టచివరి అంకంలో ఉన్న నీ తాతను చూడాలని వచ్చావా మున్నా"–అంతా భగవంతుని దయ – కాదు కాదులే మన ఇంటి దేవత – అదేలే మీ "నానమ్మ" కృప. ఈ మధ్యన రోజూ కలలోకి వస్తూ "సుబ్బా" రేపోమాపో, నిన్నుకలవడానికి మన మనవడిని పంపిస్తా, వాడే మనబ్బాయి శేఖర్ గాడిని, నీతో కలుపుతాడులే" అంటూనే ఉంది. మూర్ఖుణ్ణి నమ్మలేదు నేను" అని కాసేపాగి "సారీరా, నిన్ను తొలిసారి చూసిన ఉత్సాహంతో తబ్బిబ్బైపోయి, ఏంటేంటో, వాగేస్తున్నాను, పదలోపలికి" అంటూ ఆప్యాయంగా భుజాల మీదచేతులు వేసి మనవడిని లోపలికి తీసుకుని వెళ్తూ, "అయ్యోనా మతిమండా అడగనేలేదు – అమ్మానాన్నా ఎలా ఉన్నారు? క్షేమమేకదా – 'వాడి'తో చెప్పేవచ్చేవా? ఎన్నాళ్లయిందో నాకొడుకుని చూసుకుని, "ఉద్వేగం ముంచుకొచ్చి సోఫాలో కూలబడిపోయిన తాత కాళ్ల దగ్గర

కూర్చుని, ఏడుస్తూ తన వళ్లో తలదాచుకున్న మనవడికి, తన కన్నీళ్లు, 'నానమ్మ' ఆదర్శ సతీమణి కనపడనీయరాదని – వేడెక్కిన వాతావరణాన్ని చల్లబరచాలని పించింది తాతకి.

"ఒరేయ్! శుంఠా – చిన్నపిల్లాడిలా ఏడుస్తూ నా పంచె తడిపేస్తున్నావురోయ్! ఎవరన్నా నాతడిపంచె చూస్తే టాయిలెట్ కెళ్లడానికి బద్ధకించాననుకుంటారేమో", జోకు అర్థమై, సుందర్ పకపకా నవ్వేశాడు. తలెత్తాడు. అంతే మరోసారి నిర్ఘాంతపోయాడు సుబ్రహ్మణ్యం. కాదు ఈ సారి మురిసిపోయేడు "వావ్! వీడు నవ్వుతుంటే, రెండు బుగ్గల్లో భలేగా సొట్టలు పడుతున్నాయి. నా సుందరికీ అంతేగదా అనుకుని హాల్లోనే ఉన్న భార్య ఫొటోకేసి మనవడి ముఖం లోకి పదే పదే పరికించి చూసి ఎంత దగ్గర పోలికలో అని ఇంకోసారి ఆశ్చర్యపోయి ఆనందం పట్టలేక మనవడి రెండు బుగ్గల మీద ముద్దులు పెట్టేశాడు! ఈ సారి జోకేయటం మనవడి వంతైంది.

"తాతోయ్ – కాస్త నిగ్రహించుకో – ఈ "పురుష పుంగవుల ముద్దులాట" ఎవరన్నాచూస్తే – ఏవనుకుంటారో ఏంటో ఖర్మ– "అనేశాడు మనవడు. అర్థం కానట్లునటిస్తూ, మాట మార్చటానికి కాబోలు – "మీ ఇద్దరికీ అదృష్టం లేక ఒకరి నొకరు కలుసు కోలేక పోయారు గాని – మీనాన్నమ్మది కనీ వినీ ఎరుగని అపురూప సౌందర్యం – మాటల్లో చెప్పలేని గొప్ప వ్యక్తిత్వం కూడారా. ఈ పాడు మానవ లోకంలో ఉండలేక, త్వరగా దేవతల్లో కలిసి పోయిందిరా. నాన్నమ్మ గురించి నీకేమీ తెలియదా – బంధువులు ద్వారానైనా ఏమీ వినలేదా!

"మా అమ్మానాన్నలు పెద్దగా ఏమీ చెప్పేవాళ్లుకాదు ఎంత అడిగినా అడగ్గా అడగ్గా కొందరు, కొంత అర కొర సమాచారం మాత్రం ఇచ్చేరు నానమ్మ చాలా అందగత్తె అని, ఆరోజుల్లో పేదవాడని తలచక నిన్ను ప్రేమ వివాహం చేసుకుందని, ఆదర్శసతియే గాని –" అక్కడ ఆగిపోయేడు – కొందరు కొంత వ్యతిరేక సమాచారం అంటే – ఆమె, అహంకారి, మొగుడిని చెప్పుచేతల్లో ఉంచుకునే గయ్యాళని, అంతే కాదు భర్తతో వంట కూడా చేయించే సోమరి అని ఎప్పుడూ సభలూ, సమావేశాలు, ఉద్యమాలు అంటూ వీధుల్లోనే ఉండేదని భర్త మీద నమ్మకం లేకతన ఆస్తినంతా ఏకైక కుమారుడైన మా నాన్నశేఖర్ పేర్న దస్తావేజులు చేసి సంరక్షకునిగా తన

బంధువుని పెట్టిందని ఇలా కొంత విశ్వసించలేని విషయాలు చెప్పారన్నది దాచేడు.

"అందగత్తె అన్నమాట వెయ్యిశాతం నిజంరా – అదిగో ఆ ఫోటో చూడు – విశాల నేత్రాలు, ముఖం చిట్లించినా గీతలు ముడతలుపడని చక్కని నుదురు, సంపంగి లాంటి ముక్కు, లక్క పిడతలాంటి నోరు, కొనదేలిన చుబుకం, నల్లని పొడవైన కురులు – కాస్త నవ్వితే చాలు లోతుగా సొట్టలు పడే బుగ్గలు హే – ఇలా పిచ్చి పిచ్చిగా వర్ణించే బదులు, ఒకమాట చెబితే చాలురా! – నువ్వు చీరకట్టుకుని బొట్టుపెట్టుకుని, సవరంతో జడలేసుకుని అద్దం ముందు నిలబడి చూసుకో, మీ నాన్నమ్మ అచ్చు అలా ఉండేది అని చెబితే చాలు–" కాసేపాగి మళ్ళీ రెచ్చిపోయాడు– ఆమె నిజంగా "ఉత్తమసతి" – కాని అందరూ చెప్పే "కార్యేషు శ్లోకంలో మాదిరిగా, దాసి, మంత్రి, మాత, వగైరాలు కాదురోయ్ – మను ధర్మం ప్రకారం పతి కాళ్లదగ్గర పడిఉండే సతి కాదు – ఈ కాలానికి వర్తమాన పరిస్థితులకి తగినట్లు ఉండే ఆదర్శ ఆధునిక అర్ధాంగి"

– మరేమో "ఒక్క నిమిషం ఆగు తాతా – కార్యేషు శ్లోకం ఆమెకు నప్పదంటున్నావు. – దాసి అనటం తప్పంటున్నావు – భోజ్యేషుమాత ..ఎలా ఉన్నా– పోనీ శయనేషు – ఎట్లుండేది "మీ ఆవిడ"?

"ఒరేయ్, నోర్మూయ్! ఏంట్రా ముదురు కబుర్లు? నువ్వెంతనీవయసెంత? సరేగాని, బానిసలా ఇష్టం లేకుండా దాస్యం చేసేరకం కాదన్నాను. అనురాగంతో సేవించే ఇష్టసఖి అన్నాను. వేతనం కోసం పనిచేసే మంత్రి కాదు, శ్రేయోభిలాషిగా సలహాలిచ్చే అర్ధాంగి అని నాకవి హృదయం. ఇకపోతే శయనేషు– మాటకొస్తే – సర్లే ఏమాత్రం లోటు జరగలేదులేరా – తను శృంగార దేవత నాపాలిట! సరేనా! ఎంత స్వంత మనవడ్కైనా, ఇద్దరి మధ్య అరవైఏళ్ల వ్యత్యాస ముందని గుర్తొచ్చి వాడితో శృంగారం ప్రస్తావన తెచ్చినందుకు కొంచెం సిగ్గొచ్చింది సుబ్రహ్మణ్యం తాతకి – వీడు అసాధ్యుడిలా ఉన్నాడు – నాతో అన్నీ వాగించేస్తున్నాడు అనుకున్నాడు. "ఒరేయ్ – కబుర్లుచాలించి, భోజనానికి లేద్దాం ఇంక– ఒంటరివాడు ఏదో హొటల్ కేరేజీఫుడ్‌లో వాటా ఇస్తాడేమో అనుకోవద్దురోయ్! నేనేస్వయంగా వండిన నలభీమపాకం నువ్వురావడానికి కాస్త ముందే నా వంట పూర్తయిందిలే – పదతిందాం "తింటూ తింటూ ప్రతీ వంటకాన్ని"సూపర్ తాతా"అని మనస్ఫూర్తిగానే

పొగిడేడు – మధ్యలో ధైర్యం చేసి అడిగేశాడు – "నానమ్మ ఉన్నప్పుడు కూడా వంట చేసేవాడివని తెలిసింది, ఎవరో చెప్పారులే – మరి మొగుడితో వంట చేయించటం "ఉత్తమ సతి" లక్షణమా? తాతకి బాగానే కోపం వచ్చిందని గ్రహించి తల దించేసుకున్నాడు సుందర్. సుబ్రహ్మణ్యం కాసేపటికి తమాయించుకుని మంద్రస్వరంలో చెప్పసాగేడు.

"మొగుడు ఎప్పుడైనా వంట చేసినా, కాస్త ఇంటిపనిలో సాయం చేసినా భార్యల పతివ్రతా ధర్మానికి భంగమనుకోవడం మూర్ఖత్వం – అన్ని సందర్భాలోన్లూ, పరిస్థితుల్లోనూ భార్యలు, మాత్రమే పూర్తిగా వంట పని, ఇంటిపని చేసి తీరాలనుకోవడం ప్రాచీన కాలంలో చెల్లిందేమోగాని, వర్తమానంలో అవివేకమే – మా విషయానికొస్తే మాకుపెళ్లైన మొదటిమూడు సంవత్సరాల్లో మీ నానమ్మ'ఎమ్మే' బి.యల్. కోర్సులు ప్రైవేటుగా చదువుతూ, స్త్రీ జనాభ్యుదయ కార్యక్రమాల్లో ఎంతో బిజీగాఉంటూ కూడా, ఇంటిపనిలో నా "జోక్యాన్ని" ఏమాత్రం సహించేది కాదు. అంతా తనే చేసుకునేది. ఐతే, ఒకసారి ప్రమాదవశాత్తు తన రెండు చేతుల మీద వేడివేడి నూనె వలకబోసుకుని, చేతులూ, వేళ్లకి బొబ్బలు పుళ్లుపడి పూర్తిగా అసహాయురాలానప్పుడు మాత్రమే ఇష్టం లేకున్నా కొంత మినహాయింపిచ్చింది –

తన పర్యవేక్షణలో నన్ను వంట చేయనిచ్చింది. తన చేతుల మీద పుళ్లుమానే దాకా ఆ నెలరోజుల్లో నేను తనకన్న ఎక్కువ ప్రావీణ్యత వేగం సాధించేశాను వంటల్లో, "స్వయంపాకం కిక్" సరదా వదలు కోలేను. అప్పుడప్పుడైనా ఓ పూటైనా వంట నన్ను చేయనీయాలని పదే పదే బతిమాలితే అయిష్టంగా ఒప్పుకుంది మీనాన్నమ్మ– అప్పుడప్పుడు మాత్రమే చేయనిచ్చేది – 'ఇంటిపని'లో కూడా వద్దంటున్నా సాయం చేసేవాడిని. నాకున్న తీరిక మేరకు– తను చనిపోయిన తర్వాత మా చెల్లి చెప్పింది, "నీతో చెప్పవద్దని వదిన వాగ్దానం తీసుకుని చెప్పిందన్నయ్యా". 'చిన్నవయసులోనే "ముత్తయిదు"వుగా మరణిస్తానని నా జాతకంలో ఉంది. అది నమ్ముతున్నాను. మీ అన్నయ్య నేను పోయాక ఇంకో పెళ్లిచేసుకోరని తెలుసు – అందుకే భావి జీవితంలో ఆయన కష్టపడకూడదు. నా జీవితకాలంలోనే వంటచేయుటం అలవాటైతే మంచిదని, అప్పుడప్పుడు చేయనిస్తున్నాను. దీన్ని కొందరు "ఆడపెత్తనం"గా వక్రీకరిస్తున్నారని తెలుసు" అని

వాపోయిందట – ఏది ఏమైనా మొగుళ్లు వంటలో ఇంటిపనిలో భాగస్వామ్యం తీసుకోవటం మంచిదని నా అభిప్రాయంరా". ఏమిటి తాత, అంత ఆవేశ పూరితంగా మాట్లాడుతున్నాడని ఆశ్చర్యపోతూనే వినసాగేడు సుందర్. "అది కాదురా కాలమాన పరిస్థితులను బట్టి మన పద్ధతులు మార్చుకోవాలి ప్రాచీన కాలంలోలా, ఈ పని మగాళ్లు మాత్రమే చేయగలరు అని లేనప్పుడు మగవాళ్లతో సమానంగా ఏ పనైనా నారీమణులు చేయగలుగుతున్నప్పుడు,"ఇంటిపని" వాళ్లకి తప్పనిసరి అదనపు బాధ్యత అనటం న్యాయమా చెప్పు–"

"నూరుశాతం నీతో అంగీకరిస్తున్నాను పితామహా 'అని తాతని నవ్వించేడు. ఇద్దరి భోజనం పూర్తయింది. సుందర్ పరధ్యానంగా ఉండగా తాతే ఇద్దరి కంచాలు ఎత్తి సింక్‌లో పెట్టేడు. "అయ్యో! అదేంటి తాతా", అనినొచ్చుకున్నాడు సుందర్. "ఒరేయ్" నేను కాస్త దొడ్లోని తోటలోకి వెళ్లివస్తా – కాస్త పనుంది" ఆపనంటే రహస్యమేం కాదులే – భోజనమయ్యాక ధూమపానం అలవాటులే. రోజుకి రెండు సిగరెట్లేలే – ఇంట్లో కాల్చకూడదని నాన్నమ్మ పెట్టిన నియమం ఇప్పుడు ఒక్కడినే ఉంటున్నాపాటిస్తున్నా అంటూ, బయటికి నడిచిన తాతను అనుసరించాడు మనవడు.

ఆయన కంటే ముందే జేబులోంచి తన బ్రాండ్ తీసుకుని వెలిగించి గుప్పున పొగ వదిలేడు. "ఓర్నీ 'నీకూ ఉందా ఈ పాడు అలవాటు? మరీ ఎక్కువ కాల్చకేం", పుట్టిన ఇన్నేళ్ళ తర్వాత కలిసి నా తాతతో మొదటి రోజునే ఇంత చనువు తీసుకుంటున్నానని మనసులో మెదిలి తనే ఆశ్చర్యపోయేడు సుందర్. "ధూమపాన"– కార్యక్రమం ముగించుకున్నాక తాతా, మనువళ్లు, లోపలికి వచ్చేరు. ఫ్రిజ్‌లోంచి ఒకచాక్లెట్ తీసిచ్చి నోరు తీపి, శుద్ధి చేసుకోరా అంటూ తనూ ఒకచాక్లెట్ తింటుంటే, ఉండబట్టలేక"షుగర్ లేదా అనడిగితే, "కావల్సినంత ఉంది ఇంట్లో– వంట్లోలేదు, మీ నాన్నమ్మఅలవాటు చేసిన ఆహార విహారాలలో క్రమశిక్షణ పుణ్యాన" అని పళ్లన్నీ కనిపించేలా నవ్వి "ఇవి ఒరిజినల్ పళ్లే కట్టుడివి కావు" అని క్లారిటీ ఇచ్చేశాడు కూడా! – ఇద్దరూ బెడ్‌రూమ్‌కి చేరుకున్నారు. పక్క పక్కనే మంచం మీదవాలేరు.

"పితామహా – నాదో అభ్యర్ధన – కాదు రెండు అడుగుదునా!" అవశ్యం ఏమి అడిగినను నిస్సంకోచంగా, వివరంగా చెప్పెదను వత్సా", అలా ఇద్దరూ గ్రాంధికం లోకి దిగిపోయేరు అదోసరదా ఆటలా– "పితామహా – మదీయ పితాశ్రీకి

తమరికి మధ్యన పొరపొచ్చాలు ఏల వచ్చెను? భవదీయునికి తమరి దర్శన భాగ్యం ఇన్ని సంవత్సరాలుగా లభించని దుస్థితి ఏల కలిగెను? ఇక ద్వితీయ అభ్యర్ధన ఏమనగా, నాకుమీ ప్రేమకథ, "దాంపత్యశోభల గురించి ఆది నుండి తుది వరకు వివరముగ తెలుసుకొన కుతూహలంగా ఉన్నది. కరుణింపుడు " నాటకీయంగా వచ్చిన పని చెప్పేశాడు. ఉత్సాహం ఎక్కువైపోయి, సాధారణ భాషలోకి దిగిపోయేడు తాత.

"ఓరి భడవా – చాలా పెద్ద ప్లాన్‌మీదే వచ్చేవన్నమాట – రెండోది చెప్పటంనాకూ సరదాగానే ఉంటాది. బుద్ధిగా మధ్యలో చెత్త ప్రశ్నలేయకుండా విను – ఆక్రమంలో మొదటిదీ క్లారిఫై అయిపోతాదేమోలే ............

ముసి ముసి నవ్వులతో మొదలుపెట్టాడు నీ తాత. "ఆ, మాప్రేమ కథ మొదట్నుంచీ చెప్పాలన్నావు కదా– మాపెంకుటింటి, పక్కన ఉండే రెండంస్థుల మేడ కొనుక్కుని రెండు లారీల సామాన్లతో దిగేరు పరంధామయ్యగారి కుటుంబం – తల్లి, తండ్రి, సుందరి అంతే. సుందరి అన్నది మీ నాన్నమ్మ సార్థక నామధేయం లేరా – "ముగ్గురుండటానికి ఇంత పెద్దమేడ కొనుక్కోవాలా?" అని మా అమ్మబుగ్గలు నొక్కుకుంది – "ఆ అమ్మాయి భలే అందంగా ఉంది" అని నేను ఆనందపడిపోయాను వచ్చిన రోజు సాయంత్రమే, వాళ్లగేటు దగ్గర నిలబడి"ఒరేయ్ అబ్బాయ్ ఇలా రారా" అని పిలిచింది వాళ్లమ్మ కాదు పట్టులంగాలో పొడుగ్గా ఉన్నసుందరే! ఉక్రోషంగా దగ్గరికి వెళ్లి 'రారా' ఏంటి మర్యాదగా మాట్లాడు" అని కాస్త జంకుతూనే నా నిరసన తెలియజేశాను. "రా" అని రెండు సార్లుపిలిచాను. అందులో అమర్యాద ఏముందిరోయ్ సుబ్బా" అనిగడుసుగా చెబుతూనే మళ్లీ ఒరేయ్ అనే అంది. ఏడవలేక నవ్వేశాను. "నేనూ ఈ వేళనే హైస్కూల్లో చేరేనురా సుబ్బా – హాజరు పిలిచినప్పుడు తెలిసింది నీ పేరు సుబ్రహ్మణ్యం అని కాబట్టి ఇద్దరం క్లాస్‌మేట్స్‌రా సుబ్బా. అర్థమైందా? అన్నట్టు నాపేరు సుందరిరా("రా" అనటం మానలేదు.)

ఐనా 'పేరు బాగుంది' అని వాగేశాను. "నాకది తెలుసులేరా – నేనూ బాగుంటానని కూడా" అని కిలకిలాకిలా నవ్వేసింది ఆత్మవిశ్వాసంతో.

"అంటే నీ పదేళ్ల వయస్సప్పుడే ప్రేమ మొదలైందా"? "ఏమో! స్నేహమైతే

మొదలైంది. కలిసే స్కూలుకి నడిచే వెళ్లేవాళ్లం– ఎన్నెన్నో కబుర్లు చెప్పుకుంటూ! అప్పట్లో తను నాకన్న మూడు నాలుగు అంగుళాల ఎక్కువ ఎత్తు ఉండేది – ఎందుకో తెలియకుండానే ఆ వ్యత్యాసం నాకు నచ్చేది కాదు. నాప్రార్థనలు ఫలించి ఇద్దరం పదవతరగతికి వచ్చినప్పటికి మాత్రమే, ఎత్తులో ఆమెతో సమానమయ్యాను. ఎందుకో తెలియకుండానే "అమ్మయ్య" అనుకున్నా! అయితే తమాషా ఏంటంటే, పెళ్లిపీటల వరకు వ్యవహారమొచ్చేక చూసుకుంటే, ఆమెనే నాకన్న ఓ రెండు అంగుళాల ఎక్కువ ఎత్తు ఉంది. సరేలే అదేమంత ప్రధానమైన విషయం కాదు. ఎందుకంటే అన్నివిషయాల్లో, చదువులో, తెలివిలో విజ్ఞానంలో ఇదని అదనీ కాదు అన్నింటా సుందరే నాకన్న అధికురాలు – అది నాకు గర్వకారణమేనని చిన్నప్పుడే కాదు గాని కాస్త పెద్దయ్యాక జ్ఞానోదయమైంది.

"సో, ఇద్దరి మధ్యన బాల్యం నుండి తెలిసీ తెలియని విరిసీ విరియని అస్పష్ట ప్రేమ ఉందని అర్ధమవుతోందిలే, తాతా, మరైతే, హైస్కూల్లో అది ఒకరికొకరికి అర్ధమయ్యే సంఘటనలేమైనా జరగలేదా– సారీ నీ ఫ్లోకి ఆటంకం కలిగించాను – ఏమనుకోవద్దు..........

"సంఘటనలు చాలా జరిగేయిలేరా ఇద్దరిలో ఒకర్ని ఎవరైనా ఏమన్నా అంటే రెండోవాళ్లు వాళ్ళతో యుద్ధానికి పోవటం జరిగేది" అది బాగానే ఉంది ఇద్దరి మీదకి ఒకేప్రాణి దండెత్తితే?" – కొంటె ప్రశ్న వేశాడు.

"భలే జ్ఞాపకం చేశావురా – ఒకసారేమైందంటే – హైస్కూల్లోనేలే, ఓసాయంత్రం మగపిల్లలు గ్రౌండ్‌లో ఫుట్‌బాల్ మేచ్ పూర్తి చేసుకుని ఔట్‌గేట్ వైపు వస్తున్నాం – డ్రిల్ మాస్టారితోసహా – మిగతా బడిపిల్లలంతా వెళ్లిపోయినా, నాకోసమే వెయిట్ చేస్తూ సుందరి గేటు దగ్గరలో ఓ చెట్టు కిందసోఫాలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతోంది. అటువచ్చిన మాకందరికీ ఇంకోవైపు తిరిగి కూర్చున్న సుందరివైపు జరజరా పాకి వెళ్తున్న ఒకపొడుగాటి నల్లత్రాచు పాము కనపడింది.

ఇంకో క్షణంలో సుందరిని పాము కాటేయబోతోందని స్పష్టంగా అర్ధమైంది. డ్రిల్లు మాస్టారితో సహా విద్యార్ధులందరూ నోటమాట పెగలక, ఉన్నచోటనే స్థాణువులా ఉండిపోయారు గాని, నన్ను ఏ దేవత పూనిందో, ఎంత ఆవేశం ఆవహించిందో

తెలియదుగాని డ్రిల్లుమాస్టారు చేతిలోని చిన్నలాఠీ లాక్కుని పరుగెత్తుకుని వెళ్లి పాముపై దాడిచేశాను. ఆ లాఠీతో, "చిన్న పామునైనా కొట్టడానికి పెద్ద కర్ర కావాలన్న సామెత అప్పుడు గుర్తు రాలేదు" తగులుతున్న చిన్నదెబ్బలకు కాస్త బెదిరి కాస్త దారిమరలిందా పాము. కాని ఇంకో దెబ్బ వేశానన్న రోషం వచ్చి కాబోలు, వెంటనే వెనక్కి తిరిగి నావైపు జరజరావచ్చి తోకపై నిలబడినన్ను కాటేయటానికి సిద్ధపడింది. అప్పుడు అప్రయత్నంగా డ్రిల్లుమేష్టారు నోట్లోని విజిల్ ఊదుతూ చేతులతో గట్టిగా చప్పుట్లు కొట్టేరు. అయినా పాము కాస్త ఆగింది కాని, పడగవిప్పి కసి కసిగా బుసలు కొడుతూనే ఉంది. అప్పటి వరకు ఉన్న ధైర్యం ఎటు పారిపోయిందో తెలియదు, నేను చెమటలు కక్కుతూ ఉండిపోయేను, విజిల్ గొడవకి, ఒరేయ్ "ఆ మహంకాళి", ఎవరో కాదులేరా, "సుందరి" ఇటు తిరిగి చూసి నా అవస్థ గమనించి వెంటనే ముందుకు దూకింది. చేత ఏ ఆయుధమూ లేకుండానే వెంటనే స్పందించింది. పాము తోక దొరక పుచ్చుకుని, గిరగిరా గాలిలో తిప్పి దూరంగా విసిరేసింది.

అప్పటికే నేను నేలమీద పడిపోయాను. సుందరి కూడానా పక్కనే ఒరిగిపోయింది. ఇకదగ్గరలో ఎక్కడా లేదు, పారిపోయింది పాము, అని నిర్ధారించుకున్నాక డ్రిల్లుమాష్టారు ఆయన వెంబడి మా సహచర "విద్యార్ధి శూరులు" మా దగ్గరికి వచ్చి మాకు సపర్యలు చేశారు. మాష్టారి దగ్గరి బాటిల్‌లో నీళు ్లముందుగా నాకు తాగించేరు. అదే బాటిల్‌లో నీళ్లు సుందరికీ పట్టించారు......" కాస్త ఆగేడు తాత ఆయాసం వచ్చి "అంటే శోభనం నాడులా నాన్నమ్మ పాలుకాదు గాని ఆనాడే నీ ఎంగిలి నీళ్ళు తాగిందన్నమాట".

"ఏడిశావులేరా! మేం తేరుకున్న తర్వాత విద్యార్థుల్లో వాదోపవాదాలు ఓ గంటసేపు సాగాయి. "ఎవరు ఎవర్ని ప్రమాదం నుండి రక్షించారు? సుబ్రహ్మణ్యమా సుందరియా" అని, ఎటూ తేలక ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్లిపోయాంలే – అదీ సంగతిరా

"మీ ప్రణయ కథ మలుపుల్లేకుండా సాగిపోయినట్లే ఉంది" తాత్కాలిక వియోగం" "విరహం" కూడా ఉండి ఉంటే మరింత మజా ఉండేది తాతా – ఏమంటావ్!"

"అదీ ఉందిలేరా – ఇద్దరం "ఎస్సెల్సీ" బాగానే పాసయ్యాం. ఈ పట్టణంలోనే "కోఎడ్యుకేషన్ కాలేజీ" ఉంది గదా! 'కలిసే చదువుకుంటాం' అనుకున్నా కాని, సుందరి నాన్నకి 'ఎక్కడో దూరంగా, హైద్రాబాద్‌లో మహిళాకళాశాలలో తన కూతుర్ని చదివించాలి మేన మామగారింట్లో ఉంచి' అన్న చిన్న దుర్బుద్ధి పుట్టింది. అలా మూడు నాలుగేళ్లు దూరమైపోయాం. మొదటి సంవత్సరం మాత్రం దసరా సెలవులకి వచ్చింది. వారం రోజుల తర్వాతే మా ఇంటికొచ్చింది. మాచెల్లెళ్ళ ఎదురుగానే "ఒరేయ్ సుబ్బా నీకు మీసాలొచ్చేస్తున్నాయ్‌రోయ్", అనేసి, తన శరీరంలోనూ మార్పులొచ్చాయని స్ఫురించి కాబోలు, వెంటనే సిగ్గు పడుతూ వెళ్లిపోయింది. తర్వాత సెలవులకు వచ్చేదికాదు. మాచెల్లికి మాత్రం ఓసారి ఉత్తరం రాసింది. నాకుకాదు– అందులో మేనమామ ప్రోత్సాహంతో తను మహిళా మండలుల కార్యక్రమాల్లో పాల్గొంటున్నానని స్త్రీ హక్కుల ఉద్యమాల్లో చురుగ్గా పాల్గొంటున్నానని చాలా మజా వస్తోందని రాసింది. ఉత్తరాన్ని మీ అన్నయ్యకి చూపించమని ఆఖర్లో ఇరికించి రాసింది. మా చెల్లినాకు చూపించింది. తర్వాతెప్పుడైనా సుందరి వచ్చిందో రాలేదో తెలియదు గాని నాకు కనపడలేదు. మానాన్న అకస్మాత్తుగా పోయాడు. మా ఆర్థిక పరిస్థితి క్షీణించింది. నాన్న ఉండగానే ఇద్దరు అక్కలకు పెళ్లి చేశాడు. కాబట్టి కొంత నయం. అయినా నేను త్వరగా చదువు పూర్తి చేసుకుని త్వరలో ఉద్యోగంలో చేరాలని ఎవరూచెప్పకుండానే నాకర్థమైంది. బీఏ పూర్తి చేశాను. బి.యి.డిలో చేరాను. సుందరి బి.ఎస్సీ పాసైందని తెలిసింది. ఇంకా ఏం చదువుతోందో తెలియలేదు. బి.ఇ.డి.అవ్వగానే ప్రైవేటు స్కూలులో ఉపాధ్యాయుడిగా చేరేను.

సుందరి అడ్రెసు తెలుసుకుని ఉత్తరం రాద్దామనుకునేంతలో ఓరోజు సాయంత్రం మా చెల్లే నాదగ్గర కొచ్చి భుజం మీద చేతులు వేసి "నీకు తెలియదనుకుంటానురా – సుందరికి బావ ఉన్నాడు. వాళ్లింట్లోనే అదిప్పుడుంటోంది. చాలా అందగాడంట. ప్రస్తుతం ఒకసంవత్సరం క్రితం కోర్సేదో చేయడానికి అమెరికా వెళ్లేడంట. వచ్చే సంవత్సరం వాళ్లిద్దరికి పెళ్లవుతుందేమో", అని చెప్పి వెంటనే వెళ్లిపోయింది. నా మీద పిడుగు పడినట్లైంది. ఆరునెలలు భారంగా గడిచేయి. నేను ఓ ఉదయం దొడ్లోకూర్చుని ఉండగా ఎవరో నెత్తి మీదమొట్టేరు. చూస్తే

సుందరి! కొంచెం ఒళ్లుచేసింది. బాగా అందం తేలింది. ఇరవై ఒక్కేళ్లొచ్చాయి కదా అనుకున్నాను. 'నాకుదక్కని అందం ఎంత ఉంటే ఏం లాభం' అనిపించింది కాబోలు, అప్రయత్నంగా నిట్టూర్చాను. ఏంటి సుబ్రహ్మణ్యం. డల్‌గా ఉన్నావు. "సుబ్బా" అనకుండా ఎప్పటిలా "ఒరేయ్" అనకుండా! ఏం చెప్పాలను కుంటోందో నాకర్థమైంది. ఇద్దరం దూరమైపోయాం. పరస్పరం 'అనిపించింది'. అయినా నాదే తప్పు. సుందరి ఎప్పుడూ చెప్పలేదు నువ్వంటే ఇష్టమని. పరోక్షంగా కూడా చెప్పలేదు. ఆశలు పెంచుకోవటం పెంకుటింటికి, మేడకి ఉన్న అంతస్థుల తేడా గ్రహించక పోవటం నాదే తప్పు. "అనిపించినా వెంటనే దీనికి కొంచెమైనా జాలిలేదు అన్న ఉక్రోషం కూడా తన్నుకొచ్చి "నమస్కారం మీకో నమస్కారం సుందరిగారూ" అని అక్కడి నుండి వీధిలోకి వచ్చేశాను. నన్నాపే, పిలిచే ప్రయత్నం సుందరి చేయకపోవటం నా ఉక్రోషాన్ని మరింత పెంచింది.

ఇంకో సంవత్సరం తర్వాతే సుందరి కనిపించింది. ఊళ్లోకి ఎప్పుడొచ్చిందో తెలియదుగాని, గుళ్లో కనిపించింది. ముఖం చిట్లించి "సుబ్రహ్మణ్యం గారూ మీతో మాట్లాడాలి. దైవదర్శనం తర్వాత" అంది. నాకాశ్చర్యం కలుగలేదు. తన పెళ్ళి శుభలేఖ ఇస్తుంది కాబోలు అనుకున్నాను. దర్శనం తర్వాత ఇద్దరం ఒకపక్కకి చేరాం. చాలాసేపు సుందరి మాట్లాడలేదు. "ఏది శుభలేఖ ఇవ్వు" ప్రశాంతంగానే అని, చెయ్యిసాచేను. "ఇంకా ప్రింటవ్వలేదు" ఈ సారి కొంత మందస్మితం– బుగ్గల్లోసొట్టలు – "మీ బావ చాలా బాగుంటాడంటకద– కంగ్రాట్స్. "ఏం మాట్లాడాలో తోచకఅన్నాను. "థాంక్స్ నిజంగానే బాగుంటాడు.

"సర్లే పెళ్ళెప్పుడు?"

"ఎవరిది? ఎవరితో? – అమాయకం ముఖం పెట్టి అడిగితే వళ్ళు మండింది? "నీదే! నీ బావతో – "తెలియకుండానే గట్టిగా అరిచేశాను. "బావదైతే నిరుడే ఐపోయింది. విదేశంలో ఉండగానే అక్కడమ్మాయిని చేసేసుకుని ఇండియాకి తీసుకొచ్చేశాడు. ఆ అమ్మాయి ఫొటో ముందే నాకు పంపి నేను నచ్చిందన్న తర్వాతే పెళ్లి చేసుకున్నాడు. ఇండియా వచ్చేక నాకు కూడా మంచి ఫ్రెండయిపోయింది. చాలా మంచిదిలే."

"నువ్వు బావని చేసుకోవాలనుకున్నావేమో పాపం" వెటకారంగా అన్నా. "నీమొహంరా సుబ్బూ–మేనరికాలు మంచివికాదని నాకుతెలియదా బావ నాకన్న పదేళ్ళు పెద్ద – బట్టం తల కూడానూ, "పకపకానవ్వేసింది. ఇంకేం అనుమానాలు మిగులుతాయి నాలో? ఐనా ఎందుకైనా మంచిదని, అన్నాను లౌక్యంగా. లేదావేళాకోళం చేయాలనిపించిందేమో.

"ఇప్పుడునీగతి ఏంటి? ఎవడిని పెళ్లాడుతావు"

"నిన్నే అని డైరెక్టుగా అంటే, అది"సుందరి" ఎందుకవుతుంది?

"చూద్దాం – నీబోటిగాడు, అపర మూర్ఖుడు ఎవడో దొరకక పోతాడంటావురా, సుబ్బూ" దాంతో నేను గాల్లో తేలిపోయాను.

"ఓర్నీ సుందరి నాన్నమ్మ భలే తమాషాగా"యునీక్"గా ప్రపోజ్‌చేసిందే. నువ్వు మూర్ఖుడివి. అప్పుడైనా మొదట్నుంచి అంటే బాల్యం నుండినిన్నే ప్రేమిస్తోందని అర్థమైందాలేదా– నమ్మకం కుదిరిందాలేదా?

"నమ్మకం కుదిరిందిరా – ఎందుకంటే అలాపరోక్షంగా "ప్రపోజ్" చేసేసి ఊరుకోలేదు. గుళ్ళో అంతమంది ఉన్నా నాచేతిని ముద్దెట్టుకుని పారిపోయింది ఇంటికి. ఎవరన్నా గమనించారేమో తెలియదు. "సరే అదిరా మనవడామా 100%లవ్‌కథ. సుందరి తన తల్లితండ్రులను ఎలా ఒప్పించిందో నాకు తెలియదు. నెలరోజుల్లోమా పెళ్ళి అయిపోయింది. తను 'ఉత్తమ సతి' గా ఉత్తమ కోడలిగా, కూడా నిరూపించుకుంది. మా అమ్మకి కడవరకు ఎన్నో సేవలు చేసింది. ఆవిడ పోయినప్పుడు నాకన్న నాతోబుట్టువులకన్న ఎక్కువ రోదించింది. పుట్టింటికి మెట్టినింటికి గౌరవం పెంచేలానే వ్యవహరించింది. మెట్టినింటికి ఎంతో మేలు చేసింది. చెప్పాలంటే, తను ఎంత ఘటనాఘటన సమర్ధురాలో తెలియాలంటే ఒక ఉదంతం చెప్పాలి.

ఇది మా పెళ్లైన కొత్తలోనే జరిగింది. సమయానికి ఎలా కనిపెట్టిందో ఏమో మిట్టమధ్యాహ్నం నేను ఇంట్లో ఉన్నప్పుడే మా చెల్లి దుర్గ ఓమూల గదిలోకి దూరి తలుపులు వేసుకుని ఉరివేసుకుని, ఆత్మహత్యాప్రయత్నం చేయబోతే సకాలంలోఅటువైపు నుండి తలుపులు పగలగొట్టి వెళ్లి రక్షించింది – మమ్మల్నందర్నీ

పిలిచి మా ఎదురుగానే దాని చెంప పగలగొట్టింది. తర్వాత ఎలాగో బుజ్జగించి అసలు కారణం తెలుసుకుని, 'నిన్ను మోసగించిన ప్రియుడితో ఓ నెలలోపు నీ పెళ్లిచేయిస్తానని శపథం చేసి, ఇంకోసారి ఆత్మహత్యా ప్రయత్నం చేయనని దానితో మాట తీసుకుంది. మర్నాడే రంగంలోకి దిగింది "ఆ పిరికి ప్రేమికుడి"ని వాడి స్నేహితుల ద్వారానే తన దగ్గరికి బలవంతంగా రప్పించుకుంది. "దుర్గని పెళ్లాడతావా? – జైలుకి వెళ్తావా' అని హుంకరించింది. దాని కడుపులో ఉన్ననీ అంకురంపైన జాలి లేదా ప్రేమ లేదా! అని సెంటిమెంటు కూడా ప్రయోగించింది. తర్వాత వాడి నాన్నదగ్గరికి యాభైమంది మహిళా మండలి స్నేహితురాళ్లతో కలిసి వెళ్లింది. ఊళ్లోని ఆడవాళ్లందరితో బాధితురాలితో కలిసి నీ ఇంటి ముందు ఎన్నిరోజులైనా ధర్నాచేస్తాం. రోజూ టీవీలో వచ్చేలా చేస్తాం.

దుర్గని కోడలిగా చేసుకోవడానికి ఒప్పుకుంటే, వచ్చే మున్సిపల్ఎన్నికలలో ఆదర్శ వివాహం కొడుకుకి చేసిన గొప్పనేత" అని అందరం ప్రచారం చేసి గెలిపిస్తాం. ఒప్పుకుంటావా పెళ్లికి? మా సత్తా చూపమంటావా? అని గర్జించింది. ఒక వారం రోజులలోపునే దుర్గ పెళ్లిచక్కగా జరిగింది. చాలా మందికి తెలియని రహస్యం ఏమంటే సుందరి పదిలక్షల కట్నం ఆశ కూడా చూపించింది ఆ రాజకీయ నేతకు. వాగ్దాన భంగం చేయలేదు. తన నగలమ్మి ఆ కట్నం ఇచ్చింది. ఆ రకంగా ఉత్తమ ఆడబడుచుగారిని రూపించుకుందన్నమాట.

తర్వాత లా పూర్తిచేసి 'ఎమ్మే' కూడా ప్రైవేటుగా చదివింది. బార్కౌన్సిల్లో రిజిస్టర్డ్ చేయించుకుని ప్రాక్టీసు మొదలుపెట్టింది. చాలా వరకుపేద, దీన, అభాగ్య స్త్రీల కేసులే వాదించి వాళ్లకి న్యాయం కల్పించేది, ఫీజుతో నిమిత్తం లేకుండా, అవసరమైన కేసులలో విడాకులిప్పించినా, తగిన వాటిలో మాత్రం బాగా కౌన్సిలింగ్ ఇచ్చి భార్యా భర్తలను తిరిగి కలపడానికే ప్రయత్నించేది. కోర్టు పనులతో అంత బిజీగా ఉంటూనే స్త్రీ జనాభ్యుదయ మహిళా హక్కుల పోరాట ఉద్యమాలలో నిండా మునిగి పోయేది. సంబంధిత సభలలో ఎంతో ఆవేశంగా, "సివంగి"లా ప్రసంగించేది. ఇంకో విషయం. నాకూ నాకుటుంబానికి అచ్చొచ్చిన అదృష్టలక్ష్మి కూడా మీ నానమ్మ– నాతో బలవంతంగా ఎమ్మే, పి.హెచ్.డి. చేయించింది. నేను బడిపంతులు దశ నుండి, చదువుకున్న కాలేజీకే ప్రిన్సిపాల్ అయ్యే అదృష్టం తన వలననే

వచ్చింది.

కొన్నాళ్ల తర్వాత మేం ఎప్పుడో మర్చిపోయిన వరసకి నాకు"అమ్మమ్మ" అయ్యేదూరపు బంధువు ఇంకెవరూ వారసులు లేక తన విలువైన ఆస్తినంతటిని నాకూ వీలునామా రాసి మరణించింది మద్రాసులో. శ్రీమతి సుందరి తన లాయరు తెలివి తేటలన్నీ ఉపయోగించి ఆ ఆస్తి నాస్వాధీనం కావటానికి వచ్చిన ఎన్నో అడ్డంకుల్ని చాకచక్యంగా తొలగించింది. వాటిని విక్రయించి నాకు భారీనగదు సాధించి పెట్టింది. చట్ట బద్ధంగా ఆ అవసరం లేకపోయినా, "మన భాగ్యం ఆడబడుచులతో కూడా పంచుకోవాలని" చెప్పి నా ముగ్గురు, అక్కలకి తలో ఐదేసి లక్షలు ఇప్పించింది. చెల్లి దుర్గకి ఇంకో ఐదు లక్షలు ఇంకా పెళ్లికాని మరో చెల్లి లక్ష్మికి పది లక్షలు ఇప్పించింది. ఇప్పుడు చెప్పు బాబూ - మీ నాన్నమ్మ ఉత్తమ సతి అవునా కాదా?

"పరమోత్తమ సతి, గొప్ప భార్య, గొప్పకోడలు తాతా" మనస్ఫూర్తిగా అన్నాడు సుందర్.

"మీ నాన్న ఒకమంచి పనిచేశాడురా నీకావిడ పేరు పెట్టి".

"ఔను, నిజమే  ఇప్పటికీ మానాన్న నాన్నమ్మ తద్దినాలు క్రమం తప్పకుండా పెడతాడు తెలుసా! నువ్వన్నా పైకి చెప్పడు గాని చాలా గౌరవం సుమా"

"సరే మంచిదే కాని ఆఖరిగా, ఆమె తన ప్రాణం పణంగా పెట్టి  నాప్రాణాలెలా కాపాడిందో కూడా చెప్పాలిరా" "నాకూ అదే సమాచారం కావాలి. అదెలా జరిగిందో తెలిస్తే, నాన్నని తాతని ఒకటి చేయగల్గుతానేమో" మనసులోనే అనుకున్నాడు సుందర్ -

తాత మళ్ళీ చెప్పుకుంటూ పోయేడు- " ఇలా అంతా,బాగుందనుకుంటుండగా విధికి కళ్లుకుట్టాయో - దేవతలకి, ఈ దేవతని తిరిగి తమ మధ్యలోకి రప్పించేసు కోవాలని పించిందో తెలియదు. నాకు అకస్మాత్తుగా జ్వరం వచ్చింది. హాస్పిటల్‌కి తీసుకునే వెళ్లేలోగానే వాంతులయ్యాయి. రక్తపు విరేచనాలు కూడా అయ్యాయి. వారం రోజుల చికిత్స తర్వాత కూడా ఏదీ తగ్గలేదు. అప్పుడు అనుమానం వచ్చి కొన్ని పరీక్షలు చేశారు. లివర్ బయాప్సీ కూడా కాలేయం పూర్తిగా చెడిపోయిందని

ఇక నెలరోజులే జీవిస్తానని డాక్టరు తేల్చేశాడు. సాధారణంగా తాగుడు, మాంసాహారం అలవాటు లేని నాలాంటి వాడికి అలాంటి జబ్బు రాకూడదు కాని దురదృష్టవశాత్తు వచ్చిందని డాక్టర్లన్నారంట. కాని ఇదంతా నాకు తెలియనీయనేలేదు మీ నాన్నమ్మ.

అపర సావిత్రిలా మీ నానమ్మ నడుం కట్టింది. ఎలా తెలుసుకుందో ఏమో, మద్రాసులో రామకృష్ణ ఆశ్రమంలో జన్మత: ఫ్రెంచివాడు అమెరికాలో పెద్ద హాస్పిటల్‌లో ప్రాక్టీస్ చేస్తున్న డేవిడ్ అనే అంతర్జాతీయ ఖ్యాతి ఉన్న ఒక వైద్య నిపుణుడు ఆధ్యాత్మిక పనిమీద వచ్చి ఉన్నాడని తెలుసుకుందట. అక్కడకు వెళ్లి డాక్టర్ డేవిడ్ కాళ్ల మీదపడి ఆయన్ని తనతో నేనున్నఈ పట్టణంలోని హాస్పిటల్‌కి తీసుకొచ్చింది. ఆయన రిపోర్టులన్నీ చూసి ట్రాన్స్‌ప్లాంటేషన్ అంటే 'కాలేయం మార్పిడి'ఒకటే పరిష్కారమని తేల్చేశాడట. ఇవన్నీ నాకు తెలియనీయ లేదు సుమా – చక చకా అన్ని ఏర్పాట్లు చేసేసింది.

ఒకరోజు పొద్దున్నే రోజూ వచ్చే డాక్టర్ మీకో స్కాన్ తీయాలి. చాలా చిన్న విధానమే – అని చెబితే మా ఆవిడ వచ్చేక చూద్దాం అన్నా. "ఆవిడ గుడికి వెళ్లేరు. మీ ఆరోగ్యం కోసం పూజ చేయించివస్తానని – ఇప్పుడే ఫోన్‌వచ్చింది. ఓ పావుగంటలో వచ్చేస్తానని, ఈ లోగా మిమ్మల్ని ఊరికే అక్కడ కూర్చోబెడతాం మీ శ్రీమతి వచ్చిన తర్వాతనే ఏదైనా చేస్తాం అని ఓ నర్సు నాకు నచ్చజెప్పింది. అయితే ఆపరేషన్ థియేటరుకు వెళ్లాక నాకు చెప్పకుండా ఎనస్థీషియా, మత్తుమందు ఇచ్చేరంట – మర్నాడే ఐ.సీ.యు లో కళ్లుతెరిచాను.

"మీకు లివర్ ఆపరేషన్ చేసింది నేనే. నా పేరు డాక్టర్ డేవిడ్. చెడిపోయిన మీ లివర్ స్థానంలో 'దాత లివర్' ముక్క అతికించాం. ఆపరేషన్ విజయవంతం – నిండా నూరేళ్లు బతుకుతారు. తథ్యం" అన్నాడు. నాకు అర్థం కావడానికి కొంత సమయం పట్టింది. "డోనర్ ఎవరు? డోనర్ పరిస్థితి ఎలా ఉంది." అని అడిగేను. "మీ శ్రీమతే డోనర్. అవయవ దాత మీ ఆవిడే. ఇప్పుడు బాగానే కోలు కుంటున్నారావిడ. చాలా గొప్ప మనిషి మీ భార్య. చిన్న ముక్క తీశాం. అంతే ఆమె కాలేయం నెల రోజుల్లో మళ్లీ మామూలు సైజుకి పెరిగిపోతుంది. అని చెప్పేడు కాని నాకెందుకనో విశ్వాసం కలగలేదు.

కాని మర్నాడే నేనున్న రూమ్‌కి షిఫ్ట్ చేశారు నానమ్మని. రెండురోజులు స్వంత ఇంట్లో ఉన్నట్లుగానే తనివి తీరా కబుర్లు చెప్పుకున్నాం. డాక్టర్ డేవిడ్ తిరుగు ప్రయాణమై వెళ్లిపోయాడు, మద్రాసుకి, ఆ మర్నాడే అమెరికా వెళ్ళిపోయాడంట. మరో రెండు రోజులు గడిచేయి. ఇద్దరం కోలుకున్నాం అన్నారు డాక్టర్లు. కాని అకస్మాత్తుగా నాన్నమ్మ అపస్మారకం లోకి వెళ్లిపోయింది, ఓ తెల్లవారు జామున! డాక్టర్లు ఎంత ప్రయత్నించినా కాపాడలేక పోయేరు. రెండు గంటల్లోపే తుది శ్వాసవిడిచింది. లివరు సంబంధిత సమస్యతో కాదు గతంలో ఉన్న ఏదో రోగం తిరగబెట్టి గర్భాశయం సెప్టిక్ అయ్యి చనిపోయిందని నిర్ధారించేరు హాస్పిటల్‌వాళ్ళు.

ఎప్పుడో పెళ్లైన కొత్తలోనే, మీ నాన్న తన కడుపులో ఉన్నప్పుడు ఎందుకనో నా దగ్గర వాగ్ధానం తీసుకుంది మీనానమ్మ.ఏ కారణంవల్లనైనా, ఎప్పుడైనా నాకన్న తను ముందు చనిపోతే, తనవి పనికొచ్చే అవయవాలన్నీ అవసరమైన రోగులకి దానం చేయాలని, అందుకే బంధువులు అభ్యంతర పెట్టినా నా భార్య అవయవ దానానికి ఏర్పాట్లు చేశాను. తన కళ్లతో కార్నియాతో ఇద్దరికి చూపు వచ్చింది. ఇద్దరి డయాలిసిస్ రోగులకి ఆవిడ రెండు మూత్రపిండాలు అమర్చారు. గుండె కూడా ఇంకో రోగికి అమర్చారు, ఆవిధంగా మరణించాక కూడా నానమ్మ త్యాగమూర్తిగా, గొప్ప మహిళా మణిగా “మానవీయురాలిగా” నిలిచింది– ఇంకేమీ చెప్పలేక బోరున విలపించేడు సుబ్రహ్మణ్యం.

తాత తేరుకున్నాక తనకు కావాల్సిన మరికొంత సమాచారం సేకరించాడు సుందర్. దాని ప్రకారం అతను గ్రహించిందేంటంటే....

తాత నానమ్మల దగ్గరికి “పరంధామయ్య తాత” అంటే తన తల్లి తండ్రి వస్తూపోతూ ఉండేవాడు. మంచి మాటకారి. నాన్నమ్మకి వరుసకి అన్నయ్య అవుతాడు. అందుకే అతనంటే ఇద్దరికీ సదభిప్రాయం కలిగింది. సుబ్రహ్మణ్యం తాతే నాన్నమ్మని ఒప్పించి అప్పటికి పదేళ్ల వయసున్న నాన్న శేఖర్ అంటే వాళ్లకి ఏకైక కుమారుడు పేరు మీద నానమ్మ ఆస్తులన్నీ బదలాయించి సంరక్షకునిగా పరంధామయ్య పేరు రాయించేరు. అది జరిగిన ఆరు నెలలకి నాన్నమ్మ చనిపోయింది. ‘కాస్త మార్పుంటుంది. పిల్లాడికి తల్లి మరణంతో చాలా తల్లడిల్లి

పోతున్నాడని మా ఇంటికి తీసుకుని వెళ్తానని కల్లిబొల్లి కబుర్లుచెప్పి మానాన్నని తనింటికి తీసుకుని వెళ్లేడు పరంధామయ్య.

అక్కడ మాయ మాటలు చెప్పి నాన్న శేఖర్‌కి తన తండ్రిపై ఎంతో వైముఖ్యాన్ని కల్పించాడు. మీనాన్న తన స్వార్ధం కోసం ప్రాణం కోసం 'మీ అమ్మ సుందరిని బలితీసుకున్నాడు. ఆమె చనిపోయాక ఆవిడి అవయవాలన్నీ అమ్మి సొమ్ము చేసుకున్నాడు. నిన్నుపెంచటం ఇష్టం లేక నాదగ్గరికి పంపించేశాడు'– ఇలా తప్పుడు మాటలు చెప్పి, నాన్నశేఖర్ మనసు విరిచేశాడు. అంతే, నాన్న తాత దగ్గరికి తిరిగి వెళ్లలేదు. అమ్మ ఆస్తిని అక్రమంగా అమ్మేసుకున్నాడు పరంధామయ్య. తన కూతురు వసంత పేరు మీద ఆస్తులు కొనుక్కున్నాడు. నాన్నశేఖర్‌కి మాత్రం ఇవేమీ తెలియదు. ఆయన సొమ్ముతోనే తనని పెంచి పోషిస్తున్నాడని భ్రమించాడు. ఆ కృతజ్ఞతతో ఆయన కూతురు వసంతని పెళ్లిచేసుకున్నాడు. ఆశేఖర్ వసంతల ఏకైక కుమారుడే సుందర్అనే తను...........

ఇవన్నీ విశ్లేషించుకుంటే నాన్నకి తాతంటే ఉన్న విముఖత తొలగించవచ్చు. తాతని నాన్నని కలపవచ్చు నన్న విశ్వాసం సుందర్‌కి కలిగింది.

మర్నాడు తాతకి "రెండు రోజుల్లో అమ్మానాన్నలతో కలిసి మళ్లీవస్తా. ఇక్కడో అక్కడో అంతా కలిసి ఉంటాం మనందరం, చూస్తావుగా "అని తాత సుబ్రహ్మణ్యానికి చెప్పి, వెళ్లేముందు నాన్నమ్మ ఫొటోకి నమస్కారం పెట్టి, "నాన్నమ్మా తాత చెప్పినట్లు నువ్వు ఉత్తమ, ఆదర్శ గృహిణివి మహనీయురాలివి, త్యాగమూర్తివి మాత్రమే కాదు. మానవతావాదివి అని పైకే అన్నాడు. "ఇదే నా వాగ్ధానం నాన్నమ్మా– ఇకనుండి అమ్మా నాన్న నేను ఇక్కడో అక్కడో తాతతో కలిసే ఉంటాం. బై నాన్నమ్మా. రెండ్రోజుల్లో వస్తా – అని తిరుగు ప్రయాణమయ్యాడు నానమ్మ తలచుకుంటూ.......

రచనా కాలం – 2015

# మా చిట్టి తల్లి ప్రజ్ఞ

అన్ని భాషల్లోనూ, పదాలకి ఆభాష తెలిసిన వారికి, ఆమోద యోగ్యమైన నిర్దిష్టమైన అర్థాలున్నా, స్వీయానుభవాలు, నిస్పృహలు, ఆక్రోశాలు, ఉక్రోషాల రీత్యా, వాటికి 'పెడర్థాలు, "స్ఫురించే అవకాశముంటుంది. ఉదాహరణకి, నా సహోద్యోగి ఒకడు, "మేనేజరు" అంటే "రాక్షసుడు" అని అర్థం అంటూంటాడు. అదే విధంగా ఓ రోజు ఉదయాన, నేను, జడవేయటం పూర్తి చేసి, తనని స్కూలుకి తయారు చేస్తున్నప్పుడు, ఆంగ్ల మాధ్యమంలో, ఆరోతరగతి చదువుతున్న నా కూతురు, "భృత్యుడు"అంటేమీనింగ్ ఏంటి నాన్నా?" అని ఆ పదాన్ని కూడ బలుక్కుంటూ, అడిగినప్పుడు, "మొగుడు" అని అర్థం "చిట్టితల్లీ" అని చెప్పాలనిపించింది! కాని అప్పుడే, హాల్లోకి వస్తున్న మా ఆవిడ రాణిని చూసి జడుసుకుని, నా సమాధానాన్ని గుటుక్కున మింగేసి, బిత్తర చూపులు చూడసాగేను. వెంటనే సర్దుకుని ఏదో చెప్పేలోగా, "మనం హాయిగా కూర్చుంటే ఓపిగ్గా అన్ని పనులు చేసేవాడని అర్థం "ప్రజ్ఞా" అంది.కూతురిని తను అసలు పేరుతోనే పిలుస్తుంది. నా జీన్సే వచ్చేయి అని మురిసిపోతుంది కూడా. నేనైతే చిట్టి తల్లి అని పిలుస్తాను.

"ఓ! ఐ గాట్ ఇట్ మమ్మీ– కొంత మంది హస్బండ్‌లలా, స్లేవ్స్‌లా, అన్నిపనులు చేసే వాడన్నమాట –సర్వెంట్ అన్నమాట " అని నాకు చేతనైనట్లు బాగా బిగుతుగా వేసినతన రెండు జడల్ని, చేతుల్ని తమాషాగా ఊపుతూ అంది, చిట్టితల్లి. దాని మాటలకి తక్షణ స్పందనగా వాళ్లమ్మ ముఖంలో చిరునవ్వులు చిందాయి. కాని అంతలోనే ఏం అనిపించిందో ఏమో, ముఖం మాడిపోయింది! "రిక్షావాడు'బెల్' కొడుతున్నాడు. ఇంకబయల్దేరు, పిచ్చివాగుడాపి, "అని యమా సీరియస్సైపోయి, లోపలికి వెళ్లిపోయింది నావైపు చూడకుండానే. స్కూల్ బేగ్ భుజాన తగిలించుకుని వీదిలోకి పరుగెత్తింది చిట్టితల్లి. వెళ్తూ వెళ్తూ నా వైపు చూస్తూ చిలిపిగా నవ్వింది. ఎందుకో అర్థం కాలేదు నాకు!

–'సరే, ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే ఎలా? పది గంటలకల్లా ఆఫీసుకి వెళ్లాలి కదా– 'బ్రేక్ ఫాస్ట్' తయారు చేసినప్పుడే, కూరగాయలు కోసేసి ఉంచుకున్నాను కదా. వంట ప్రారంభించడానికి ముందు, కాసేపు "న్యూస్ పేపరు"చదవడానికి

టైముందిలే, అనుకుని పేపరందుకున్నాను. మనసంతా,ఏదో పాత ఆలోచనలు కమ్ముకున్నందున దానిపై లగ్నం చేయలేక పోయేను. చిట్టితల్లి నవ్వులానే ఉంటుంది, జమునారాణిది, అంటే నా భార్యామణిది కూడా! పెళ్లిచూపుల నాడు ఆ సమ్మోహన నవ్వుకేకదా, నేను పడిపోయింది! చిన్నప్పుడే తల్లి పోయినందువల్ల, ఎప్పట్నుంచో ఇంటిపనులు, వంటతో సహా అన్నీస్వయంగా చేసుకోవటం అలవాటైన నాకు కొత్తగా వచ్చిన కష్టమే ముంది! చక్కని చుక్కని, భార్యగా, పొందిన అదృష్టం ముందు, బ్యాంకు వాళ్లు ఇస్తున్న భారీ జీతంతో బాటు, స్త్రీధనం" రూపంలో తనకు వస్తున్న పంట పొలాల ఆదాయం ముందు ఇదేమీ కష్టమేం కాదు. ఇంటిపని నాకప్ప జెప్పినా భార్యామణి చేస్తున్న సమాజసేవ, స్త్రీ జనోద్ధరణకు సహకరిస్తున్న నాకూ గర్వకారణం కాదా? – నిన్ననే ఫోనులో తను కార్యదర్శిగా ఉన్న"యంగ్ లేడీస్ క్లబ్" వాళ్లతో కాబోలు మాట్లాడుతుంటే విన్నాను" ఈ సారి వార్షికోత్సవం" లో కొంతమంది ఆదర్శ భర్తలకి ఘన సన్మానం చేద్దామండీ– ప్రతీ స్త్రీ విజయం వెనుకఉండే "సత్పురుషుడే" ఆమె భర్త అని ప్రపంచానికి చాటాలి అన్నది. జాబితాలో నా పేరు ప్రధమంగా ఉండటం తథ్యం. కాని నీకు పేరు ప్రఖ్యాతులొస్తున్నాయి. అవే చాలు – నాకే సన్మానాలూ వద్దు' అని చెప్పేస్తే బాగుంటుందా? ఏమో"

'ఎవరు సతీ పతులౌతారో ముందే స్వర్గం లోనే నిర్ణయమై పోతాదంటారు. అదేమో గాని, ఎవరి పాత్ర ఏంటో మా విషయంలో పెళ్లి చూపులనాడే స్పష్టంగా నిర్ణయమై పోయిన మాట వాస్తవం – పెళ్లిచూపులకి తీసుకుని వెళ్లిన మధ్యవర్తి' ముందే కొన్ని వివరాలు చెప్పేడు. చిన్నప్పుడే నాలానే తల్లితండ్రులు పోయిన జమునా రాణి, చిన్నాన్న చిన్నమ్మ సాకి, విద్యాధికురాలిని చేశారని, తనకి వారసత్వంగా ఉన్న ఆస్తులు దుర్వినియోగం చేయకపోగా, మరింత వృద్ధి చేసి, మైనార్టీ తీరిన వెంటనే అప్పజెప్పేశారని, ఏ విధంగా చూసినా, తను ఇప్పుడు "సర్వస్వతంత్రురాలని కదూ, చెప్పేడు. నా గురించి తను వాళ్లకి చెప్పిన వివరాలు, సిగరెట్లు మందు ఎలానూ లేదు, కనీసం కాఫీ, టీలైనా తాగని మంచివాడినని, పిల్లకి అత్త మామల, ఆడబడుచుల బెడదే ఉండదని కూడా, అన్నిటికి మించి వంట చేయటం కూడావచ్చునని, చెప్పేడంట. ఇవన్నీ వాళ్లకి బాగా నచ్చే నన్ను"ఇంటర్వ్యూ"కి పిలిచారని చెప్పేడు. వంట వచ్చని ప్రత్యేకంగా చెప్పటమెందుకు,

పెళ్లి చూపులన కుండా "ఇంటర్వ్యూ" అంటున్నాడెందుకు' అని అడగాలని పించింది, గాని అడగలేదు. అయితే, ''ఇంటర్వ్యూ''లా ఏం జరగలేదు. మామూలు పెళ్లిచూపులులానే అంతా జరిగింది. నన్ను జమునారాణి వివరాలేమీ అడగలేదు, ముందే తెలుసుగాబట్టేమో మరి! కాదంటే, సిగ్గుపడుతూ ముడుచుకుపోయి కూర్చోలేదు. అప్పుడప్పుడు నా కళ్లలోకి సూటిగా చూస్తూ సమ్మోహనంగా నవ్వేది. ఆనవ్వుకే పడిపోయేను. తన అపురూప అందచందాలకి పడిపోయేను. 'ఈమెను భార్యగా పొందకపోతే నా జన్మవృధా'–అనుకన్నాను. అక్షరాలా అలాగే కాకపోయినా నా సమ్మతి ఆలస్యం చేయకుండా చెప్పేను.

ఆమె కూడా, నాకూ ఇష్టమే గాని" అని కాసేపాగి, లోపలికి వెళ్తూ నన్ను కూడా రమ్మని సైగ చేసింది. నేను మూగగా అనుసరించాను. సూటిగా సుత్తి లేకుండా స్పష్టంగా చెప్పింది. నేను ''అలాగే'' అన్నాకూడా, మరోసారి "ఆలోచించుకోండి" అని 'ఆప్షన్', ఇచ్చింది. 'నేను ఏమీ ఆలోచించవలసిన అవసరం లేదు. మాటతప్పను'. అనేసి, బయటికొచ్చేస్తుంటే, చెయ్యి పట్టుకుని ఆపి, చటుక్కున నా చేతిని ముద్దు పెట్టుకుని, తనూ బయటి కొచ్చింది. ఇంతకీ తను ఎంతో క్లుప్తంగా కొన్ని వాక్యాల్లో మా భావిజీవితాన్ని చిత్రీకరించింది. ఆ వాక్యాలు నాకింకా జ్ఞాపకమున్నాయి. "ఈ ప్రపంచం మరింత మెరుగ్గా ఉండాలంటే, మనలో కొందరైనా అందరికీ భిన్నంగా ఉండాలి. అందరి భార్యల్లా నేను ఇంటి పనికి వంటపనికి పరిమితం కావాలను కోవటంలేదు. సమాజసేవ" స్త్రీ జనోద్ధరణ" నా పవిత్ర ధ్యేయాలుగా ముందుకు సాగాలను కుంటున్నాను. మరి మీరు సహకరిస్తారా? ఇంత క్లుప్తంగా నాలుగే వాక్యాల్లో మా భావి జీవన చిత్రాన్ని కళ్లెదురుగా నిలిపి, వినయంగా ప్రేమగా నాసమ్మతి నర్థించింది. "సహకరించటం" అంటే, సమాజ సేవ చేయడానికి అనుమతించడం మాత్రమే గాని ఇంటి పని వంట పని అంతానేనే చేస్తానని అంగీకరించడం కాదని ఇప్పుడు అనటం భావ్యమా? మాట తప్పటం న్యాయమా? పైగా నాకెంత స్వేచ్ఛనిస్తోంది? ఏం వండాలో, ఏ టిఫిన్ చేయాలో, నిర్ణయాధికారం పూర్తిగా నాకే ఇస్తుంది. కాని 'అది చెయ్ ఇదిచెయ్' అని అనే 'ఆర్డర్' ఎప్పుడూ ఇవ్వదు. చేసిన వాటికి పేర్లు పెట్టదు. కొందరు పెంకి పెళ్లాల్లా ప్రవర్తించదు. ఇదంతా నా పూర్వ జన్మ సుకృతం కాదా?' ఇలా ఆలోచించు

కుంటూండగా, శ్రీమతి బయటికొచ్చింది. నామతి పోయేలా, హాయిగా నవ్వుతూ "బై– డియర్" మీరు సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చేలోగానే ఇంటికొచ్చేస్తా – దార్లో మల్లెపూలు నేనే కొనుక్కొస్తా" అని వెళ్లబోయి, వెంటనే వెనక్కొచ్చి గట్టిగా ముద్దిచ్చి 'హై హీల్' టక టక లాడించుకుంటూ వెళ్లిపోయింది. పెదాలు తడుపుకుంటూ నేనూ 'ఎక్కడికో వెళ్లిపోవాలి' గాని, కర్తవ్యం గుర్తుకొచ్చి వంటింట్లోకి వెళ్లేను.

ఒక్కోసారి పరిణామాలు వేగంగా సంభవిస్తాయి. సాయంత్రం, రోజూ కన్న తొందరగా ఇంటికొచ్చిన నేను, జారవేసి ఉన్న వీధి తలుపులు తీసుకొని వచ్చి, హాల్లో సోఫాలో కూర్చుని బూట్లు విప్పుకొంటున్నాను. లోపలి గదిలోంచి మా శ్రీమతి చిట్టితల్లి మాటలు వినబడుతున్నాయి. "పొద్దున్న" భృత్యుడు" అంటే మీనింగ్ చెప్పావు కదా– సర్వెంట్ అని. మా తెలుగు టీచర్ కరెక్టే' అంటూనే ఇంకా డిటైల్స్ చెప్పింది. "భృతి" అటే 'శాలరీ' అని మీనింగంట – 'భృతి' తీసుకుని పనిచేసేవాడు భృత్యుడంట – మరి నాన్నకి 'శాలరీ" ఇవ్వడం లేదేంటీ? అన్ని పనులు చేయిస్తూ?, "నోర్మూయ్! నీకు ముదురు కబుర్లు బాగా ఎక్కువై పోయాయి. వెళ్లి హోంవర్క్ చేస్కో – పో" చాలా గట్టిగా కసిరింది. రెక్కపట్టుకుని, బరబరా ఈడ్చుకుంటూ హాల్లోకి లాక్కుని వచ్చి నన్ను చూసి గతుక్కుమని, కాసేపటికి తేరుకుని, "ఎంతసేపైందండీ వచ్చి" అనడిగింది. "ఇప్పుడే! దార్లోచూశాను. మీ క్లబ్బు వాళ్లుఏదో బేనర్ పెట్టేరు. "ఆ అదా, వచ్చే శనివారం మన ఎమ్మెల్యే గారితో ముఖాముఖి కార్యక్రమం ఉంది లెండి. మరుగుదొడ్ల నిర్మాణం నత్తనడకన సాగుతోందని కడిగేద్దామనుకుంటున్నాం," అని హుషారుగా చెప్పింది. "కట్టిన వాటినీ సరిగ్గా కడిగే వాళ్లులేరు అని కూడా కడిగేయాలి". అని నేనంటే నా హాస్య చతురతకు సంతోషించింది. చిట్టితల్లి ముదురు మాటలు నేను వినలేదను కోవటం తన సంతోషానికి మరో కారణం కావొచ్చు! చిట్టితల్లి కూడా నా జోక్‌కి పడిపడి నవ్వింది. తర్వాత 'హోమ్‌వర్క్' చేసుకుంటూ కూర్చుందే గాని, "భృత్యుడు" ప్రస్తావన మళ్లీతేలేదు. నాతోపాటు వాళ్లమ్మకూడా'అమ్మయ్య' అనుకుని ఉంటుంది.

అయితే మేం ముగ్గురం డిన్నర్ చేస్తున్నప్పుడు, "ఒకస్మాల్ సజెషన్ మమ్మీ శాలరీ ఇచ్చి మనం ఒకసర్వెంట్‌ని పెట్టుకుందామా? నాన్నకి కొంత రిలీఫ్"అని

అడిగింది. నాకు పొలమారింది. వాళ్లమ్మ గతుక్కుమంది. వెంటనే చిట్టితల్లి“ ఐ అండర్ స్టాండ్ అదింకా డేంజర్. ఆ సర్వెంట్ మన సీక్రెట్లన్నీ అందరికీ రిలీవ్ చేసేస్తాడు, వద్దులే” అని చేతులు కడుక్కోవడానికి వాష్ బేసిన్ దగ్గరికి పోయింది.

మా శ్రీమతి ముఖంలోఎన్నో రంగులు మారిపోయాయి. కోపంతో ముఖం ఎర్రబారిపోయింది. అవమానంతోనో, మరే ఇతర ఫీలింగ్‌తోనో మాడిపోయింది కూడా! కాని, నోరు పెగలలేదు. ఏమీ పట్టించుకోకుండా చిట్టితల్లి మా దగ్గరి నుండి ఇంకో గదిలోకి వెళ్లిపోయింది. వాళ్లమ్మ దీర్ఘాలోచనలో మౌనంగా ఉండిపోయింది చాలాసేపు! తర్వాత ఎవరి దగ్గరి నుండో ఫోను వస్తే మాట్లాడడానికి వెళ్లింది. “ఆ ఊ ” అంటూ అన్యమనస్కంగా, పరధ్యానంగా కాసేపే మాట్లాడి ఫోను పెట్టేసింది. ఇంతలో, “చిట్టితల్లి” మళ్లీవచ్చి తన చిట్టి చేతులతో డైనింగ్ టేబుల్ మీద పింగాణి పళ్లేలు, గాజుగ్లాసులు ఎత్తి సింక్ లో పెడదామని కాబోలు వంటింట్లోకి వెళ్లబోయి, కాళ్లు తడబడి, అన్నీ ఒక్కసారిగా దబేలున పడేసింది. కొన్ని భళ్లున పగిలిపోయాయి. ఆ శబ్దానికి పరుగెత్తుకుని వచ్చిన వాళ్లమ్మ కేసి భయం భయంగా చూస్తూ “వెరి వెరీ సారీ మమ్మీ– నాన్న సాయం చేయమని అడగలేదు – నాకే చేద్దామనిపించింది. బిలీవ్‌మీ ప్లీజ్ – నేనే “క్లీనప్” చేస్తాను. ‘ఓకే’ అంటూ వంగిన కూతురుని భుజం పట్టుకుని ఆపి, నా శ్రీమతి పగిలిన ప్లేట్లు, గ్లాసుముక్కల్ని తనే జాగ్రత్తగా ఎత్తి, గార్బేజ్‌లో పారేస్తుంటే నేను చేష్టలుడిగి ఉండిపోయేను, కాని అమ్మ చూడకుండా చిట్టితల్లి నావైపు విజయోత్సాహంతో చూస్తూ నవ్వుతూంటే కన్ను గీటుతుంటే ఇంకా ఆశ్చర్యపోయేను. తను ఆకాస్త పనిచేసినందుకు కాదుగాని, శ్రీమతి చిట్టితల్లిని ఏమీ తిట్టనందుకు సంతోషపడ్డాను.

కాసేపటికి వంటింట్లోదూరి నేను ఏదో పనిచేసుకుంటూంటే, ఎప్పుడు వచ్చిందో తెలియదు. పిల్లిలా వచ్చిన చిట్టి తల్లి ‘అబ్బా’ అని అరిచేసరికి ఉలిక్కిపడి వెనక్కి చూశాను. కోయడానికి సిద్ధంగా నేను పెట్టిన దొండకాయలను చాకుతో కోయబోతూ, వేలు తెగ్గోసుకుని ‘అబ్బా’ అని అరిచిందని గ్రహించి, “ఏయ్! నిన్నెవరు కోయమన్నారు? అని కోపంగా కసురుకున్నాను. అప్పుడు వంటింట్లోకి వచ్చిన నా సతీమణి, జమున జరిగింది గ్రహించి వెంటనే కూతురి వేలికి మందు రాసి బ్యాండేజి చుట్టి అవసరమైన ప్రాథమికచికిత్స చేసింది చకచకా. కూతుర్ని ఏమీ తిట్టలేదు. “డాడీకి సాయం చేయాలను కుంటే నాకు చెప్పలేక పోయావా. చిన్న పిల్లవి నువ్వే

చేయాలా? చేయి కోసుకోవాలా", అని అనునయంగా అడిగింది కూతుర్ని– అంతే, మా "ముదురు" అవకాశాన్ని వదులుకోలేదు. అంతేలేమ్మా మీఇద్దరూ గుడ్‌కపుల్‌లా పని షేర్ చేసుకుంటానంటే చిన్న పిల్లని మధ్యలో నాకేంఖర్మ. మధ్యలో దూరి వేలు కట్‌చేసు కోవడానికి – సరే మీ ఆయనకి నువ్వే హెల్ప్ చేసుకో – కూరగాయలు కోస్కో నాకవతల బోల్డు పనులున్నాయ్" అనేసింది కళ్లు తిప్పుకుంటూ ఆరిందాలా – మా ఆవిడకేమో గాని, నాకుకోపం వచ్చింది. కాని అది అక్కడనుంచి తుర్రుమంది. దాని మాటలకి ముసి ముసిగా నవ్వుకుంటూ దొండకాయలు కోయటం మొదలెట్టింది భార్యామణి, నాకుఎక్కడలేని కంగారు వచ్చింది. "దాని మాటలు పట్టించుకోవద్దు జమునా– "అన్నా ఆపలేదు. "నేనేదో దానికి ఎక్కించానని, ఇలాంటి ముదురు మాటలు నేర్పానని అనుమానిస్తున్నావా" అని అడక్కుండా ఉండలేకపోయాను, కాసేపైన తర్వాత –

"నాకూతురు మహాతెలివైంది. దానికెవరూ ఏమీ నేర్పనక్కర్లేదు. నాలాగే చాలా తెలివితేటలు – అందుకే "ప్రజ్ఞ" అని పేరు పెట్టుకున్నాను" అని ఊరుకోకుండా, "మిమ్మల్నెందుకు అనుమానిస్తాను? మీరెంత తింగరో" నాకు తెలియదా?" అంది తింగరోడంటే కోపంరాదా మరి ఉక్రోషంగా ఏదో అనబోయాను. కాని ఎందుకో గాని మౌనంగా ఉండిపోయాము. మర్నాడు ఉదయం అయామ్ రెడీ అంటూ లోపలికి వచ్చింది చిట్టితల్లి. మేం ఇద్దరం వంటింట్లో ఉండగా స్వయంగా చకచకా తయారై పోయిందన్నమాట స్కూలుకి. దాని అవతారం చూసిన మాకు నవ్వాగలేదు. తలకట్టు కొత్తగా ఉండాలనుకుంది కాబోలు – నడినెత్తిమీద కొప్పు పెట్టుకుంది. రోజూలాంటి బొట్టు వద్దనుకుని అర్థచంద్రాకారంలో తిలకం దిద్దుకుని మధ్యలో చుక్క పెట్టుకుంది. మొత్తానికి టీవీలో వచ్చే సీరియల్‌లోని "పిల్లమంత్రగత్తె"లా కనిపించింది. పైగా 'బాగున్నానా' అని మూతిసున్నాలా చుట్టుకుని గారంగా అడిగింది. "నీ మొఖంలే – ఇలా చూస్తే స్కూల్లో అంతా జడుసుకుంటారు" – "మరెలా! నాన్నకి జడలేయటం అసలేం రాదు. ఎంతో టైటుగా, పిచ్చి పిచ్చిగా వేస్తాడు. ఇదే బెటర్" అంది.

"ఊ! గొడవచేయకు. నేనే వేస్తాలే" అనేసరికి"భలే భలే" అంటూ గంతులేసింది. మా ఆవిడకూతురికి రెండు జడలు చక్కగా వేసి, బొట్టు పెట్టి మళ్లీ తయారు చేసింది. కూతుర్ని ముద్దు పెట్టుకుంది. నాకైతే ఆక్షణంలో ఇద్దరూ బాగా ముద్దు వచ్చారు. చిట్టి తల్లి అద్దం ముందుకు వెళ్లితనని తాను చాలా సేపు మురిపెంగా

చూసుకుంటూ ఉండిపోయింది. "థ్యాంక్యూమై స్వీట్ మమ్మీ ఎంత బాగావేసావో, అదుర్సంటే అదుర్స్ అనుకో" అని హుషారుగా గంతులేసింది. "రోజూ నువ్వే వేస్తావుగా" అని గారంగా అడిగి అమ్మ చటుక్కున తలూపేసరికి ఇంకా హుషారుగా గంతులేసింది. "చాల్లేసంబడం. రిక్షావాడొచ్చేశాడు. ఇంక వెళ్లుతల్లీ" అన్న తర్వాత వీధిలోకి వెళ్తూ నాకు కన్ను గీటింది, కూరగాయలు తరుగుతున్న వాళ్లమ్మ చూడకుండా! ఆరోజు నుండి చిట్టితల్లి ప్రమేయం గాని ముదురు మాటలుగాని పెద్దగా లేకపోయినా శ్రీమతి ఇంటిపనుల్లో నాభారాన్ని క్రమంగా తగ్గిస్తూ వచ్చింది. మొదట్లో కూరలు తరగటంతో మొదలైన భాగస్వామ్యం "ఎంత ఆర్టిస్ట్‌గా కట్ చేస్తున్నావు మమ్మీ- దొండకాయలు, అరటికాయలు, దుంపలు అన్నీ డాడీ అయితే ఒకేలా కట్ చేస్తారు. నువ్వేమో కట్టింగ్‌లో కూడా అమేజింగ్ ఆర్ట్-వావ్-అని కూతురు ఉబ్బేస్తుంటే క్రమంగా కూరలు వండటం కూడా స్టార్ట్ చేసింది. ' ఓ ! మైగాడ్- వెరీ వెరీ టేస్టీఫుడ్" అని కూతురు పొగుడుతుంటే నెత్తిమీద గారంగా మొట్టేది.

చిట్టి తల్లే సలహా ఇస్తే వాషింగ్ మిషన్, గ్రైండర్ కొన్నాం - ఇంటి పనులలో, శ్రీమతి భాగస్వామ్యం బాగా పెరుగుతూనే ఉంది క్రమక్రమంగా. అలాఅని తన తీరులో, మా చిట్టి తల్లిపుణ్యాన వచ్చిన మార్పుని నేను దుర్వినియోగం చేస్తున్నానని అపోహ పడవద్దు. తను అనుమతించిన మేరకు, ఇంటి పనులలో వంట పనులలో నా భాగస్వామ్యం ఉంటూనే ఉంది. ఇప్పుడు కూడా. కాకపోతే, నా చిట్టితల్లే ఊరుకోదు. అంతా షేరింగ్ ఉండాలని అంటుంది. తను కూడా ఇద్దరికీ సాయం చేస్తూనే ఉంటుంది. వద్దన్నా వినదు. మా శ్రీమతి కూడా తన సమాజసేవ పూర్తిగా వదలుకోలేదు. ఇంటి బాధ్యతలు పంచుకుంటూనే ఆపనీ చేసుకుంటోంది. నా ప్రోత్సాహంతో. ఇదండీ, మా ఇంట్లో పరిస్థితిని ఎంతో తెలివిగా మార్చిన మా చిట్టితల్లి, అదే ప్రజ్ఞ అనే సార్థక నామదేయురాలు. నా తెలివైన కూతురుని ఇప్పుడు"చిట్టి తల్లి" అనటం మానేసి ప్రజ్ఞ అనే పిలుస్తున్నాను, సగర్వంగా. మరో విషయం నేనిప్పుడు 'ఆదర్శ భర్తగా' లేడీస్ క్లబ్ వాళ్లతో సన్మానం చేయించుకోవాలని కోరుకోవటం లేదండోయ్! మేంఇద్దరం, ఆదర్శదంపతులని అందరూ గుర్తిస్తే చాలనుకుంటున్నాను.

రచనా కాలం - 2015

# గుడ్ ట్రాన్స్ జెండర్

(మంచి ఇతరుడు)

"నమస్కారమండి, నాపేరు కోమల....రావు.....అదే మీ "ఆప్తురాలు" 'సుందరి" ని పెళ్లిచేసుకున్న"వ్యక్తిని"...., మరి మీరు సుశీలగారే కదండీ... యూనివర్శిటీకి వెళ్లడానికి బస్సుస్టాపు దగ్గర వేచి ఉన్న సుశీల ఒకింత ఆశ్చర్యపోతూనే ఆ "అపరిచితుడి" ప్రశ్నకు"ఔ"నన్నట్లు తలూపిందే గాని, తన బాల్యస్నేహితురాలి ప్రస్తావన విన్న"పులకరింత" నుండితేరుకోలేని స్థితిలో కాసేపు మౌనంగా ఉండి పోయింది, అయితే ఆ కొద్ది క్షణాల్లోనే తన "ఆప్తురాలి" గురించి జ్ఞాపకాలు మనసుని ముప్పిరిగొన్నాయి.

'నిజమే "సుందరి" తనకెంతో ఆప్తురాలు– నాలుగు సంవత్సరాల క్రితం వరకు, తమ ఇద్దరి కుటుంబాలు, గుడివాడలో పక్క పక్క ఇళ్లలోనే నివసించాయి. తను సుందరి, ప్రాథమిక విద్య నుండి కాలేజి వరకు కలిసే చదువుకున్నారు. ఇతరులకు కన్నుకుట్టేంతగా ఎంతో సన్నిహితంగా, స్నేహంగా మెలిగేవారు. అయితే పదోన్నతితో నాన్నకి వచ్చిన బదిలీ ఉత్తర్వులు కారణంగా రెండు కుటుంబాలు విడిపోవాల్సి వచ్చింది. తన తల్లిదండ్రులతో హైద్రాబాద్, వచ్చేక తను ఇక్కడి యూనివర్శిటీలో పోస్టుగ్రాడ్యుయేషన్‌లో చేరింది. విడిపోయేటప్పుడు ఆ "పిచ్చిది" సుందరి బోరున విలపించింది. తమస్నేహం కలకాలం, జీవితాంతం కొనసాగాలని పరస్పరం చేసుకున్న బాసలలో భాగంగా, సుందరే, కాస్తయినా సిగ్గుపడకుండా, "మనలో ఎవరికి ముందు పెళ్లైనా, "తొలిరాత్రి అనుభవాలు" ఎటువంటి అరమరికలు, దాపరికాలు లేకుండా రెండో వారితో నిజాయితీగా పంచుకోవాలి సుమా!" అని తన పెద్ద కళ్లు తమాషాగా తిప్పుతూ అంది.

సుందరికే ముందుగా పెళ్లైంది. మూడు నెలల క్రితం – కాని అదే సమయానికి తనకి యూనివర్శిటీలో పరీక్షలు ఉండటంతో పెళ్లికి వెళ్లలేకపోయింది. అమ్మానాన్న మాత్రం వెళ్లివచ్చి పెళ్లిచాలా ఘనంగా జరిగింది. మగపెళ్లివారు చాలా సంపన్నులు, అన్ని ఖర్చులు వాళ్లే పెట్టుకున్నారంట. ఏమైనా సుందరి అదృష్టవంతురాలు" అని చెప్పి తనకి, అపరిమితానందాన్ని కలిగించారు. పదిరోజుల వరకు సుందరి

నుండి ఫోను రాకపోవటం తనకి కొంత అసంతృప్తిని కలిగించింది. "పెళ్లికి రాలేదని అలిగిందా, లేక ఇచ్చిన మాట ప్రకారం "తొలిరాత్రి అనుభవాలు" చెప్పాల్సొస్తుందని సంకోచి స్తోందో" అర్థం కాలేదు. ఆఖరికి ఉండబట్టలేక వాళ్లింటి లాండ్‌లైన్ నెంబరుకి ఫోన్‌చేసింది. తనే ఫోన్‌ఎత్తింది. నా చదువు గురించి తెలుసుకోవాలని ఆరాటపడిందే గాని "ఆ సంగతుల" ప్రస్తావనే లేకపోవటంతో బాగా వళ్లుమండింది. "బాగా చదువుకోవే" అంటు సుద్దులు చెప్పి ఇంక ఉంటానే అనేసి, టక్కున ఫోన్‌పెట్టేసింది.

పక్కన ఎవరన్నా ఉన్నందున "ఆ సంగతులు" చెప్పలేక పోయిందేమోనని సర్ది చెప్పుకోవటం నా వంతైంది. అయినా, తెలిసి తీరాల్సిన సంగతులు తెలియకుండా ఉండి పోయాయన్న అసంతృప్తి కూడా మిగిలిపోయింది అంతరాంతరాల్లో. తర్వాత వారం రోజులు భారంగా గడిచాక సుందరి నుండి ఒక ఇన్లాండ్ కవర్ అందింది. ఆ అంతరంగిక లేఖలో ఇతర సంగతులు పెద్దగా లేవు. అసలు సంగతి మాత్రం క్లుప్తంగా ఇలా ఉంది. "తను చాలా మంచి వారు (ఇది చదివినప్పుడు నాతో చాలా సార్లు సుందరి మన "అమ్మలు", మొగుళ్ల పేర్లు ఇతరులకి చెప్పటానికి సంకోచిస్తారు "తను, ఆయన, "మా చంటోడి నాయన" అలా ఏవోవో పిచ్చి పదాలు వాడుతారు. ఏంపేరు చెప్పితే ఏం పాపం వస్తుంది? పైగా వాళ్లుతమని "ఒసేవ్" 'ఏమేవ్', అని పిలిచినా వీళ్లుమాత్రం ఏకవచనం వాడనే వాడరు. ఎంతో గౌరవిస్తారు. "డు" వాడరు. అతడు అనలేరు వారు మా'వారు' అంటారు. వస్తాడు 'తెస్తాడు', అనలేరు.'వస్తారు' – 'తెస్తారు' అంటారు. నేనైతే అతడు అనే అంటాను – పేరుతోనే పిలుస్తాను. ఒసేవ్, అంటే "ఒరే" అనే అంటానని వేరే చెప్పాలా? మొగుడూ పెళ్లాలు అన్యోన్యంగానే కాదు సమస్థాయిలో కూడా ఉండాలి. ఎవరూ తక్కువగా ఉండరాదు. ఇలా ఎన్నిసార్లో ఉద్రేకంగా చెప్పిన విషయం జ్ఞాపకం వచ్చి నవ్వొచ్చింది నాకు) అయితే తర్వాత వాక్యాలు ఆనందాన్ని కలిగించాయి. అవేంటంటే "వారు" చాలా అందంగా ఉంటారు. ఎంతో సరసులు – తొలిరాత్రే కాదు. ఇప్పటికీ రోజుకి "పదిసార్లైనా కలుస్తుంటాం" ప్రతీసారీ శృంగారానందంలో మునిగిపోతుంటాం. పెళ్లికాని పిల్లవి ఇంతకన్నా ఎక్కువ చెప్పకూడదు నీకు! వారితో జీవితాంతం సుఖంగా ఉంటా. ఇంక ఉంటామరి ఉంటా. "రెండు "ఉంటా"లతో క్లుప్తంగా ముగించింది. సిగ్గుపడకుండా (లేకుండా) రాసిన సుందరి లేఖ "పదిసార్లు"వంటివి "అతిశయోక్తి"

పదాలుగా (శరీర శాస్త్రం జెనెటిక్స్ ప్రత్యేక సబ్జెక్ట్‌గా పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్న నాకు) అర్థమైనా సంతోషాన్ని కలిగించింది. అయినా ముఖాముఖి మాట్లాడాలనిపించి వాళ్లింటికి ఫోన్‌చేస్తే సుందరి నాన్న“అది అత్తవారింటికి వెళ్లిపోయిందమ్మా” అని క్లుప్తంగా చెప్పేసి ఫోన్‌పెట్టేశారు అక్కడిఫోన్ నెంబరు గాని సుందరి సెల్ నెంబరు గాని చెప్పమని అడిగే లోగానే. తనూ ఈ రెండు మూడు నెలలూ యూనివర్శిటీ కార్యకలాపాల్లో చదువులో బిజీగా ఉండిపోయింది. ఇప్పుడితను అకస్మాత్తుగా వచ్చేదు కారణం ఏమిటో..???

“ఏమండీ– మిమ్మల్నే” అమ్మ నాన్నపరధ్యానంగా ఉన్నప్పుడు అనేలా కోమలంగా ఉన్న మాటలు వినపడి, ఆలోచనలు తెగిపోయాయి సుశీలకి. గతుక్కుమనీ కోమలరావు వైపు చూసింది. తనకు కొంచెం దూరంగా కొంచెం మొగమాటంగా నవ్వుతూ నిల్చున్న ఆ ‘రూపాన్ని’ నిశితంగా గమనించింది.

“నిజంగా అందంగానే ఉన్నాడు. మంచివాడే ననిపించేలా కూడా. మంచి ఒడ్డూపొడవు – ముఖం మాత్రం చాలా “కోమలంగా” ఉంది. అవునూ, తనపేరు కోమలరావు అనే చెప్పాడు గదా“అని మనసులో అనుకుని “సుందరి బాగుందాండి? – ఏమిటి ఇలా వచ్చారు?” అని అడిగింది సుశీల మార్దవంగా అభిమానంగా – రెండు ప్రశ్నలకీ, సమాధానం చెప్పకుండా“అనుమతిస్తే మీతో కొంచెం, కాదు, చాలా మాట్లాడాలి” అంటూనే అనుమతి కోసం ఎదురు చూడకుండానే పక్కనున్న పార్కులోకి దారితీస్తున్న తన ఆప్తురాలి భర్తను మౌనంగా అనుసరించింది సుశీల. కొంచెం పెద్దగా ఉండి, వయ్యారంగా నడుస్తూంటే కొద్దిగా ఊగుతున్న అతడి పిరుదుల్ని వింతగా చూస్తూ. ఇద్దరూ ఒక చెట్టు కింద కూర్చున్న తర్వాత కూడా కొన్నిక్షణాలు మౌనమే రాజ్యం చేసింది. కాని తన కళ్లల్లోకి సూటిగాచూస్తూ, అభిమానంగా సుశీల నవ్విన తీరు, సుందరి భర్తకు కొండంత ధైర్యాన్నిచ్చింది కాబోలు, తలవంచుకునే ‘కొంచెం సంకోచిస్తూనే .......... “మరండీ... మరి...... విషయమేమిటంటే.... మరి “విషయమేమిటంటే, అంటూ నీళ్ళు నమిలాడు సుందరరావు. “మీరు నా ఆప్తురాలి భర్త “నిదానంగా చెప్పండి... ఏది చెప్పినా..... ఎంతసేపు చెప్పినా సావధానంగా వింటానని హామీ ఇస్తున్నాను. ఇంకో “ముందస్తు

హామీ ఏమిటంటే మధ్యలో అడ్డుపడను. సరేనా... “సుశీల చిలిపి పలుకులకు కోమలరావుకీ నవ్వు వచ్చింది. మరింత ధైర్యము కూడావచ్చి సహజవాగ్ధాటి పెల్లుబికింది.

“ధన్యవాదాలండీ– సవివరంగా చెప్పాలి అసలు విషయం సుదీర్ఘ ఉపోద్ఘాతంతో సహా – చూడండి– అదేలెండి వినండి. కాస్తో కూస్తో మీకు తెలిసే ఉండొచ్చుగాని, ఏమీ తెలియని వాళ్లకు చెప్పినట్లుగా చెబితేనే నాకు తృప్తిగా ఉంటుంది, మధ్యలో విసుక్కోవద్దని నా అభ్యర్థన... “ఒకసారి తలెత్తి సానుకూలంగా అంతకన్న ఎక్కువగా ప్రోత్సహించేలా ఉన్న సుశీల తీరు చూసి మరింత ఉత్సాహంగా ఉపన్యాస ధోరణిలో, కొనసాగిందిలా కోమలరావు వివరణ. .... “మరండీ, మనుష్యులు రెండే రకాలనుకుంటే, మంచివాళ్లు, చెడ్డవాళ్లు– మూడోరకం ఉందనుకుంటే కొన్ని విషయాల్లో మంచివాళ్లు కాని చాలా విషయాల్లో చెడ్డవాళ్లు. నిజానికి ఇలాంటి వాళ్లే ఎక్కువమంది. ఈ తర్జన భర్జన వదిలేస్తే మనుషులందరూ రెండే రకాలు అనుకుంటే అది పురుషుడు – స్త్రీలు అన్నది. ఆండ్రోజెన్ అనే పురుష “హార్మోన్” అధిక స్థాయిలోనూ “ఈ స్ట్రోజన్ హార్మోన్” అత్యల్ప స్థాయిలో ఉండే వాళ్లు పురుషులు.

అదే విధంగా ఈ స్ట్రోజన్ హార్మోన్ అత్యధిక స్థాయిలో, పురుష హార్మోన్ ఒకవేళ ఉన్నా చాలా తక్కువ స్థాయిలో ఉన్నవాళ్లు స్త్రీలు అన్నది సాధారణ వర్గీకరణ – సరే ఈ స్త్రీ పురుషులకు చాలా వరకు, శరీరభాగాలు, అంటే ముఖం, ముక్కు, చెవులు, కాళ్లువంటివి చాలా స్వల్ప తారతమ్యాలతో దాదాపుగా ఒకేలా ఉన్నా పునరుత్పత్తి కోసం ఉన్న భాగాలు కొన్ని శారీరక ధర్మాలు భిన్నంగా ఉంటాయి. స్త్రీ పురుషుల లైంగికసంపర్కం మూలానే కదా పునరుత్పత్తి, అదే సంతానం కలిగేది? అయితే, వాస్తవానికి మనుషులందరినీ, స్త్రీలు పురుషులుగా రెండే రకాలుగా వర్గీకరించటం, సరైనది కాదు. సృష్ట్యాది నుండి మానవులలో స్త్రీలు పురుషులతో బాటుగా “మూడో రకం” కూడా ఉంటూనే ఉన్నారు. తమకి తగిన గౌరవం, ఆదరం లేకుండా క్లుప్తంగా చెప్పాలంటే శారీరకంగా గాని, మానసికంగా గాని, ‘సంపూర్ణంగా’ లేని మనుషులే ఈ మూడోరకం. ఇలాంటి వాళ్లు సృష్ట్యాది నుండి ఉంటున్నారు.

ఉదాహరణకు పురాణాలు, ఇతిహాసాల్లో కూడా "బృహన్నల" "శిఖండి", వంటి పాత్రలున్నాయి కదా! అప్పుడూ ఇప్పుడూ కూడా, మానవజాతిలో, పురుషులు, స్త్రీలతోబాటు, ఈ మూడోరకం వాళ్లుకూడాఉంటూనే ఉన్నారు పరిమిత సంఖ్యలోనైనా – 'జన్మత: పురుష హార్మోన్ల లోపం ఉండిగాని, పురుషాంగం లోని కొన్నిలోపాల మూలంగా గాని, పైకి స్థూలంగా మగవాళ్లలా కనిపించినా, ఇలాంటి వాళ్లు వాళ్ల తప్పులేక పోయినా సంఘంలో ఎంతో అనాదరణకు, అవమానాలకు గురవుతుంటారు. వాళ్లనే ముతక భాషలో, "నపుంసకులు" "హిజ్రాలు", "కొజ్జాలు" అని అతి హీనంగా పిలుస్తారు. ఇటీవల కాలంలో కొంత గౌరవప్రదంగా పేర్కొంటున్నారు. "థర్డ్ జండర్" లేదా ఇతరులు  అని అంటున్నారను కోండి, కాని ఇది ఓటర్ల లిస్టుకే పరిమితమైందనే చెప్పాలి. సంఘంలో తమకి ఎదురయ్యే అవమానాలకు ఎంతో కుమిలిపోతారు. అటువంటి వాళ్లు కాని వివక్షకు, అవమానాలకు గురయ్యే ఇతర వర్గాలకు లభించే సానుభూతి మాత్రం వాళ్లకి దక్కదు.

అనట్టు, ఇటీవలి కాలంలో ఆంగ్లభాషలో, ఇలా సంపూర్ణంగా స్త్రీలుగాని పురుషులుగాని కాని వాళ్ల నుద్దేశించి మరో పదం, ట్రాన్స్ జెండర్స్ అన్నది వాడుకలోకి వచ్చింది. "థర్డ్‌జెండర్" అని ఆంగ్లభాషలో లేదా నపుంసకులు అని మనభాషలో పేర్కొనబడే వారి గురించే, అంటే స్థూలంగా పురుష రూపంలో ఉన్నా కొన్ని లోపాల, రీత్యా అలా పిలవబడే వారి గుర్తించే ప్రస్తావించాను.

ఇప్పటివరకు– కాని ఈ "ట్రాన్స్‌జెండర్స్" అన్నది, ఇంకా విస్తృతమైన అర్థం ఉన్నపదం – ఈ మూడో రకం మనుషులలో, అంటే పుంసత్వం లోపాలున్న వారు మాత్రమే కాదు, శారీరక లోపాలు మాత్రమే కాదు స్వభావ రీత్యా లైంగిక ఇచ్ఛలలో భిన్నత్వం ఉండి మరికొన్ని రకాల మనుషులు కూడా ఉంటారన్నది ఈ "ట్రాన్స్‌జెండర్" అన్న పదం సూచిస్తుంది. ఇంకా బాగా అర్థం కావడానికి ఎల్.జి.బి.టి" అని ఇలాంటి వాళ్లని ఉపవర్గాలుగా చెబుతున్నారు. మరి ఎల్" అంటే ఎలాంటి వాళ్లంటే....

ఇంత వరకు అతికష్టం మీద చెప్పిదంతా మౌనంగానే విన్న సుశీల ఇంక ఆగలేక పోయింది – తనిచ్చిన "ముందస్తు హామీని" విస్మరించి వెంటనే ఉత్సాహంగా అనేసింది, "నాకుతెలుసు "ఎల్" అంటే "లెస్బియన్స్" స్త్రీలతోనే సంపర్కం కోరుకునే స్త్రీలు. "జి" అంటే "గే" లు–పురుషులతోనే సంపర్కం ఇష్టపడే మగవాళ్లు, మన భాషలో స్వలింగ సంపర్కులు. ఇకపోతే "బి" వర్గం వాళ్లు బైసెక్సువల్స్ "టి" అంటే నపుంసకులు హిజ్రాలు అనే ట్రాన్స్‌జెండర్లు.

మీరు చెప్పని ఇంకో విభాగం "క్యూ" అంటే క్వీర్ కూడా ఉంది. వీళ్లని "విచిత్రుల"ని తెలుగులో అనొచ్చు, సుశీల వివరణకు బిత్తరపోవడం కోమలరావు వంతైంది. తనకి ఆమె చదువుకుంటున్నదని తెలుసుగాని ఏ సబ్జక్టులోనో తెలియదు కదా. ఆవిడ పరిజ్ఞానానికి విస్తుపోయి, ఇంతవరకు తనిచ్చిన సుదీర్ఘ ఉపన్యాసానికి సిగ్గుపడాల్సొచ్చింది. ఏమి మాట్లాడలేక బిత్తర చూపులు చూస్తూ ఉండిపోవటం తప్పనిసరైంది. దాంతో సుశీల మరింత రెచ్చిపోయింది.

"ట్రాన్స్ జెండర్స్" పట్ల, వారెదుర్కొంటున్న వివక్ష, అవమానాల పట్లమీరు వెలిబుచ్చిన ఆవేదన నిజంగా ప్రశంసార్హం – కాని వారి పట్ల సమాజం యొక్క దృక్పథం మెల్లగానైనా క్రమంగా మారుతోంది కదా! వాళ్లూ చాలా విషయాల్లో మనలాంటి మనుష్యులేనని, సమాన హక్కులకి అర్హులేనని, ఆమాటకొస్తే సమానత్వంతో బాటు కొన్ని ప్రత్యేక హక్కులకి అర్హులన్న అభిప్రాయం, సానుభూతి చాలా ఇతర దేశాలతో బాటు, మన దేశంలో కూడా వేళ్లూనుకుంటోన్న విషయం మీకు తెలుసను కుంటున్నాను.

మీరన్నట్లు, ట్రాన్స్ జెండర్స్ అంటే కేవలం పుంసత్వం' లోపించిన, హిజ్రాలు కొజ్జాలుగా అవమానకరమైన రీతిలో పిలవబడేవాళ్లు మాత్రమే కాదు. నేనిందాక చెప్పిన "ఎల్.జి.బి.టి.క్యూలు కూడా. ఇంకో విషయం సమాజంలో పురుషులుగా లేదా స్త్రీలుగా చలామణి అవుతున్న చాలామందిలో కొందరు, సంపూర్ణంగా పురుషులు, సంపూర్ణంగా స్త్రీలు కాని వాళ్లూ ఉన్నారన్నది ఒక అప్రియమైన వాస్తవం. కాదంటే, పరువు నిమిత్తం బయట పడరంతే. ఇప్పుడిప్పుడే కొంత మార్పు వస్తోందను కోండి. వాళ్ల పట్ల మానవ సమాజంలో "ఉదారవాదం" బలపడుతోంది కదా!

కొంతమంది "ట్రాన్స్‌జెండర్లు," ధైర్యంగా బాహాటంగా తమని 'గే'లు గా ప్రకటించు కోవటమే కాకుండా తన సహజీవన సహచరుల్ని, ప్రపంచానికి పరిచయం చేయటం జరుగుతోందిప్పుడు.

కొన్నిదేశాలలో స్వలింగ సంపర్కుల మధ్య వివాహాలు కూడా చట్టబద్ధం చేయబడ్డాయి. మనం అంతవరకు ఇంకా వెళ్లలేదుగాని మన సుప్రీంకోర్టు కూడా స్వలింగసంపర్కం, నేరంగా పరిగణించే ఐ.పి.సి. సెక్షన్ 377ని కొట్టేసింది. వైద్యశాస్త్రం కూడా అభివృద్ధి చెందింది. ట్రాన్స్ జెండర్లు అటూ ఇటూ కాని వాళ్లుగా శాశ్వతంగా ఉండిపోవాల్సిన దుస్థితి నేడు లేదు. లింగ మార్పిడి, శస్త్ర చికిత్సలు హార్మోన్ చికిత్సలూ విజయవంతంగా జరుగుతున్నాయి.

ఒక్క ఉదాహరణ చెబుతాను. ఇన్నేళ్లుగా "గౌరవ్" అనే పురుషునిగా చెలామణి అయిన ఒక కథక్ నృత్య కళాకారుడు ఇటీవలనే రెండు మూడు శస్త్ర చికిత్సల ద్వారా సంపూర్ణ స్త్రీగా మారి నృత్యకళ కొనసాగిస్తున్నాడు. సారీ, కొనసాగిస్తోంది. తను చెబుతున్న విషయాల్ని బాగా చెబుతున్నారన్నట్లుగా ప్రోత్సాహంగా చూస్తూ, శ్రద్ధగా వింటున్న కోమలరావు ధోరణి బాగానచ్చి ఇంత సుదీర్ఘంగా ప్రసంగించిన సుశీల ఒక్క క్షణం ఆగింది. అంతలోనే మళ్లీ మెల్లగా ఇలా అంది. "సారీ సర్!" ట్రాన్స్‌జెండర్ల గురించి బాధపడటమే గాక, వాళ్లకోసం పనిచేస్తున్న, క్రియాశీలక కార్యకర్తగా, ఉద్యమకారునిగా మిమ్మల్ని అర్థం చేసుకుని "నిరాశపడొద్దు – మీ కృషి వృధాకాదు అని ప్రోత్సహించడానికే ఇంత ఎక్కువగా వాగేను. ఏమీ అనుకోకండి ప్లీజ్!"..............

"అబ్బెబ్బే – మీకూచాలా విషయాలు తెలుసని ఆనందిస్తున్నాను. అంతేగాని ఏమీ అనుకోవటం లేదు. సరే ఇంతకీ నాగురించి మీరేమను కుంటున్నారు?

"నైస్‌గై" అనుకుంటున్నాను. మా సుందరికి తగిన భర్త, నాకు మంచి మిత్రుడను కుంటున్నాను. "ట్రాన్స్‌జెండర్ల" కోసం పరితపిస్తున్న "ఏక్టివిస్ట్" అదే ఉద్యమకారుడను కుంటున్నాను."

"మీరు నన్ను"నైస్ గై" అదే "మంచి వాడన్నందుకు ధన్యవాదాలు. అసలు నిజం ఏంటంటే... మరి ఏంటంటే... ఎంతో అందగత్తె ... మంచిది.... సంపూర్ణ

స్త్రీ అయిన మీ సుందరికి నేను తగిన భర్తను కాను. ఎందుకంటే నేను కూడా ట్రాన్స్‌జెండర్‌ని "ఇతరుడిని. ఆత్మహత్య చేసుకుంటామన్న తల్లితండ్రుల బెదిరింపులకి లొంగిపోయి మీ స్నేహితురాలు సుందరిని పెళ్లాడి తనకి అన్యాయం చేసాను గాని ఇప్పుడైనా తప్పుదిద్దుకోవాలని తపన పడుతున్నాను. ఈ మాటలు సుశీల నెత్తి మీద పిడుగు పడినట్లై నిస్తేజమైపోయింది

"తొలిరాత్రే సుందరికి నా గురించి వాస్తవాలన్నీ చెప్పేను. "పర్వాలేదులెండి జీవితాంతం మీ భార్యగానే ఉంటానన్న" మంచితనం తనది. కాని తనను అలా మోడు బారినట్లు చేయటం నాకు మనస్కరించటం లేదు. విడాకు లిచ్చేసి, తగిన సంబంధం చూసి తనకి మళ్లీ పెళ్లిచేయాలని తపన పడుతున్నాను. కాని "ససేమిరా" అంటోంది. ఒప్పుకోవడం లేదు. నా తల్లితండ్రులనైతే ఒప్పించ గలిగేను, కాని ఆమెను ఒప్పించలేక పోతున్నాను! నాకున్న వారసత్వపు ఆస్తిలో సగం ఆ"నవ దంపతుల"కివ్వడానికి సిద్ధంగా ఉన్నాను. సుందరిని పెళ్లికొప్పించడానికి మీ సహకారం కోరడానికి మీదగ్గర కొచ్చేను. నిజాయితీగా చెప్పిన ఆ మాటలకి సుశీల తేరుకుంది. కాని మౌనంగానేఉండిపోయింది.

"నేను" లింగ, మార్పిడి ఆపరేషన్‌కి అన్ని ఏర్పాట్లు ఇప్పటికే చేసుకున్నాను. "సంపూర్ణ స్త్రీగా మార్చగలమని ముంబైలో ఉన్నవైద్యులు హామీ ఇచ్చేరు. తగిన పురుషునితో వివాహ జీవితం కూడా అనుభవించగలనని కూడా అంటున్నారు. కాదంటే గర్భ సంచి లేని కారణంగా సంతానం మాత్రం పొందలేను. ఎవర్నో దత్తత తీసుకునే ప్రత్యామ్నాయం ఉంటుంది కదా.

మీరు దయచేసి సహకరిస్తే మా ఇద్దరి జీవితాలు బాగుపడతాయి. ఇకమీ ఇష్టం" అంటూ కాళ్లమీద పడిపోయే సరికి, పూర్తిగా కరిగిపోయింది సుశీల.'అతని' భుజాల మీద ఆప్యాయంగా, చేతులువేసి పైకి లేపి సంతోషంగా తన హృదయానికి హత్తుకుంది. పరాయి పురుషుడని భావించలేదు.'సన్నిహితురాలిని, ఆలింగనం చేసుకుంటున్నాను అని అనుకుంది.

'ఇక అంతానేను చూసుకుంటానని' అభయ మిచ్చేసింది. సుశీల ఏమాత్రం ఆలస్యం చేయకుండా కార్యరంగంలోకి దిగిపోయింది. ముందుగా తన తల్లిదండ్రుల

కన్నీ వివరించి వాళ్లఅనుమతి పొందింది. స్నేహితురాలు సుందరిని విడాకులకి, "పునర్వివాహానికి" ఒప్పించటం చాలా కష్టమైంది గాని మొత్తానికి సాధించింది. ఇందుకు సుందరి తల్లిదండ్రుల, అత్తా మామల సహకారం తీసుకుంది.

సుందరికి కోమలరావుకి 'పరస్పర సమ్మతితో' కోర్టు ద్వారా విడాకులు మంజూరయ్యాయి అనతికాలంలోనే. సుందరిని వరసకి బావ అయ్యే శేఖర్, పెళ్లిచేసుకోవడానికి ముందుకొచ్చాడు. అయితే ఆమె 'మాజీభర్త' ఆస్తిలో నుండి పూచికపుల్ల కూడా తీసుకోవడానికి మాత్రం అంగీకరించలేదు. వాళ్లిద్దరి పెళ్లిఘనంగా జరిగింది.

ఇకపోతే, కోమల...రావు లింగమార్పిడి శస్త్రచికిత్స, హార్మోన్ల్ చికిత్స విజయవంత మైంది. అనతికాలంలోనే రామారావు అనే యోగ్యునితో వివాహం అయింది. కాని కోమలరావుకి పేరు మార్చుకోవాల్సి అవసరం రాలేదు. భర్త పేరులో "రావు" ఉన్నందున – భార్యాభర్తలు సుఖంగా కాపురం చేసుకుంటున్నారు. వాళ్ళిద్దరికీ మంచి ఉద్యోగాలు లభించాయి. పెళ్లైన సంవత్సరంలోపునే 'సుందరి గర్భవతైంది. "చాలా ఆనందంగా ఉన్నానే! ఇదంతా నీ చలవ" అంటోంది సుశీలతో.

సుశీల కార్యక్రమాన్నంతా దిగ్విజయంగా ఇలా పూర్త చేశాక మాత్రమే, తనతో పెళ్లి కోసం చాలా కాలంగా ఓపిగ్గా ప్రేమగా ఇంతకాలంగా ఎదురుచూస్తూ ఉండిపోయిన బాల్యమిత్రుడు "ఆనందరావు"ని పెళ్లిచేసుకుంది. ఇప్పుడు వాళ్ళిద్దరు హనీమూన్‌లో ఉన్నారు.

రచనా కాలం – 2012

# అత్తా కోడళ్ల ఒప్పందం

తన వంపుసోంపులన్నీ, నా కనుల విందుగా, మది కుదేలై పోయేలా కదిలిస్తూ విసవిసా నా గదిలోకి వచ్చి, స్థానభ్రంశం పొందిన కొంగుతో పట్టుకుని వచ్చిన వేడివేడి కాఫీ కప్పుని చురుక్కు మనేలా, నా చేతికందించి, కొంగు సర్దుకోకుండానే, ఉక్రోషంతో ఊగిపోతున్న నడుం మీద చేతులు వేసుకుని, గరం గరంగా అడిగింది నా భార్యామణి 'రమణి', "ఊ, చెప్పండి, ఎలా ఉందో కాఫీ" అని. ముద్దొచ్చేలా ఉన్న సొగసరి సతి భంగిమని, ఉక్రోషంతో ఎరుపెక్కిన బుగ్గల్ని మురిపెంగా చూస్తూ ఉండి పోయానే గాని, కాఫీ తాగడం ప్రారంభించ లేదు. దాంతో, మరింత కోపం వచ్చి, "ఏంటా వెర్రిమొర్రి చూపులు. అమ్మచేతి అమృతం కదా మరి. కాఫీ సేవించి ఎలా ఉందో చెప్పమంటుంటే అర్థం కావటంలేదా, మహానుభావా? కొడుకు మీదున్న ప్రేమాభిమానాల్ని పాలూపంచదారలా రంగరించి, స్వహస్తాలతో మీమాతృమూర్తి చేసిచ్చిందే, కాఫీ. 'అని వ్యంగ్యంగా అని వెంటనే-, "హు! ముచ్చటగా మొగుడికి స్వంతంగా కనీసం 'కాఫీ' అన్నాపెట్టిచ్చే భాగ్యం నాకుందా ఏమన్నా" అంటూ సొగదీసింది. తప్పని సరై, కాఫీ తాగటం మొదలు పెట్టేను. మొదటి గుటకతోనే అంతా అర్థమైంది. అమ్మకి బాగా తెలును, నాకెంత పంచదార కావాలో. ఈవిడే అంటే 'మా ఆవిడే', అత్తగారు చూడకుండా మరో రెండు చెంచాల పంచదార కలిపేసి తీసుకువచ్చింది, ఇలా కొన్నిసార్లు చేస్తే 'నాకునా పెళ్లాం చేతి కాఫీయే కావాలని, నిక్కచ్చిగా అమ్మకి చెప్పేస్తానని ఆశపడిందని, కుట్రపన్నిందని, అర్థం చేసుకోలేనంత 'తింగరోణ్ణి' నేను! అందుకే కష్టపడి, కాఫీ అంతా తాగేసి, కప్పు తన చేతి కందించేను మౌనంగా. దాంతో రమణికి మరింత వళ్లు మండింది. ఏదో అస్పష్టంగా గొణుగుతూ, తిట్టుకుంటూ లోపలికి వెళ్లిపోయింది.

కొంచెం నవ్వొచ్చింది. వెంటనే 'ఇదెక్కడి జటిలాతిజటిల సమస్యరా బాబూ, నా ఖర్మ! - ఈ ప్రపంచంలో ఇంకెవరికైనా ఉంటుందా ఇలాంటి "నలుగుడు"? "ఆడ" కత్తెరలో పోకలా అయిపోతోంది, నా పరిస్థితి! అత్తాకోడళ్లిద్దరూ ఎంతో అన్యోన్యంగానే ఉన్నట్లుంటారు బయటివాళ్లకి. "అమ్మాయ్" అంటూ పెద్దావిడ, అత్తమ్మా" అంటూ ఈ కొత్త కోడలు పూసుకుని, తిరుగుతుంటే, ఊసులాడు

కుంటూంటే, "బాగు బాగు" అనుకుంటారు గాని, వీళ్ల మధ్య, "కోల్డ్‌వార్", ఆధిపత్యపోరు, ఉందని వాళ్లకేం తెలుసు, వంకాయ పులుసు? ఈ కోల్డ్‌వార్‌కి, బాధితుడినైన నాకు మాత్రమే తెలుసు. ఇద్దరూ ఒకరితో ఒకరు ఎంతో బాగా ఉంటారు. మధ్యలో నన్నే చంపుకు తింటున్నారు. ఎత్తులు పైఎత్తులతో, ఇద్దరికీ నా మీదున్న అపరిమిత ప్రేమే. ఈ సమస్యకు మూలకారణమన్న అవగాహన నాకుంది కాబట్టే, ఎవర్నీ తప్పు పట్టలేక పోతున్నాను. కోడల్ని కూతురిలా చూసుకోవాలన్న సదుద్దేశంతో బాటు, ఇన్నాళ్లుగా అనుభవించిన ఆధిపత్యాన్ని వదులు కోలేక పోతున్న అమ్మ "ఆరాటం", మూడు ముళ్లబంధం ఇచ్చిన హక్కుల్ని క్రమంగానా సాధించు కోవాలన్న సతీమణి "పోరాటం", రెండూ ఎంత చికాకు పరుస్తాయో అనుభవించే వాడికే తెలుస్తుంది!.

తండ్రి చిన్నప్పుడే పోయిన నన్ను, భర్త వదలిపోయిన ఆస్తిపాస్తుల్ని జాగ్రత్తగా సంరక్షించే బంధు బలగం ఉన్న అమ్మ, అల్లారు ముద్దుగా, ఏలోటూ లేకుండా పెంచింది. అన్నీ తానే అయి, బంధువులు అన్నీచూసి, కట్నకానుకులు బాగానే బేరమాడి కుదిర్చిన సంబంధానికి, "పిల్ల నాకు పడిచచ్చేంత నచ్చిందని" నిర్ధారణ చేసుకున్న తర్వాతనే, పచ్చజెండా ఊపింది. కోడల్ని కూతురిలా చూసుకుంటానని అడిగిన వాళ్లకీ అడగని వాళ్లకీ పనికట్టుకుని చాటింది. సదరు కోడలు కూడా అత్తగారిని స్వంత తల్లికన్నా ఎక్కువగా చూసుకుంటానని, అందరికీ కాదు గాని, నాకు మొదటిరాత్రే చెప్పి ఆనందం కలిగించింది. అత్తాకోడళ్లు ఇద్దరూ, తమకి తాము స్వచ్ఛందంగా నిర్దేశించుకున్న పాత్రల్ని పోషించుకునే ప్రయత్నాల పరంపరలోనే, అసలు సమస్య ఉత్పన్నమైందంటే నమ్మండి! వాళ్లిద్దరి మధ్య వాగ్యుద్ధాలు లేమి ఉండవు. వాదోపవాదాలూ ఉండవు! కాని నిరంతర వ్యూహాలు, ప్రతివ్యూహాలు, ఎత్తులు, పైఎత్తులతో నన్ను నిత్యబాధితుణ్ణి, చేస్తున్నారు, తెలిసో తెలియకో!

సమస్య ఏంటో తెలియాలంటే, నేనెలా నలిగిపోతున్నానో, అర్థం కావాలంటే విషయాన్ని వాళ్ల దృక్కోణాల్లో విడివిడిగా పరిశీలించాలి. ముందుగా పెద్దావిడ, మా అమ్మ పరోక్షంగా తన చేతల ద్వారా తెలియజేసే దృఢమైన నిశ్చితాభిప్రాయా లేమిటంటే, కోడల్ని స్వంత కూతురిలా చూసుకోవడమే కాదు, అలా

చూసుకుంటున్నట్లు అందరికీ స్పష్టంగా కనపడాలి! కోడలి ప్రధాన బాధ్యత మొగుడితో సుఖంగా కాపురం చేయటం మాత్రమే. ఇంటి బాధ్యతలను, ఇన్నాళ్లుగా తనే, ఏ ఆటంకం, ఎవరి సహాయం లేకుండా సమర్ధవంతంగా నిర్వహించిన వాటిని కోడలి మీదకు నెట్టివేసి ఆమెను కొడుకుకి దూరం చేయకూడదు. తన వంట్లోశక్తి ఉన్నంత వరకు, ఇన్నాళ్లూ జరిగినట్లే జరగాలి. ఇంటిపై, కన్నకొడుకుపై తనకున్న బాధ్యతల్ని (పెత్తనమంటే ఒప్పుకోదు) వాడికి పెళ్లయిందికదాని తల్లివదులు కోకూడదు. అయినా తల్లిచేతివంటే కొడుకుకి అమృతతుల్యం ...............

ఏతా వాతా చూస్తే, అమ్మకి బాధ్యతలనండి, పెత్తనమనండి, ఇంత కాలంగా తనకున్న వాటిని, ఎవరితోనైనా పంచుకుంటే కన్న కొడుకు దూరమైపోతాడేమోనన్న 'అభద్రతాబావం', ఉంది. ఇకపోతే, నా భార్యామణి 'రమణికి, పెళ్లికి ముందు ఎవరు రాసిన నవలలు చదివిందో తెలియదు గాని, కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయా లేర్పడ్డాయి. అత్తగారిని బాగా చూసుకోవటమంటే ఇన్నిరోజులు కష్టపడ్డారు కదా. ఇక 'కృష్ణారామా' అనుకుంటూ ఇంటి పనుల నుండి సంపూర్ణ విశ్రాంతి తీసుకోవాలి. ఇంకోరకంగా చెప్పాలంటే, పదవీ విరమణ చేయాలి. ఇంటి "ఇంటోడి" బాధ్యత (పెత్తనం అంటే ఈ విడా ఒప్పుకోదు) అంతా కోడలికి ఆనందంగా అప్పజెప్పేయాలి. అంతేగాని కోడలు కేవలం అదనపు వ్యక్తిగా, నామమాత్రంగా ఉండాలను కోరాదు. మొత్తానికి, అమ్మ కోడలిని ఏపనీ చేయనీయటం లేదు– ఎప్పుడైనా కూరగాయలు కోయనీయటం, ఉదయాన వీధిలో చక్కగా ముగ్గు వేయనీయటం తప్ప ! అక్కడికీ, ఒకరోజు సాయంత్రం అమ్మ గుడికి వెళ్లినప్పుడు "రమణి" స్వతంత్రించి గుత్తొంకాయ కూర వండిరది. నిజంగానే బాగానే చేసింది. అయినా, అమ్మ నిర్మొహమాటంగా "అసలేం కుదరలేదు" అనేసింది. కోడలి ముఖం మాడిపోవటం గమనించి కూడా, "ఇంకెప్పుడూ ప్రయోగాలు చేయొద్దు" అని కరాఖండిగా చెప్పేసింది. వెంటనే "నేనుండగా నీకెందుకు తల్లీశ్రమ" అంటూ తన బుగ్గల్ని పుణికింది కూడా! ఇంకేం చేస్తుందీవిడ? నా వైపు క్రోధంగా' చూడ్డం తప్ప!

తర్వాత ఎప్పుడో, నాదగ్గర గొణిగింది రమణి "అందరెదురుగుండా నాతల్లే, నాబంగారమే అంటూ బుగ్గలు గిల్లుతారు, ఎంతకృత్రిమ ప్రేమో!" అని

రోజూ కోడలికి తల్లో పేలుచూసి, దండిగా బుగ్గల మీదగా కారేంతగా నూనె రాసి జడవేస్తుంది. అత్త్తగారితో వద్దని చెప్పొచ్చు కదా – అబ్బే ధైర్యం చాలదు– నాదగ్గర మాత్రం, "పేలు చూసి ఆపేస్తే బాగుణ్ణు! తట్టెడు నూనెరాసి టైటుగా, జడవేసి చంపుతున్నారు. ఖర్మ! 'శిరోజాలంకరణ కూడా నా ఇష్టం వచ్చినట్టుగా చేసుకునే స్వేచ్ఛలేదు. పాతకాలం తలకట్టుతో నేను ఊరేగాలి. ఆవిడగారికి కోడల్నెంత బాగా చూసుకుంటోందో అన్న ఖ్యాతి కావాలి"! అని కన్నీళ్లు పెట్టుకుంటాది, మేం ఏకాంతంలో ఉన్నప్పుడు అంతేనా, చుట్టుపక్కలోళ్లే కాదు, చుట్టాలందరూ – కోడలు దర్జాగా కూర్చుంటుంది, ముసలావిడతో నానాచాకిరీ చేయించుకుంటూ – అని నన్ను ఆడిపోసు కుంటున్నారంట! నేనింక భరించలేను మీ చేతగాని తనాన్ని– మా పుట్టింటికి పోతాను" – అని బెదిరించటమూ మొదలెట్టింది ఈ మధ్యన –

మా అమ్మకూడా తక్కువ తినలేదు – ఏదీ ముఖాముఖి చెప్పదు కోడల్నిదెప్పదు. కాని తను లేనప్పుడు 'నా రాత ఎలా ఉందో – అడ్డాల నాడు బిడ్డలు గాని గడ్డాలనాడు కాదేమో!' ఇలా ఒకసారి, "నా కొడుకు అందరిలాంటి వాడు కాదు, తల్లే సర్వస్వం" అని ఇంకోసారి అని పరస్పర విరుద్ధంగా మాట్లాడు తుంది.

అమ్మలో అభద్రతాభావం, 'రమణి'లో "అసహనం", పెరుగుతూనే ఉన్నాయి. ఒకరోజు, అమ్మ, మా ఆవిడ వింటూండగానే, 'నా కొడుకుకి నా చేతి వంట తప్ప ఎవరు చేసినా నచ్చదు' అంది. ఎందుకనో ఆరోజే వడ్డించే ముందు వండిన బీరకాయ కూర రుచి చూసి, "అయ్యో, ఉప్పు చాలా ఎక్కువైపోయింది. ఇప్పుడెలా" అని కన్నీళ్ళు పెట్టుకుంది. అప్పుడు 'రమణి' ఎప్పుడూ లేని చొరవ తీసుకుని, కూరగిన్నెలో కొంచెం నీళ్లుపోసి, రెండు బంగాళ దుంపముక్కలు వేసి పొయ్యిమీదపెట్టి, కాసేపు మళ్లీమరిగించింది. ఎక్కువైన ఉప్పుని పీల్చుకున్న దుంపముక్కల్ని తీసేసి కూర వడ్డించింది. కూర బాగుంది కదా" అని నన్నడిగి ఔననిపించింది. అంతతో ఆగకుండా "బాధ పడకండి అత్తమ్మగారూ. వయసొచ్చేక ఎవరికైనా కొంత మతిమరపురావటం సహజం" అని మామూలుగానే అంది, అమ్మముఖం మాడిపోయింది. బుటబుటా మళ్లీ కన్నీళ్లు కార్చింది. ఆరోజు రాత్రి

మా ఆవిడ– “నేను కుట్రపూరితంగా మీ అమ్మగారు చూడకుండా బీరకాయ కూరలో కావాలని మరింత ఉప్పువేసి చెడగొట్టానని, అనుమానిస్తున్నారు కదా– అప్పుడెప్పుడో తను చేసిన కాఫీలో కొంత పంచదార కలిసిన మాట నిజమేగాని, ఈ సారి అలాంటి వెధవ పనేమీ చేయలేదండీ నన్ను నమ్మండి.నన్ను నమ్మండీ” అని నన్ను గట్టిగా పట్టుకుని ఏడ్చేసింది. నమ్ముతున్నానని చెప్పే వరకు ఊరుకోలేదు.

ఈ సంఘటన నాలో కొత్త ఆలోచనల్ని రేకెత్తించింది.

రెండు రోజుల తర్వాత, ఆదివారం మధ్యాహ్నం భోజనాల తర్వాత, ఇద్దర్నీ హాల్లో కూర్చోబెట్టి – “వివరాలనవసరం గాని నేను తొందరలో వేరే ఊరికి బదిలీ చేయించుకుని పోతాను. ఒక్కడినే ఉంటానక్కడ. మీరిద్దరూ ఇక్కడే కలిసి ఉంటారో ఎవరి పుట్టింటికి వాళ్లుపోతారో అది మీ ఇష్టం. మనం ముగ్గురం ఒకేచోట ఉండలేం – అంతే” అని స్పష్టంగా చెప్పేసి వాళ్ల ప్రతిస్పందన కవకాశమీయకుండా, గదిలోకి పోయి తలుపేసుకుని కూర్చున్నాను. సాయంత్రం వరకు అలాగే ఉండిపోయేను. వాళ్లమాటలేవీ లోపలికి వినపడలేదు గాని, అత్త కోడళ్లిద్దరూ చాలా సేపు సుదీర్ఘంగా సామరస్యంగా, మనసులు విప్పి మాట్లాడు కుంటున్నారనిపించింది. ఏ క్షణానైనా నా దగ్గరికొచ్చి, చెరోపక్క కౌగిలించుకుని, భోరున ఏడిచేస్తూ “మేం ఇద్దరం పరస్పరాంగీకారంతో ‘‘ఇంటి పని, పెత్తనం ‘‘విభజన, ఫార్ములా’’ రూపొందించుకున్నాం,’’ అని అంటారని ఆశించాను. కాని వాళ్లు లోపలికి రానేరాలేదు. నాకు డిన్నర్‌కి పిలుపూ రాలేదు, ఇంక ఆగలేక తలుపులు తీసి చూశాను. చర్చలు ముగిశాయనే దానికి స్పష్టమైన సంకేతంగా అత్తాకోడళ్లిద్దరూ సోఫాలో సన్నిహితంగా కూర్చుని ఉన్నారు. నన్నుచూసి కూడా ముసి ముసి నవ్వులు చిందించారు గాని ఏమీ మాట్లాడలేదు. నాకుబాగా వళ్లు మండింది. అమ్మని ఏమీ అనలేక పెళ్లాన్ని గదమాయించి అడిగేను. “చాలాసేపు చర్చించుకున్నారు కదా! ఏమి నిర్ణయించుకున్నారు” అని “నీ పుట్టింటికి వెళ్లిపోతావా?” అని రెట్టించాను. వెంటనే సమాధానమిచ్చింది అమ్మ” – అమ్మో మేమిద్దరం ఒకళ్లని విడిచి ఒకళ్లం ఉండలేంరా అంది. వెంటనే భార్యామణి అందుకుంది. ‘‘మిమ్మల్నీ విడిచి ఉండలేమండీ. మేం నిర్ణయించుకున్న పరిష్కారమేమంటే మేం ఇద్దరం ఏ పనీ చేయకుండా హాయిగా కూర్చుంటాం. మీరేమో మంచి కొడుకుగా, మంచి భర్తగా

అన్ని ఇంటి పనులు అంటే వంట బట్టలుతకటం, అంట్లుతోమటం, ఇంకా ముగ్గులు వేయటం చేస్తారన్నమాట సరేనాండీ–"

"ఇదేం పితలాటకంరా బాబూ" అని నిర్ఘాంతపోయిన నన్ను సముదాయిస్తూ అమ్మ చెప్పింది. "అదేం కాదులేరా. దాని చిలిపి మాటలకి గాభరాపడకు. మేం పరస్పరాంగీకారంతో ఇద్దరిలో 'ఎవరు ఏరోజు ఏ పని ఎంత ఎలా చేయాలో, నిర్ణయాని కొచ్చేం. నీకే ఇబ్బందీ ఉండదు ఇకమీదట. కాని మాపని విభజన వివరాలు నీకు చెప్పాల్సిన అవసరంలేదు. మేమే ఎప్పటికప్పుడూ సందర్భం, అవసరాన్ని బట్టి మార్పులు చేసుకుంటాం, నీ బోడిజోక్యం లేకుండా. ఇంకో సంగతి నీక్కూడాచెప్పలేదంట. నాకే ముందు చెప్పింది నా బంగారు తల్లి– నీ పెళ్లాం నెల తప్పింది. – త్వరలో నాకు మనవడో, మనవరాలో వస్తుందన్న మాట. ఇప్పుడే చెబుతున్నా రాబోయే బిడ్డమీద సర్వాధికారాలు మాత్రం నాన్నమ్మవే. సరేనా.........."

పని విభజన జరిగిందన్న సమాచారం, నాన్న కాబోతున్నానన్న వార్త నాకుచాలా ఆనందాన్ని కలిగించాయి. 'పుట్టబోయే బిడ్డ గురించి ఏం తగాదాలు జరుగుతాయో' అని ఇప్పట్నుంచీ అనుమానించటం అనవసరమనిపించింది.

రచనా కాలం – 2012

# తూచ్! అంతా అబద్ధం

ఈ రోజుల్లో సంపన్న కుటుంబాలవారు, నూతన దంపతులకు కావల్సినంత ప్రశాంత ఏకాంతాన్ని కల్పించడానికి, వాళ్ల తొలిరాత్రిని వధువు పుట్టింట్లో కాకుండా, ఏదో ఖరీదైన హెూటల్ గదిలో ఏర్పాటు చేయటమే సముచితమని భావిస్తున్నారు కదా! ఆరోజు ఉదయాన్నే నగరంలోని ఒకప్రముఖ ఫంక్షన్ హాల్‌లో, సంప్రదాయ బద్ధంగా, "రాజేంద్ర"ను పెళ్లాడిన, తన చెల్లి "శోభన"ను, అక్క "శ్రీవల్లి" మూడు నక్షత్రాల హెూటల్‌లోని "శోభనం గది"లో దిగబెట్టడానికి వచ్చి, తనని సోఫాలో కూర్చోబెట్టి, "బ్రైడల్" సూట్‌ని నిశితంగా పరిశీలించింది.

సుగంధ భరితంగా, పూల రథంలా అలంకరించబడ్డ విశాలమైన హంసతూలికా తల్పాన్ని సరిగంగ స్నానాలు చేయటానికి సరిపడే వైశాల్యం, సదుపాయం ఉన్న"అటాచ్డ్ బాత్‌రూమ్"ని ఏకాంతానికి భంగ పరచని విధంగా కిటికీలన్నీ మూసివేయబడి, అందమైన తెరలతో కప్పబడిఉన్నా ఉక్కబోతకు తావీయని ఏసీ సౌకర్యం, ఒకవేళ అవసరమనిపిస్తే "కార్యక్రమ విరామ సమయాల్లో" ఉపశమనం, "పునరుత్తేజం" పొందడానికి సిద్ధంగా ఉంచిన మ్యూజిక్ సిస్టమ్, పాటల కేసెట్లు, వీటితో పాటు ఒక మూలన టేబిల్ మీద స్వీట్లూ, చాక్లెట్లతోబాటు, కాఫీమిషన్, కాఫీ, టీ, పాలపొడి పేకెట్లు అన్నీచూసి తృప్తిగా తలపంకించింది శ్రీవల్లి రెండేళ్లక్రితం, ఇంట్లోనే జరిగిన తన తొలిరాత్రికి సంబంధించిన పలు తీపి, చేదు జ్ఞాపకాలు గుర్తు కొచ్చి ఆమె బుగ్గలు గులాబులయ్యాయి.

"నేనింక వెళ్తానే – ఇంటికి తీసుకుపోవడానికి పొద్దున్నే వస్తాను. కంగారు పడకు మరీ పొద్దున్నే వచ్చి తలుపు తట్టన్లేవే, "ఆలస్యంగానే వస్తాను", అంటూనే ఒకసారి చెల్లి వైపు చూసింది, ఏదో మాటకి మాట చెప్తాదేమో అన్న భయంతో. కాని, తన సహజ స్వభావానికి విరుద్ధంగా మౌనంగా, నిర్లిప్తంగా ఉండిపోయిన శోభనను చూసి విస్మయం చెందింది. ఎప్పుడూ చలాకీగా ఆత్మ విశ్వాసంతో చిలిపి మాటలతో, చేష్టలతో అందర్నీ అలరించే నా చెల్లి ఇప్పుడిలా ఉందేమిటో పాపం' అని జాలి పడింది. ఆ క్షణంతో చెల్లి చిలిపి పనులు కొన్ని గుర్తుకొచ్చేయి. తనకు నాలుగేళ్ల వయసున్నప్పుడే తులసి దళాల మధ్య తను తాకకుండా కొన్ని "దురదగొండి"

ఆకులు కలిపి తెచ్చి బామ్మ చేతిలో పోస్తే"నాతల్లే నా పూజ కోసం తెచ్చావా?" అని భక్తి పారవశ్యంతో చెంపలకు అద్దుకున్న బామ్మ వెంటనే దురదతో గగ్గోలు పెట్టింది.

ఇంకోసారి ఐదోతరగతి చదువుతున్నప్పుడు కుర్చీలో నిద్రపోతున్న తెలుగు పంతులు గారి పిలకలో మందారపువ్వు తురిమింది. ఇంకోసారి, "మావయ్యా మీ శ్రీమతి వీధిలో ఎవడికో 'ముద్దెట్టింది' అని ఆయన కోపంగా చూస్తూంటే, ముష్టోడికి అన్నం ముద్ద పెట్టిందిలే అని పలికి, అందర్నీ నవ్వించిన చమత్కారి, మాటకారి ఇది. బాల్యం నుండీ చిలిపిది. రెండేళ్లక్రితం కూడా శోభనం రాత్రికోసం ఆత్రంగా ఎదురు చూస్తున్న బావగారి అంటే నా భర్త చెవిలో "బేడ్‌లక్ "అది" పోస్ట్‌పోన్ అయిపోయింది. ఇప్పుడే అక్కకి పిరీయడ్స్ వచ్చాయి" అని అబద్ధం చెప్పి కాసేపు ఏడిపించి ఆట పట్టించింది. అలాటి చిలిపిది ఇప్పుడేమిటి ఇలా డల్‌గా ఉంది. ఇంకా మొగుడు రాలేదనా". చెల్లిని ఓదార్చాలనిపించి, "రాజేంద్రవచ్చేసే టైమయ్యింది హుషారుగా ఉండాలి. "స్వంత కంపెనీ డైరెక్టర్ల మీటింగుంది. అదైన వెంటనే హొటల్‌కి డైరెక్టుగా వచ్చేస్తానని నాన్నతో చెప్పాడంట, కదా వచ్చేస్తాడులే. అతగాడికి మాత్రం "ఆత్రం ఉండదా, తొందరుండదా, నిన్ను తనలో కలిపేసుకోవాలని "సొంతం చేసుకోవాలని" అంది.

శోభన మౌనం వీడలేదు. దాంతో ఏదో కొంటెగా మాట్లాడి, తనలోని చలాకీతనాన్ని మేల్కొనేలా చేయాలనిపించింది శ్రీవల్లికి. "ఆల్ ది బెస్ట్ ఫర్ యువర్ ఫస్ట్‌నైట్ రా – బట్, టేక్ కేర్ ఆఫ్ యువర్ .. ఎత్తుగా ఉండే తన వక్షసంపద కేసి 'మగాడి'లా చూస్తూ ఇంకా ఏదో అనబోయింది. మాటలు మింగేసింది. చెల్లి కళ్లల్లో సుళ్లు తిరుగుతున్న నీళ్ళు చూసి ఎంతన్నా ఆడపిల్లకదా – కంగారు పడిపోతోంది పాపం "సహజమేకదా" అనుకుంటూ నెమ్మదిగా బయటికి వెళ్లిపోయింది. "ఇంక వస్తాను" అని సైగచేసి హొటల్‌గదిలో, ఒంటరిగా మిగిలిపోయింది శోభన.

పాపం అక్కకేం తెలుసు 'వచ్చేస్తాడు' అనుకుంటోంది. పెళ్లిచూపుల రోజున ఏం జరిగిందో తనకి తెలియదు కదా. చేతులారా, నోరారా, నా జీవితాన్ని నేనే నాశనం చేసుకున్న సంగతి తెలియక, రాజేంద్ర వస్తాడంటోంది. కాని నాకు తెలుసు. రాడు – రాడు అనుకుంటూ తలబాదుకుంది. ఇంతకీ పెళ్లిచూపుల రోజు ఏం జరిగింది?

నిజానికి పెళ్ళి చూపులకి తల్లితండ్రులతో సహా వచ్చిన రాజేంద్ర రూపం, చదువు, హోదా, ప్రవర్తన, శోభనకి బాగా నచ్చేయి. కాని బాల్యం నుండీ ఉన్నబుద్ధి అదే ఎవరినైనా ఏ సందర్భంలోనైనా, ఆటపట్టించాలనే చిలిపి తనం నీ తలలో పురుగులా మెదిలింది. అతడిని ఓరగా, పరవశంగా చూస్తూనే, కాబోయే భర్తని ఆట పట్టించాలని నిర్ణయించేసుకుంది. అంతలో ఇరు కుటుంబాలకి సన్నిహితుడైన మార్తాండశాస్త్రి కంచు కంఠం మోగింది 'అంతే ఓకే అంతా ఓకే ముహూర్తం పెట్టుకోవటమే తరువాయి. కానైతే ఈ ఆధునికయుగ ధర్మాన్ని కూడా పాటిద్దాం. కాబోయే దంపతులకి రెండు నిమిషాలు ఏకాంతంగా మాట్లాడుకోవడానికి వాళ్లవాళ్ల షరతులని చెప్పుకోవడానికి అవకాశమిద్దాం' అన్నాడు సరదాగా.

ఆ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నట్లుగా, శోభన వెంటనే లేచి హాల్లో ఉన్నమెట్ల మీదుగా వయ్యారంగా నడుస్తూ పై గదిలోకి వెళ్లింది. కొంచెం తటపటాయిస్తూనే, రాజేంద్ర అనుసరించాడు. తానైతే మనసులో ఈ అందాల రాశిని భార్యగా పొందే అదృష్టాన్ని వదులుకోరాదు. ఒకవేళ వంట నువ్వే చేయాలి. వేరు కాపురం పెట్టాలి వంటి షరతులు విధించినా సరే అనుకుంటూ...

ఎవర్నయినా ఆటపట్టించాలను కున్నప్పుడు శోభనని ఏదో ఒక వింత శక్తి ఆవహిస్తుంది. మాటలు గల గలా పారుతాయి. రాజేంద్ర తన ఎదురుగా కూర్చుని బెదురు చూపులు చూస్తుంటే ఇంకా రెచ్చిపోయింది. సూటిగా అతని కళ్లల్లోకి చూస్తూ స్పష్టంగా పలికింది. "మిస్టర్ రాజేంద్ర! దయచేసి నేను నచ్చలేదని చెప్పి వెళ్లిపోండి." నిర్ఘాంతపోయిన రాజేంద్రకి నోట మాట రాలేదు. కాసేపటికి ఎలాగో తేరుకుని అన్నాడు. "నాకు బాగా నచ్చేరు. మీకు నేను నచ్చలేదా?" అతని బేలతనాన్ని గ్రహించిన శోభనకి ఇంకా ఆటపట్టించాలనే అనిపించింది.

"ఇంకెవర్నో పెళ్లి చేసుకోవటమే మీకు మంచిది. ఎందుకంటే, మరి మరి నన్ను చేసుకుంటే మీకు "అది" "అది" ఉండదు మన మధ్య "అది" ఉండదన్నమాట" ఏమీ అర్థం కానట్లుచూస్తున్న అతడిని చూసి "మరీ పప్పు సుద్ధలా ఉన్నాడు" అనుకుని, ఈ సారి అతని వంక కాకుండా ఎటో శూన్యంలోకి చూస్తూ అంది. "అది అది అంటే... స్నేహితుల్లానే ఉండి పోవాలన్నమాట. అబ్బ ఇంకా అర్థం

కాకపోతే నేనెలా చావాలి... సరే తెలుగులో "సంసార సుఖం" ఇంగ్లీషులో "సెక్స్" అన్నపదం పచ్చిగా పలకలేకఆగిపోయింది. కాని అంతలోనే మళ్ళీ రెచ్చిపోయింది. "ఏవండోయ్... లెస్బియనేమో... ప్రిజిడిటీఏమో కొంచెం ఓపికపడితే, దార్లోకి వచ్చేస్తాదేమో అనే పిచ్చి ఆలోచనలు పెట్టుకోవద్దు. అదేంకాదుగాని నేను, ఆ కృష్ణుడికి అంకితమైపోయాను. తలమాసిన కృష్ణారావ్ ఎవరో అనుకోవద్దు సాక్షాత్తు శ్రీ కృష్ణ పరమాత్మకు అంకితమైపోయిన "మీరాబాయి నేను" అనేసి భక్తి పారవశ్యంతో నాటకీయంగా చెంపలు వాయించుకుంది. ఇంకో వైపు తిరిగి కూర్చుంది. కాసేపు ఇద్దరి మధ్యన మౌనం రాజ్యం చేసింది.

"ఇంక చాల్లే ఆటపట్టించటం" అనుకుని అంతా "తూచ్" అని చెప్పేద్దా మనుకుని అతనివైపు తిరిగింది. కాని అతను లేడు. వెళ్లిపోయేడు....!! హతాశు రాలైపోయింది. పశ్చాత్తాప భారంతో ఉన్న చోటనే కూలబడిపోయింది. "అయ్యో ఎంత బుద్ధి తక్కువగా అంతటి మంచివాణ్ని అందగాడిని భర్తగా పొందే అవకాశం పోగొట్టుకున్నాను" అని బాధపడింది. చేసిన తప్పు ఎలా సరిదిద్దుకోవాలి? పోనీ వెంటనే కిందికి వెళ్లి.... కాని వెళ్లి సిగ్గు లేకుండా అతనికి, అందరి ఎదురుగా ఏంచెప్పాలి? ఇలా ఆలోచించుకుంటూ ఉండిపోయింది కాసేపు. కొంతసేపటికి వచ్చిన కార్లలో, అతిథులంతా వెళ్లిపోయినట్లు అర్థమైంది. తేలుకుట్టిన దొంగలా ఉండిపోయింది.

ఎన్నినిముషాలు గడిచిపోయాయో తెలియరాలేదు. కాని అమ్మ పైకి వచ్చి శోభన బుగ్గలు ఆప్యాయంగా నిమురుతూ "అదృష్టవంతురాలివే నువ్వు ఎంత మంచి సంబంధం కుదిరిందో – మార్తాండశాస్త్రిగారు ముహూర్తం పెట్టేశారు, వచ్చే రెండు నెలల్లో మంచిరోజులు లేవని వచ్చే ఆదివారానికి ముహూర్తం పెట్టేశారు. ఇంత తక్కువ సమయంలోఎలా చేసుకోవాలో ఏంటో పెళ్లిపనులన్నీ" అంటూ కిందికి హడావిడిగా వెళ్లిపోయింది. అమ్మ మాటలతో శోభనలో ఉత్సాహం ఆనందం పెల్లుబికిపోయాయి. దాంతోపాటు విస్మయమూ కలిగింది. "ఈ సంబంధం వద్దని రాజేంద్రఎందుకు చెప్పలేదా 'అని సరే ఏమైతేనేం, ఎలాగోలా అతడికి క్షమాపణలు కోరుకుని చెప్పిందంతా శుద్ధ అబద్ధం – మన మధ్య"అది" పుష్కలంగా ఉంటుంది

అని చెప్పటం "ధర్మం" అని నిర్ణయించుకుంది. కాని కుదరలేదు పాపం. శోభన రాజేంద్రని మళ్లీ పెళ్లిపీటల మీదనే చూడగలిగింది. ఎందుకంటే, పెళ్లిచూపులైన మర్నాడే ఎలాగోలా వాళ్ల ఇంటి "లాండ్‌లైన్" నెంబరు తెలుసుకుని ఫోను చేస్తే 'కాబోయే అత్తగారు' ఫోన్‌ఎత్తింది. తను తడబడుతూంటే, నవ్వేసి "మావాడు లేడమ్మా- ఎప్పుడూ బిజీయే - ఇందాకనే బాంబే ఫ్లైటుకి వెళ్లిపోయేడు. ఏదో బిజినెస్ పనుందంట పెళ్లిరోజు ఉదయానికి తిరిగివస్తాడు" అని చెప్పింది. పర్సనల్ సెల్ నెంబరు అడగడానికి సిగ్గు పడింది శోభన.

తన 'పిచ్చివాగుడు రాజేంద్ర ఎవరికీ వెల్లడించలేదని నిర్ధారణ అయిపోయింది కాని" పారిపోయేడు, పెళ్లి తప్పించుకోవడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ పెళ్లిరోజుకి తిరిగి రాడు. అట్నుంచి అటే ఏ లండనో చెక్కేస్తాడు అన్న ఆందోళనతో గడిపేసింది కాలమంతా భారంగా పెళ్లిపీటల మీద రాజేంద్రను చూసే వరకు శోభన ఆందోళన తగ్గలేదు.

పెళ్లి బట్టల్లో మెరిసిపోతున్న అతడిని చూసి మురిసిపోయింది. తనకు తెలియకుండానే తన ఉత్సాహం సంతోషాన్ని పలువిధాల ప్రదర్శించింది. తన మెడలో మూడు ముళ్లుపడుతున్న సందర్భంలో పరవశించి పోయింది. సప్తపది, పరస్పరం తలంబ్రాలు పోసుకోవడం, పూల గుత్తులతో కొట్టు కోవటం, నీళ్ల బిందెలో ఉంగరం వెతుక్కోవటం వంటి పెళ్లి వేడుకలలో చాలా చలాకీగా, చనువుగా, సన్నిహితంగా ప్రవర్తించింది. వీలైనప్పుడల్లా అతడిని అవసరానికి మించి తాకుతూ, ఈ శరీరం నీతోలీనమై పోవడానికి ఎంతో ఆత్రంగా ఉందని, పరోక్షంగా తెలియచేయడానికి శత విధాలా ప్రయత్నించింది. పెద్దగా ప్రతిస్పందన కనపడడం లేదేమిటని వాపోయింది మనసులోనే. మరీ పప్పుసుద్దలా ఉన్నాడు నామొగుడు అని విసుక్కొంది. వివాహవేదిక పైనే, అందరి ఎదురుగానే మొగుడిని గట్టిగా ఉక్కిరి బిక్కిరయ్యేలా కౌగిలించు కోవాలని కూడా అనుకోపోలేదు. కాని 'బాగోదులే, అనుకుని ఊరుకుంది'. సర్లేహోయి నీ బడాయి. "తొలిరాత్రి పడతా నీ పని"అని పళ్లునూరుకుంది ఉక్రోషంగా.

ఇప్పుడేమో, ఇలా శోభన అక్క వెళ్లిపోయిన తర్వాత, మొగుడి'పని పట్టడానికి' హొటల్ గదిలో ఎదురుచూస్తూ ఒంటరిగా ఉంది. కాలం భారంగా గడుస్తోంది. శోభన మదిలో అనుమాన భూతం మళ్లీ గంతులేస్తోంది. ఈయన రాడుగాకరాడు. నా ఖర్మకాలి, "అది" ఉండదు. అని నేనే చెప్పి చచ్చాను కదా. ఎందుకు వస్తాడు? రాడు, నేను రేపు అందరికీ ఏం చెప్పుకోవాలి. ఖర్మ ఎంత అభాసు!

'ఒకవేళ ఆలస్యం అయినా వస్తే వదిలి పెట్టరాదు ఆయన్ని ఎలాగోలా వశం చేసుకోవాలి. కానీ ఏం చేయాలి? పోనీ ఒకపని చేస్తే, ఆయన వచ్చి తలుపు తట్టితే అప్పుడే హడావిడిగా బాత్‌రూమ్ లోంచి వచ్చినట్లు, పూర్తిగా నగ్నంగా కాదు గాని, చీరలేకుండా, కేవలం లంగాతో ఉండి తలుపు తీసి సిగ్గుపడుతూ ఆయన్ని అల్లుకు పోతే, 'గురుడు' ఢంగై పోడా లొంగి పోడా. ఆ ఆలోచన వచ్చిన వెంటనే శోభన దిగ్గున లేచి, పైట పిన్ను తొలగించింది. జాకెట్ హుక్సు తప్పిస్తున్నప్పుడు ఒక అనుమానం వచ్చింది. ఒకవేళ తనని దిగబెట్టడానికి అక్క వచ్చినట్లుగా ఆయన గారితో వాళ్లమ్మ గాని అక్కగాని వస్తే అమ్మో... ఇంకేమన్నా ఉందా అనుకుని నిరుత్సాహంగా మళ్లీ కూర్చుంది.

ఎంతకాలం గడిచిపోయిందో  అర్థం కాలేదు గాని బయట బూటు చప్పుళ్లు వినబడ్డాయి. డోర్‌బెల్ మోగింది. లేద్దామనుకున్నంత లోనే గడియ వేయని తలుపులు మెల్లగా తెరుచుకున్నాయి.  ఫుల్‌సూట్‌లో లోపలికి వస్తున్న రాజేంద్రను ఒంటరిగానే వచ్చిన 'నాధుడి'ని చూసిన శోభన ఆనందంతో పరవశించి పోయింది. లేచి నిలబడిందిగాని, ముందుకు వెళ్లడానికి వణుకుతున్న కాళ్లు సహకరించ లేదు. అతనూ తనవైపు చూడకుండా మౌనంగా సోఫాలో కూర్చుని బూట్లు విప్పుకున్నాడు. "ఏమిటీ బుద్ధావతారం, శోభనం గదిలోకి ఫుల్‌సూట్‌లో వస్తారా ఎవరన్నా" అన్నప్రశ్న శోభన మదిలో మెదిలి అప్రయత్నంగా నవ్వొచ్చింది. అతను తనవైపు చూడకుండానే, కూడా తెచ్చుకున్న లెదర్ బేగ్‌లోంచి కుర్తా పైజమా సెట్ తీసుకుని బాత్‌రూమ్‌లోకి దూరిపోయేడు. బాత్‌రూమ్‌లోంచి అతను షవర్ బాత్ చేస్తున్న శబ్దాల్ని వీనుల విందైన సంగీతంలా వింటూ శోభన 'నామొగుడు సరసుడే శృంగారానికి శుచి కూడా ముఖ్యమని, తెలుసుకున్న వాడేనన్నమాట' అనుకుంది.

స్నానం ముగించుకుని గ్లాస్కో లాల్చీ పైజమాలతో బయటికి వచ్చిన రాజేంద్ర మూగనోము వీడకుండానే చకచకా వెళ్లి కాఫీ తయారు చేస్తుంటే అబ్బురంగా చూస్తుండి పోయింది. ఒకఫ్లైయింగ్ కిస్ విసురుదామనుకుంది కాని మహానుభావుడు ఇటు చూస్తే కదా. కుదరలేదు. “నాకు తెలుసున్న కుర్రాడొకడున్నాడు. కాఫీ బాగా పెడతాడు. వంట కూడా బాగా వచ్చనుకుంటాను’అని చెప్పే టీవీ ప్రకటన గుర్తొచ్చి శోభనకి నవ్వొచ్చింది. ఇంతలో శోభనకి ఒకకప్పు ఇచ్చి ఎదురుగా కూర్చున్నాడు రాజేంద్ర. వద్దన కుండా ఒకసిప్ తాగి “అద్భుతం” అనుకుంది. “కాఫీ బాగుంది. మీరిలా ఇవ్వటం ఇంకా బాగుంది” అనాలనుకుంది కాని నోరు పెగలలేదు.

అప్పుడు కళ్లల్లోకి సూటిగాచూస్తూ నోరు విప్పేడు రాజేంద్ర! “నా గురించి నీకేం తెలుసు శోభనా?” ఎలోగో కష్టపడి ఒక్కోపదం పలికింది. “మీరు మీరు నైస్ గై – అంది. ‘ఎందుకంటే ఇలా ఏ మగాడూ పెళ్లానికి కాఫీ పెట్టివ్వడు ఈగో లేకుండా, ఇలా ఇంకా ఏమో చెప్పాలనుకుంది. కానీ రాజేంద్ర కట్ చేశాడు.

“కాదు – కాదు – “గై”ని కాదు ‘గ’ గుణింతంలో మరో పదాన్ని“గే”ని. నిర్ఘాంతపోయినది – మనసు మొద్దుబారి పోయింది. నోట మాట రాలేదు.

“నీ కర్థమైనట్లులేదు. “ట్రాన్స్‌జెండర్‌ని” అన్నమాట – అబ్బ ఇంకా అర్థం కాలేదా? తెలుగులో నపుంసకుడు అంటారు. ఓటర్లలిస్టులో “ఇతరులు” అని రాస్తారు. కాబట్టి మనం “అది” లేని జంటగా ఉండొచ్చు. నువ్వు కోరుకున్నట్లుగా స్నేహితులుగా ఉండొచ్చు. ఏం కంగారు పడొద్దు. సరేనా.... ”

ఇంకా అర్థం కాకపోవటమే ముంటుంది? కాదంటే ఆ మాట మనసు కెక్కడానికి కొంత సమయం పట్టిందంతే!

అతని మాటలు బాగానే అర్థమయ్యాయి. దిగ్గున లేచింది. కళ్లల్లో నిప్పులు కురిపిస్తూ “ఛీ! నీచుడా– దుర్మార్గుడా– నా జీవితం నాశనం చేసేశావ్. కొజ్జాగాడివి నన్నెందుకుపెళ్లిచేసుకున్నావురా? నిన్నుచంపేస్తారా! అని గట్టిగా అరిచి అతనిపైకి ఆడబెబ్బులిలా ఉరకబోయింది. కాని వెంటనే దు:ఖం ముంచుకొచ్చి కూలబడిపోయి వెక్కి వెక్కి ఏడ్చేసింది. ఏడుస్తూనే ఉండిపోయింది.

రాజేంద్ర ఆమెను పట్టుకుని లేపి, హృదయానికి హత్తుకున్నాడు. విస్తుపోయిన శోభన ఉక్రోషంగా ఏదో అనుబోయి అతడి ముఖంలో కొంటె నవ్వుని, గుర్తించి "అంతా అబద్ధం తూచ్ కదా" అని మౌనంగా అడిగింది. ఔనన్నట్లు అతను తలూపేసరికి ఇంక ఆగలేక మొగుడ్నిగట్టిగా కౌగిలించుకుంది. వెంటనే ఉక్రోషం వచ్చి అతని గుండెల మీద గట్టిగా బాదింది. "ఎంత పచ్చి అబద్ధం చెప్పావురా నా చిలిపి కృష్ణా" అని గొణుగుతూ –

– ఇంకా ఏం చెప్పాలి. శోభన "శోభనం" దిగ్విజయంగా లేదా రాజేంద్ర విజయంగా" రసవత్తరంగా జరిగిపోయింది.

ఇంతకీ "అది"ఉండదని చెప్పినా, శోభనని రాజేంద్ర ఎందుకు పెళ్లిచేసు కున్నాడో కూడా తెలుసుకోవాలి కదా– పెళ్లిచూపులకి ముందు రోజున శోభన నాన్న రాజేంద్రని కలుసుకుని 'తన కుమార్తె చిన్నప్పట్నుంచీ చేసిన చిలిపి పనులన్నీ ఏకరువు పెట్టి ఏదో చిలిపి పనిచేస్తుంది. నిన్ను కూడా "ఆటపట్టిస్తుందని" నాకు అనుమానంగా ఉంది. ఫలానా అని చెప్పలేను గాని "అని హెచ్చరించి నందువలన "అది" ఉండదని శోభన చెప్పింది" అబద్ధం. అంతా తూచ్ అని గ్రహించినందు వలన.